# పూజాహోమ కల్పతరువు

బ్రహ్మచారి విష్ణు సేవానన్ద

శ్రీ వ్యాసాశ్రమము





# పూజాహోమకల్పతరువు

## PUJAHOMA KALPATARUVU




సంకలన కర్త

**బ్రహ్మచారి విష్ణుసేవానన్ద**

శ్రీవ్యాసాశ్రమము (పోస్టు)

ఏర్పేడు, చిత్తూరు (జిల్లా)

2000 నుండి 2003 వ సం॥ వరకు 5 ముద్రణలు 7,000 ప్రతులు
2004 వ సం॥ 6 వ ముద్రణ 3,000 ప్రతులు
2005 వ సం॥ 7 వ ముద్రణ 5000 ప్రతులు

వెల : 80-00

గ్రంథ ప్రాప్తిస్థానం :

శ్రీ వ్యాసాశ్రమము (పోస్టు)
ఏర్పేడు (వయా)
చిత్తూరు జిల్లా - 517 621
ఫోన్ : 08578 - 287528

మాస్టర్ బుక్‌సెంటర్
చిన్న బజారు వీధి
తిరుపతి - 517 502
ఫోన్ : 0877 227785

శ్రీమలయాళస్వామి గ్రంథ విక్రయశాల
ఆస్థాన మండపము
తిరుమల (పోస్టు)
చిత్తూరు జిల్లా.

ముద్రణ :

శ్రీ పారాశర్య ప్రెస్
శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడు, చిత్తూరు జిల్లా.




# ముందుమాట

పవిత్రాత్మ స్వరూపులారా!

మనభారతావని అత్యంత పునీతమైనది. ఇందు గంగా, యమునా, సరస్వతీ మొదలగు పుణ్యనదులెన్నియో పావనములై ప్రవహించుచున్నవి. ఈ పుణ్యభూమియందు యెందరో సాధుమహాత్ములు, సాధ్వీమ తల్లులు, యోగులు, సిద్ధులు, ధర్మాత్ములైన చక్రవర్తులు అవతరించిరి. శ్రీమన్నారాయణుడు దశావతారములెత్తి దుష్టశిక్షణ, శిష్టరక్షణ గావించినది యిచ్చటనే. నాలుగు వేదములు, ధర్మశాస్త్రములు, పురాణములు, యితిహాసములు మొదలైనవి యిచ్చటనే వెలసినవి. ప్రాచీన కాలము నుండి మన దేశము ఆధ్యాత్మిక సంపదకు ఆలవాలమై, అన్ని దేశములకు తలమానికమై చరిత్ర ప్రసిద్ధి నొందియున్నది. ఇట్టి పవిత్ర భూమియందు యనాదిగా మానవుడు యజ్ఞయాగాదుల ద్వారా ఉపాసనలద్వారా. తపస్సుల ద్వారా భగవత్సాక్షాత్కారం బొంది ముక్తిని బడయుచున్నాడు.

నేడుమనము మన హైందవ సంస్కృతిని, మన ధర్మమును, మన సంప్రదాయములను వదలి పాశ్చాత్య నాగరికతకు ప్రాకులాడుట అవివేకము. ఈవిధానము భారత జాతికే తలవంపు. మన ప్రాచీన కాలపు సంప్రదాయములన్నియు యాత్మోన్నతికి సాధనములుగా నుండేవి. బ్రహ్మముహూర్తమున లేచుట, కాలకృత్యములు తీర్చుకొని, స్నానమాచరించి యిష్టదేవతారాధననుజరుపుకొని నిత్యజీవనములో ప్రవేశించుటపరిపాటిగా నుండేది. ఇప్పుడు పాశ్చాత్య నాగరికతకు లోనై సూర్యోదయము తరువాత నిద్రనుండి లేవడం, స్నానము చేయడం యిట్టి నియమము లేని ప్రవర్తన కలిగి యశాంతితతో అలమటిస్తున్నాము.

ఈ దుస్థితిని గమనించిన మహనీయులు, మహాత్ములు, విజ్ఞులు కరుణార్ద్ర హృదయులై తమ విశిష్ట రచనల ద్వారా ప్రభోధముల ద్వారా, ఆధ్యాత్మిక కార్యక్రమముల ద్వారా మనలను మేల్కొల్పుటకు సర్వదా ప్రయత్నములు చేయుచున్నారు. మూఢాచారములకు స్వస్తిజెప్పి మానవులంతా యొక్కటేను,

భగవంతుని చేరుటకందరు యర్హులే అని చాటిచెప్పుచున్నారు. భగవంతుని కృపా విశేషమును పొందుటకు భక్తి యొక్కటియే సాధనమని యెలుగెత్తి చాటుచున్నారు. జగద్గురు శ్రీశంకరాచార్యుల వారు తమ వివేకచూడామణి గ్రంథమునందు "మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవగరీయసీ" "స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యబిధీయతే" అని భక్తియొక్క ప్రాముఖ్యమును నిర్వచించిరి.

పరాశర, నారద, పుణ్డరీక, ప్రహ్లాద, మార్కండేయ, ధ్రువ, భక్తకన్నప్ప, హనుమదాదులు భక్తిని సాధనముగా గైకొని భగవంతుని సాకార రూపమున భజించి, సేవించి, యారాధించి జగత్ప్రసిద్ధులైరి. దీనికి కారణము అఖండ భక్తియే భక్తిచేత సమస్తము చేకూరును. ఇందు సందియము లేదు. భక్తితో చేయు పూజ,జపము, స్తోత్రము, హోమము మొదలైనవి మానవుని పావనునిగా చేయును. పూజ యనగా ఆవాహనమొదలుకొని విసర్జనము వరకు గల షోడశోపచారములచే భగవంతుని ప్రేమతో, శ్రద్ధతో, భక్తితో అర్చించుట.

యజ్ఞమనగా "దేవతోద్దేశ్య ద్రవ్యత్యాగః యాగః" దేవతలనుద్దేశించి చేయునది. యజ్ఞములచేత దేవతలను సంతోషపరచవలెను. దేవతలు మనలను వర్షముల చేత అనుగ్రహింతురు. ఇట్లు అన్యోన్య సంబంధముచే లోకమునకు శ్రేయస్సు కలుగును. యజ్ఞమనగా దేవతలకు హోమములో నెయ్యి, సమిధలు, పండ్లు, పాయసము మొదలగు పదార్థములతో ఆహుతిలిచ్చుట, యజ్ఞము చేయుటచే గృహము, పరిసర ప్రదేశములు, వాతావరణము పరిశుద్ధములగును. మరియు తనకు తన తోటి ప్రాణులకు ఆరోగ్యము చేకూరును. ఈ విషయమై అమెరికనులు మొదలగు పాశ్చాత్య దేశస్థులు కూడా నిజమని తెలిసికొన్నారు. ఇట్టి మహిమాన్వితమైన యజ్ఞమును యెట్టి పరిస్థితులలోను విడువరాదని భగవంతుడు భగవద్గీతలో ఈక్రింది విధముగా చెప్పియున్నాడు.

యజ్ఞదానతపః కర్మనత్యాజ్యం కార్యమేవతత్ ।
యజ్ఞోదానంతపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥

యజ్ఞము, దానము, తపస్సు ఎప్పుడు విడువరానివి, ఏలన? వీటిని యాచరించుట వలన మనుష్యులు పవిత్రులుగాను, పరిశుద్ధులుగాను, జ్ఞానులుగానగు చున్నారు. అందు చేతనే మన పూర్వీకులు నిత్యము యజ్ఞములు

పూజలు జపములు దానములు చేయుచుండిరి. యజ్ఞములచే లోక కల్యాణము, సకాలమునకు వర్షములు కురిసి దేశము సుభిక్షముగా నుండును. మరియు మనుష్యులకు ఐహికాముష్మికములగు సుఖములు సిద్ధించును. తద్ద్వారా భగవత్ప్రాప్తి కరతలామలకమగుచున్నది.

ప్రస్తుత కాలమున పూజాహోమాదులకు సంబంధించిన పుస్తకము తెలుగు లిపియందు లభించనందున, పూజా హోమములను నిర్వహించుటకు కావలసిన విధి విధానములను ఒకే గ్రంథమున కూర్చిన బాగుండనను సంకల్పము నాకు కలిగినది. గురువులు, మిత్రులు, ఆప్తులు యీ విషయముత్సాహించిరి. "పూజాహోమ కల్పతరువు" అను పేరుపెట్టి అన్ని దేవతలకు సంబంధించిన అష్టోత్తరములు, స్తోత్రములు, సహస్రనామ స్తోత్రములు, మూలమంత్రములు, హోమములు, వ్రతములు వాటి విధివిధానములన్నింటిని అధిక ప్రయాసతో సమకూర్చి గ్రంథస్థము చేసితిని. ఇందులో యేవైనా పొరపాట్లుండిన యవినావే కాని శాస్త్రము వాటికి కారణముకాదని సవినయముతో మనవి చేసుకొనుచున్నాను.

అట్లేదైన పొరబాట్లు జరిగియుండిన ద్వితీయ ముద్రణలో సవరించుకొనుటకు సంసిద్ధుడనని విన్నవించుకొనుచున్నాను. ఈ యాశయము శ్రీసద్గురు దేవుని అపారకృపావిశేషము చేతను మరియు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులు పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీవ్యాసాశ్రమ వ్యాసపీఠాధిపతులు, అస్మద్గురు దేవులైన పూజ్య "శ్రీశ్రీశ్రీ విద్యానన్ద గిరిస్వాములవారి" దివ్యానుగ్రహముచేత కార్యరూపముదాల్చినది.

ఇట్లు

సద్గురు చరణ రేణువు

బ్రహ్మచారి విష్ణుసేవానన్ద

తేది. 31-08-1999

శ్రీవ్యాసాశ్రమము

ఓమ్ తత్సత్ - ఓమ్



## ఆశీస్సు

పూజ్యశ్రీశ్రీశ్రీ విద్యానందగిరిస్వాములవారు
శ్రీవ్యాసాశ్రమ వ్యాస పీఠాధిపతులు
శ్రీవ్యాసాశ్రమము - 517 621

పరిశుద్ధాత్మ స్వరూపులగు ప్రియాత్మబంధువులారా! శ్రీమాన్ విష్ణు సేవానంద బ్రహ్మచారి గారు. వీరు సంస్కృతమునందు, వేదము నందును పరిశ్రమించిరి. వేదాధ్యయనమున మిగుల పాటు పడిరి. వేద పండితులను వినయ విధేయతలతో సేవించి, వారి అనుగ్రహము వలన వేదమునభ్యసించి, కర్మకాండయందు నేర్పును సంపాదించిరి. విగ్రహప్రతిష్ఠాదులను వైదికముగా నిపుణతతో నెరవేర్తురు. ప్రస్తుతము దేవతా పూజలను వైదిక కర్మలను గూర్చి తెలుగులో విశదీకరించ వలయునన్న భావముతో మిత్రులు, ఆప్తులు మొదలగు వారి యొక్క ప్రోత్సాహముతో ఈ **"పూజాహోమకల్ప తరువు"** అనెడు గ్రంథమును రచించి ఆంధ్రదేశమునకు మహోపకారమొనరించిరి. ఇంకను వీరు ఇట్టి లోకోప కారకములగు గ్రంథముల రచించి దేశమున కందించి భగవదనుగ్రహ పాత్రులగుదురు గాక.

విద్యానన్దస్వామి

ఓం లోకాస్సమస్తాస్సుఖినోభవంతు
ఓం శాన్తిః శాన్తిః శాన్తిః
ఓమ్



# నివేదన

శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు
సాహిత్య శిరోమణి ఎమ్. ఏ., తిరుపతి

**"మమైవాంశో జీవలోకే**
**జీవభూత స్సనాతనః"**

అని భగవద్వచనం. జీవుడు సనాతనుడు. అతనికి చావు పుట్టుకలు లేవు. అతడు భగవానుని అంశమే.

దేవుని నుండి జీవుడు ఎప్పుడు, ఎందుకు విడిపోయాడో చెప్పలేము. భగవంతుని సంకల్పమే అందుకు కారణం కావచ్చు.

కాని మళ్లీ జీవుడు దేవుణ్ణి చేరుకోవాలి. నదులకన్నింటికీ సముద్రమే గమ్యం. అలాగే సమస్త జీవజగత్తుకూ పరమాత్ముడే గమ్యం. ఆ లక్ష్యంతోనే జీవుడు ఈలోకంలో జీవించాలి.

భగవత్ప్రాప్తికి శాస్త్రాలు పలు ఉపాయాలను నిర్దేశించాయి. అందులో కర్మ-భక్తి-ధ్యాన - జ్ఞానయోగాలు ముఖ్యమైనవి. భగవద్గీతాది గ్రంథాలు ఈయోగాలనే వివరించాయి.

ఈ కాలానికి భక్తియోగమొకటే భగవత్ప్రాప్తికి అనువైన, శ్రేష్ఠమైన ఉపాయం. "భక్త్యాత్వనన్యయా శక్యః" ఇత్యాది భగవద్వచనాల వల్ల జీవుడు అనన్యమైన భక్తితో మాత్రమే దేవుణ్ణి సులభంగా చేరుకోగలడని తెలుస్తున్నది.

నారదాది ప్రాచీన మహర్షులు భక్తి ప్రాముఖ్యాన్ని వేనోళ్లశ్లాఘించి వున్నారు. "భక్తికొలది వాడే పరమాత్ముడు" "భక్తి నీపైదొకటె పరమసుఖము" ఇత్యాదిగా అన్నమయ్య మొదలైన అధునిక మహాభక్తులు గూడా భక్తి ప్రాధాన్యాన్ని నొక్కి వక్కాణించారు.

శ్రవణం, కీర్తనం మొదలైన తొమ్మిది రకాల భక్తిమార్గాలు. ఈ మార్గాన్ని ఆధునిక కాలంలో ప్రజలు అత్యధికంగా ఆదరిస్తున్నారు. పెద్ద ఆలయాలు, చిన్న ఆలయాలు అనే తేడా లేకుండా భక్తులు అన్ని ఆలయాలలోనూ ఇష్టసిద్ధికై పూజాదికాలు నిర్వర్తిస్తున్నారు.

పూర్వం ఈ పూజావిధానానికి చెందిన జ్ఞానం ఏకొందరో అర్చకులకు మాత్రమే పరిమితమై ఉండేది. మహర్షిసద్గురు శ్రీమలయాళస్వాములు వారు తాము తిరుమల గోగర్భంలో తపస్సుచేసే కాలంలో (1913-1926) వివిధదేవతల పూజావిధానాలను వివరించే "పూజా పంచరత్న మాల" అనే గ్రంథ రత్నాన్ని సమకూర్చారు. ఆ పుస్తకం చాలా ప్రచారం పొందింది. ఆ తరువాత పూజాకల్పతరువు అనే మరొక గ్రంథాన్ని కూడా వ్యాసాశ్రమం వారు ప్రచురించారు. ఈ పుస్తకాలవల్ల సామాన్యులకు సైతం

పూజా విధానం అందుబాటలోకి వచ్చింది.

ప్రస్తుతం శ్రీవ్యాసాశ్రమ బ్రహ్మవిద్యాపాఠశాలలో మరియు తిరుపతి - కాశీ - ఋషికేశ్ మొదలైన ప్రదేశములలో వేదవిద్యనూ, బ్రహ్మవిద్యనూ అభ్యసించిన చిరంజీవి శ్రీ విష్ణుసేవానంద గారు 'పూజాహోమకల్పతరువు' అనే ఈ ఉద్గ్రంథాన్ని సంకలనం చేసి ప్రచురించడం ముదావహం. శ్రీ విష్ణుసేవానందగారు వేదాధ్యయనంలోనూ, యజ్ఞక్రియాకలాప నిర్వహణలోనూ నేర్పరి. తనపరిజ్ఞానాన్ని పది మందితో పంచుకోవాలన్న ఉదారాశయంతో ఆయన ఈగ్రంథాన్ని సంకలనం చేసి ప్రచురించారు.

ఈగ్రంథాన్ని గురించి వైదిక సంప్రదాయం పాటిస్తూ భగవంతుణ్ణి ఆరాధించ గోరేవారికి ఈగ్రంథం నిజంగా కల్పతరువే.

ఇందులో పూజావిధానాలు, వివిధదేవతలకు చెందిన అష్టోత్తరశతనామాలు, స్తోత్రాలు, అష్టకాలు, లలితా సహస్రనామం, విష్ణు సహస్రనామం, నమకం, చమకం, శ్రీ సూక్త -పురుష సూక్తాదులు - ఇలా నిత్యజీవితంలో అవసరమైన ఆరాధనా ప్రక్రియలన్నీ ఉన్నాయి.

హోమ ప్రకరణంలో నవ గ్రహ హోమం మొదలు ఆయుష్యహమం వరకూ పలుహోమాలు ఆయా విధానాలతో సహ నిరూపింపబడివున్నాయి. యజమానులకూ, ఋత్విక్కులకే కాక జిజ్ఞాసగల ఇతర జనులకు కూడా ఈ గ్రంథం ఉపయోగ పడుతుందనడంలో సందేహం లేదు.

శ్రీ విష్ణుసేవానంద గారు తన పేరుకు తగినట్లే సకల దేవతా స్వరూపుడైన శ్రీ మహావిష్ణువును ఈ గ్రంథ ప్రకటన ద్వారా సేవించి ధన్యుడయ్యాడు.

ఈ గ్రంథ గౌరవాన్ని గుర్తించి తిరుమల తిరుపతి దేవస్థానం వారు దీని ముద్రణకు ఆర్థిక సహాయం అందించారు. మరి కొందరు వితరణశీలురు కూడా చేయూత నిచ్చి దీన్ని ముచ్చటగా తీర్చి దిద్దడంలో సహకరించారు.

**"యాన్యనవద్యాని కర్మాణి**
**తాని సేవితవ్యాని**
**నో ఇతరాణి"**

అన్న వేదవచనాన్ని అనుసరించి ఈ గ్రంథ సంకలనం ప్రచురణ అనే పవిత్రమైన పని చేసిన ఆత్మీయులు శ్రీ విష్ణుసేవానందను మనసారా అభినందిస్తున్నాను. ఈ మంచి పనికి సహకరించిన పెద్దలు కూడా అభినందనీయులే.

శ్రీమలయాళసద్గురు దేవులు, శ్రీవేంకటేశ్వరస్వామి శ్రీ విష్ణుసేవానంద గారిని అనుగ్రహింతురు గాక!

**తిరుపతి** **సముద్రాల లక్ష్మణయ్య**
**29-2-2000**

# కృతజ్ఞతలు

పరిశుద్ధాత్మ స్వరూపులు, పవిత్రాత్మ హృదయులు, త్యాగమూర్తులు, గురుభక్తి పరాయణులు, వేదాంతజిజ్ఞాసాపరులు, మాతృమూర్తులు కంచిచెర్ల వాస్తవ్యులుమాతృశ్రీ నలమోతు సుబ్బాయమ్మగారు పితృసమానులు నలమోతు రామారావుగారు, వీరు ఎంతో ఉదారహృదయులు. బ్రహ్మచర్యవ్రతము స్వీకరించినప్పటి నుండి ఈ మాతృ దేవి ఎంతో సహాయమందించినారు. అంతేగాక 6 సం॥ల నుండి వేదము వేదాంతము చదువుటకు సం॥ కు 4,000-00 సహాయము చేయుచూ యున్నారు. మరియు పుత్ర సమానముతో అన్ని విధముల సహాయ సహకారములను అందించుచున్నారు. అట్టి పవిత్రమూర్తులకు నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

మరియు పూర్వాశ్రమములో నాకు సహోదరులు, ఆత్మీయులు కాశీపట్టణములో వేదాంతాచార్య అధ్యయనము చేయుచున్న "బ్రహ్మచారి శ్రీపూర్ణానన్దగారికి" నా సత్సంకల్పము తెలియజేయగానే ఆత్మసోదరా! నీ సంకల్పము లోకోపకారార్థమైనది. మంచి కార్యమునకు మీనమేషములను లెక్కించనవసరము లేదు. "అశ్రద్ధాపరమం పాపం శ్రద్ధా పాపప్రమోచని" యను సూక్తిని తెల్పుతూ యాలస్యము చేయక ప్రారంభించుము, నీకు శ్రీ సద్గురు దేవుడు, పరమేశ్వరుడు తోడు నీడై నీకార్యమును సఫలీకృతము చేయగలరని ఉత్సాహము కలిగించినందులకు వారికి నా హృదయపూర్వక కృతజ్ఞాభివందనములు.

పరిశుద్ధాత్మ స్వరూపులు. కాకినాడ వాస్తవ్యులు మాతృశ్రీ డి. సుభద్రమ్మగారికి. ప్రేమ స్వరూపులైన శ్రీవ్యాసాశ్రమవాస్తవ్యులు శ్రీమాన్ రామయ్యగారికి. పవిత్రాత్మహృదయులు, విద్వాంసులు శ్రీమాన్ వెంకటరెడ్డిగారికి నా హృదయపూర్వక కృతజ్ఞాభివందనములు.

ఇట్లు
బుధజన విధేయుడు
బ్రహ్మచారి విష్ణుసేవానంద

శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః




# కృతి సమర్పణ

ఏ మహితాత్ముని దివ్య పద పంకజ స్పర్శచే ఆంధ్ర దేశము పవిత్రమైనదో, ఏ ఋషి శ్రేష్ఠుని ధార్మికోపదేశములచే ప్రజలెల్లరు తాము ఋషి సంతతికి చెందినవారమని స్మరింపగలిగిరో, ఏయతికుల సార్వభౌముడు భక్తి, జ్ఞాన వైరాగ్యబీజములను ఆంధ్ర దేశమందెల్లెడల విస్తారవముగా వెదజల్లెనో, ఏ జ్ఞానభాస్కరుని మహోపదేశములతో స్త్రీ, శూద్రాదులు సైతము సంసారమనేడి అజ్ఞానము నుండి విడివడినారో, ఏ బ్రహ్మనిష్ఠుడు యోగవాసిష్ఠాది ప్రసిద్ధ ప్రాచీన గ్రంథవములను ఆంధ్ర వాఙ్మయమున విరచించెనో, అట్టి మహా మహుడు, అఖండ చరితాత్ముడు, సనాతన ధర్మ సిద్ధాంత సంస్థాపనా చార్యుడు మహర్షి సత్తముడు సద్గురు శ్రీశ్రీశ్రీ మలయాళ స్వాముల వారి అత్యుత్తమ ప్రియ శిష్య శ్రేష్ఠులు, ప్రస్తుత వ్యాసాశ్రమ, వ్యాస పీఠాధీశులు, శ్రోత్రియ బ్రహ్మనిష్ఠాగరిష్ఠులు పరమహంస పరివ్రాజకాచార్యులు అస్మత్ గురుదేవులు పరమ పూజ్యులు శ్రీశ్రీశ్రీ విద్యానంద గిరి స్వాముల వారి పవిత్ర చరణ సరోజములకు ఈ కృతి కుసుమమును భక్తితో సమర్పించు చున్నాను

ఇట్లు

*బుధజన విధేయుడు*

**బ్రహ్మచారి విష్ణు సేవానన్ద**

# విషయ సూచిక


| వ.సం. | విషయము | పుట |
|---|---|---|
| 1. | ముందుమాట | i |
| I. | ఆశీస్సు | iv |
| I. | నివేదన | v |
| I. | కృతజ్ఞతలు | VII |
| 2. | పూజా హోమ సామాగ్రి పట్టిక | 1 |
| 3. | పూజా విధానము | 5 |
| 4. | సంకల్పము | 6 |
| 5. | కలశారాధన | 7 |
| 6. | గణపతి పూజ | 8 |
| 7. | పురుషసూక్త విధానేన పూజా విధిః | 10 |
| 8. | మంత్ర పుష్పము | 20 |
| 9. | రుద్ర విధానేన శివపూజా విధిః | 27 |
| 10. | శ్రీ సూక్త విధానేన పూజా విధిః | 36 |
|  | **అష్టోత్తర శత నామాలు** |  |
| 11. | గణపత్యష్టోత్తర శతనామావళిః | 45 |
| 12. | శివాష్టోత్తర శతనామావళిః | 47 |
| 13. | సుబ్రహ్మణ్యష్టోత్తర శతనామావళిః | 49 |
| 14. | రామాష్టోత్తర శతనామావళిః | 51 |
| 15. | గుర్వష్టోత్తర శతనామావళిః | 53 |
| 16. | దక్షిణామూర్త్యష్టోత్తర శతనామావళిః | 55 |
| 17. | శంకరాచార్యష్టోత్తర శతనామావళిః | 57 |
| 18. | వేద వ్యాసాష్టోత్తర శతనామావళిః | 59 |
| 19. | మలయాళ సద్గురు అష్టోత్తర శతనామావళిః | 59ఎ, |
| 20. | మద్భగవద్గీతాష్టోత్తర శతనామావళిః | 61 |
| 21. | బుద్ధాష్టోత్తర శతనామావళిః | 63 |
| 22. | లక్ష్మ్యష్టోత్తర శతనామావళిః | 65 |
| 23. | లలితాష్టోత్తర శతనామావళిః | 67 |

24. దుర్గాష్టోత్తర శతనామావళిః 71
25. గౌర్యష్టోత్తర శతనామావళిః 73
26. సరస్వత్యష్టోత్తర శతనామావళిః 75
27. తులస్యష్టోత్తర శతనామావళిః 77
28. సుదర్శనష్టోత్తర శతనామావళిః 79
29. కృష్ణాష్టోత్తర శతనామావళిః 81
30. వేంకటేశ్వరాష్టోత్తర శతనామావళిః 83
31. ఆంజనేయాష్టోత్తర శతనామావళిః 85
32. హనుమాన్ చాలీసా 87
33. షిరిడీ సాయి అష్టోత్తర శతనామావళిః 89
34. అయ్యప్పష్టోత్తర శతనామావళిః 91
35. రాఘవేంద్రస్వామ్యష్టోత్తర శతనామావళిః 93
36. ఓంకారాష్టోత్తర శతనామావళిః 97
37. దత్తాత్రేయాష్టోత్తర శతనామావళిః 95
38. సూర్యాష్టోత్తర శతనామావళిః 99
39. చన్ద్రాష్టోత్తర శతనామావళిః 101
40. అంగారకాష్టోత్తర శతనామావళిః 103
41. బుధాష్టోత్తర శతనామావళిః 105
42. బృహస్పత్యష్టోత్తర శతనామావళిః 107
43. శుక్రాష్టోత్తర శతనామావళిః 109
44. శన్యష్టోత్తర శతనామావళిః 111
45. శ్రీ రాహ్వష్టోత్తర శతనామావళిః 113
46. శ్రీ కేత్వష్టోత్తర శతనామావళిః 115

## స్తోత్రాలు

47. గణపత్యష్టకం 117
48. గణేశప్రాతః స్మరణం 118
49. సుబ్రహ్మణ్యాష్టకం 118
50. శివ పఞ్చాక్షర స్తోత్రం 120

51. శివపఞ్చాక్షరీ స్తోత్రం 121
52. లిఙ్గాష్టకం 121
53. గోపాలకృష్ణ సుప్రభాతం 122
54. కృష్ణాష్టకం 123
55. రామాష్టకం 124
56. వేంకటేశ్వర స్తోత్రం 125
57. ఆంజనేయ దండకం 136
58. వ్యాసాశ్రమ గురుపరంపరాస్తోత్రం 128
59. గురుధ్యానము 128
60. సద్గురు పాదుకాస్తవము 130
61. జ్వరహరస్తోత్రము 132
62. మద్భగవద్గీతా ( 3 అధ్యాయాలు) 139
63. కలిసంతారణోపనిషత్ 133
64. సరస్వతీ స్తోత్రం 139
65. లక్ష్మి స్తోత్రం 142
66. మహాలక్ష్మ్యష్టకం 143
67. రాజరాజేశ్వర్యష్టకం 144
68. అన్నపూర్ణా స్తోత్రం 145
69. లలితా పఞ్చకం 147
70. తంత్రోక్త దేవీ సూక్తం 148
71. దేవీ అపరాధక్షమాణస్తోత్రం 150
72. మహిషాసురమర్దినీ స్తోత్రం 152
73. దేవీ ప్రణవ శ్లోక స్తుతి 155
74. గాయత్రీ దణ్డకం 157
75. శ్యామలా దండకం 158
76. శారదాస్తోత్రం 158
77. సూర్య నమస్కారములు 159
78. దేవీ మంగళహారతి 160
79. శ్రీమద్భగవద్గీతా గేయము 162

80. 163
81. లలితా సహస్రనామస్తోత్రం 164
82. దేవి ఖడ్గమూల స్తోత్రం 179
83. విష్ణు సహస్రనామ స్తోత్రం 182

## సూక్తములు

84. నమకము (రుద్రము) 196
85. చమకము 203
86. పురుషసూక్తము 207
87. భూసూక్తము 209
88. విష్ణుసూక్తము 210
89. ఘృత సూక్తము (ఆయుష్య సూ.) 211
90. శ్రీ సూక్తము 212
91. నీళా సూక్తము 215
92. దుర్గా సూక్తము 215
93. మేధా సూక్తము 216
94. మన్యుసూక్తము 217
95. మృత్యుంజయసూక్తము 218
96. గణపత్యథర్వశీర్షోపనిషత్ 220
97. నక్షత్ర పీఠిక 223
98. దశశాంతులు 231
99. తైత్తిరీయోపనిషత్ 235

## హోమ ప్రకరణం

100. మహా సంకల్పము 248
101. పుణ్యాహవాచనము 252
102. రక్షా బంధనము 257
103. నవగ్రహధ్యాన శ్లోకాలు 258
104. సంపూర్ణ నవగ్రహ పూజా విధానము 259
105. హోమగుండం తయారు చేయు విధానము 278

| | | |
|---|---|---|
| 106. | షట్ పాత్ర ప్రయోగము | 279 |
| 107. | నవ గ్రహహోమము | 284 |
| 108. | జయాదిహోమము | 291 |
| 109. | పూర్ణాహుతి | 300 |
| 110. | అవధారలు | 308 |
| 111. | లఘువిధాన హోమము | 316 |
| 112. | గణపతి హోమము | 320 |
| 113. | దేవీ హోమము (లక్ష్మీ) | 321 |
| 114. | భగవద్గీతాహోమము | 323 |
| 115. | పురుష సూక్తహోమము | 324 |
| 116. | రుద్రహోమము | 326 |
| 117. | మృత్యుంజయ హోమము | 338 |
| 118. | వాస్తు హోమము | 340 |
| 119. | ఆయుష్యహోమము | 341 |
| 120. | శ్రీ రామ హోమము | 343 |
| 121. | నూతన గృహ నిర్మాణ ప్రవేశ విధానము | 344 |
| 122. | సర్వ దేవతా మూలమంత్రములు | 345 |
| 123. | సూర్య నమస్కారములు | 351 |
| 124. | రుద్రాక్షమహిమ | 352 |
| 125. | తులసి మహిమ | 352 |
| 126. | మృత్యు భయము | 353 |
| 127. | అర్ఘ్య ప్రధానము | 353 |
| 128. | ముఖ్య విధులు | 353 |
| 129. | పూర్ణకుంభ విధానము | 355 |
| 130. | శ్రీ చండీ హోమ విధానము | 355 |
| 131. | శ్రీ హనుమత్ పూజా విధానము | 356 |
| 132. | శ్రీ గోపూజా విధానము | 357 |
| 133. | భజన పాటలు | 362 |
| 134. | శ్రీ గణేశ మంగళహారతి | 364 |
| 135. | శ్రీ సత్యనారాయణ వ్రత కథ | 365 |

| | |
|---|---|
| శ్రీ వరలక్ష్మివ్రతం | 383 |
| వినాయకవ్రతం | 393 |
| కేదారేశ్వరవ్రతం | 405 |
| ఆదిత్యహృదయస్తోత్రం | 416 |
| నామనక్షత్ర హోరాఫలితం | 421 |
| శివమహిమ్నస్తోత్రం | 424 |
| విశ్వనాథాష్టకం | 432 |
| పశుపత్యష్టకం | 434 |
| శ్రీహర్యష్టకం | 436 |

# సర్వదేవతా పూజా హోమసామ గ్రి పట్టిక

పసుపు
కుంకుమ
గంధము
కలశాలు
కొబ్బరికాయలు
బియ్యం
తమలపాకులు
నవధాన్యాలు
కలకండ
అరటి పండ్లు
పుష్పమూరలు
దారపుబుండలు
మట్టిమూకుళ్ళు
దర్భచాపలు
ఎండుకొబ్బెర
విస్తర్లు
తొమ్మిది రంగుల రవిక గుడ్డలు
వక్కలు
తెలుపు తుండ్లు
రూపాయబిళ్లలు
అగరవత్తులు
కర్పూరము
నేతివత్తులు
బాదంపప్పు
ఎండుకర్జూరము
బెల్లం
అన్ని రకాల పండ్లు
పుష్పమాలలు
గంధపు చెక్క
నవరత్నాలు
మల్లుగుడ్డ
వడ్లు
పట్టుగుడ్డ
సమిధలు
నెయ్యి
లవంగాలు
యాలకులు
జాజికాయ
జాపత్రి
పచ్చకర్పూరం
కుంకుమపువ్వు
పాలు
పన్నీరు; అత్తరు.
ఎండు ద్రాక్ష
విడిపూలు
మామిడిమండలు
అరటి మొక్కలు
అంచు పంచలు
అన్నము
పంచలోహాలు
వట్టి వేళ్ళు మొ॥వి.

## గణపతి హోమమునకు కావలసిన ముఖ్యమైన వస్తువులు

కుడుములు – అటుకులు – లాజాలు (బొరుగులు) – బియ్యం పిండి – నెయ్యి – సమిధలు – చెరుకుముక్కలు – నువ్వులు – ఎండుకొబ్బరి ముక్కలు – అరటిపండ్లు – పైపదార్థములన్నింటిని సమానంగా కలిపి ఆహుతి చేయవలెను.

## మృత్యుంజయహోమమునకు

నెయ్యి – సమిధలు – అన్నం – పాలు – గరికె

## నవగ్రహ హోమమునకు

నెయ్యి – సమిధలు (9 రకాలు) – వడ్లు – అన్నం

## దేవి హోమమునకు

పాయసం – పండ్లు – చెరకులు – తామర పువ్వులు – నెయ్యి – సమిధలు – కుంకుమ – పసుపు – రవికగుడ్డ – చీరజాకెట్టు.

## గీతాహోమమునకు

నెయ్యి – సమిధలు – పాయసం మొద॥ నవి. పుష్పాలు–పత్రి (తులసీ) – పండ్లు.

## ఆయుష్యహోమమునకు

నెయ్యి – అన్నం – సమిధలు మొ॥నవి.

## శ్రీరామ హోమమునకు

నెయ్యి – సమిధలు – బొరుగులు – తులసీ పత్రి మొ॥నవి.

## రుద్ర హోమమునకు

అన్నం – నెయ్యి – సమిధలు – బిల్వపత్రి – విభూతి, గరికె మొ॥నవి.

## ఆంజనేయహోమమునకు

పండ్లు – నెయ్యి – సమిధలు – తమలపాకులు మొ॥నవి.

## వాస్తుహోమమునకు

నవధాన్యాలు – నెయ్యి – సమిధలు – బొరుగులు మొ॥నవి.

# పురుషసూక్త విధానేన పూజావిధిః

ఓం సత్యం శాంతం దయ
ఓం శ్రీ మహా గణాధి పతయే నమః
ఓం శ్రీ గురుభ్యో నమః
హరిః ఓమ్॥

అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాఙ్గతో ఽపివా ।
యస్మరేత్పుణ్డరీకాక్షం సబాహ్యాభ్యంతర శ్శుచిః॥
పుణ్డరీకాక్ష, పుండరీకాక్ష, పుండరీకాక్షాయనమః।

ఈపై మంత్రమును చెప్పుచూ మూడుసార్లు జలమును శిరముపై తన చుట్టూ చల్లుకోవలెను.

భగవంతుని స్మరిస్తూ ఈక్రింది శ్లోకాలను చదువవలెను.

ఓం దేవీంవాచ మజనయంత దేవా
స్తాం విశ్వరూపాః పశవోవదన్తి ।
సానోమంద్రేష మూర్జందుహానా
ధేనుర్వాగ స్మా నుపసుష్టుతైతు॥

అయం ముహూర్తస్సు ముహూర్తోఽస్తు

ఓం ధ్రువంతే రాజా వరుణో ధ్రువం దేవో బృహస్పతిః ।
ధ్రువంత ఇంద్ర శ్చాగ్నిశ్చ రాష్ట్రం ధారయతాం ధ్రువమ్॥
ఓం గణానాంత్వాగణపతిగ్ం హవామహే -------- సాదనమ్॥
ఓం రాజాధి రాజాయ --------- మహా రాజాయ నమః॥
ఓం సద్యోజాతం ------------ భవోద్భవాయ నమః॥
ఓం వామ దేవాయ ----------- రుద్ర రూపేభ్యః ॥
ఓం అఘో రేభ్యో ------------ రుద్ర రూపేభ్యః॥
ఓం తత్పురుషాయ విద్మహే --------తన్నోరుద్రః ప్రచోదయాత్॥
ఓం త్ర్యంబకం యజామహే -------- మృక్షీయ మామృతాత్॥
ఓం తచ్ఛంయో రావృణీ ----------- శంచతుష్పదే॥
ఓం శంనో మిత్రః శ్శంవరుణః -------- అవతువక్తారమ్॥

## పురుషసూక్త విధానేన పూజా విధిః

ఓం శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।
ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నోప శాంతయే॥

తదేవలగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం తదేవ ।
విద్యాబలం దైవబలం తదేవ లక్ష్మీపతే తేఽఙ్ఘ్రియుగం స్మరామి॥

లాభస్తేషాం జయస్తే షాం కుతస్తేషాం పరాభవః।
యేషామిందీవరశ్యామో హృదయ స్థోజనార్దనః॥

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్।
లోకాభిరామం శ్రీ రామం భూయోభూయోనమామ్యహమ్॥

సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధికే।
శరణ్యే త్ర్యంబకే దేవీ నారాయణి నమోస్తుతే॥

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థోధనుర్ధరః।

ఓం శ్రీ లక్ష్మీ నారాయణాభ్యాం నమః
ఓం శ్రీ ఉమామహేశ్వరా భ్యాం నమః
ఓం శ్రీ వాణీ హిరణ్య గర్భాభ్యాం నమః
ఓం శ్రీ శచీ పురంద రాభ్యాం నమః
ఓం శ్రీ ఇంద్రా ద్యష్ట దిక్పాలక దేవతాభ్యోనమః
ఓం శ్రీ ఆదిత్యాది నవగ్రహ దేవతాభ్యో నమః
ఓం శ్రీ గ్రామ దేవతాభ్యోనమః
ఓం శ్రీ క్షేత్రాధిష్ఠాన దేవతాభ్యోనమః
ఓం శ్రీ కులదేవతాభ్యోనమః
ఓం శ్రీ అరుంధతీ వసిష్ఠాభ్యాంనమః
ఓం శ్రీ మాతా పితృభ్యాంనమః
ఓం శ్రీ సర్వేభ్యోమహాజనేభ్యోనమః
ఓం శ్రీ సద్గురుభ్యోనమః
ఓం ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రక్షసామ్।
కురుఘంటారవం తత్రదేవతాహ్వాన లాంఛనమ్॥

(అని చెప్పుచూ ఘంట వాయించవలెను.)

ఓం భో దీప ! బ్రహ్మరూపేణ సర్వేషాం హృదిసంస్థితః।
అతస్త్వాం స్థాపయామ్యద్యమద జ్ఞానమపాకు రు॥
( దీపమువెలిగించి పుష్పాక్షతలచే అలంకరించదగినది)

పృథ్వి! త్వయాధృతాలోకాః దేవి! త్వం విష్ణునాధృతా!
త్వంచ ధారయ మాందేవి! పవిత్రం కురుచాసనమ్॥
( యుక్తాసనమున కూర్చుండవలెను. )

## ఆచమనము

(ఈ క్రింది నామములు చెప్పి మూడు సార్లు జలము తీసుకోవలెను.)

ఓం కేశవాయ స్వాహా । ఓం నారాయణ స్వాహా । ఓం మాధవాయ స్వాహా
ఓం గోవిందాయ నమః (అని చెప్పి రెండు చేతులు కడుగవలెను)
ఓం విష్ణవేనమః ఓం మధుసూదనాయనమః ఓం త్రివిక్రమాయనమః
ఓం వామనాయ నమః ఓం శ్రీదరాయనమః ఓం హృషీకేశాయ నమః
ఓం పద్మనాభాయ నమః ఓం దామోదరాయ నమః ఓం సంకర్షణాయ నమః
ఓం ప్రద్యుమ్నాయనమః ఓం వాసు దేవాయ నమః ఓం అనిరుద్ధాయ నమః
ఓం పురుషోత్తమాయ నమః ఓం అధోక్షజాయనమః ఓం నారసింహాయ నమః
ఓం అచ్యుతాయనమః ఓం జనార్ధనాయనమః ఓం ఉపేంద్రాయనమః
ఓం హరయే నమః ఓం కృష్ణాయనమః

శ్లో॥ ఓం ఉత్తిష్ఠంతు భూతపిశాచాః ఏతే భూమిభారకా ః ।
ఏతేషామవిరోధేన బ్రహ్మకర్మ సమారభే॥
(అని మంత్రం చెప్పి అక్షతలు వాసన చూసి వెనుక వేసుకోవలెను)

## ప్రాణాయామము

ఓం భూః, ఓం భువః, ఓం సువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓగ్ం సత్యం, ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహి! ధియోయోనః ప్రచోదయాత్। ఓం ఆపోజ్యోతీరసో ఽ మృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్॥

(పై మంత్రం చెప్పుచూ ( బొటనవేలు) అంగుష్ఠ, మధ్యమ, అనామిక వ్రేళ్ళతో ముక్కు పట్టు కొని శ్వాస పీల్చి కొంచెం సేపు నిలిపి వదలవలెను. తరువాత నీటితో చేయికడుగవలెను)

# సంకల్పము

(చేతిలో పుష్పాక్షతలు తీసుకొని కుడికాలి తొడమీద ఎడమ చేయి క్రింద, కుడిచేయి పైకి వచ్చేటట్లు మూసి పట్టుకోవలెను.)

మమోపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభనముహూర్తే శ్రీ మహావిష్ణో రాజ్ఞయాప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయ పరార్థే శ్వేత వరాహకల్పే వైవస్వతమన్వతరేకలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరత వర్షే భరత ఖండే మేరోః దక్షిణ దిగ్భాగే శ్రీ శైలస్య---- ప్రదేశే కృష్ణా కావేర్యోః మద్యదేశే స్వగృహే (శోభన గృహే) సమస్త దేవతా బ్రాహ్మణ హరిహర గురుచరణ సన్నిధౌ అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేనప్రభవాదిషష్ఠీ సంవత్సరాణాంమధ్యే ----- సంవత్సరే ----అయనే ------ ఋతౌ ------ మాసే----పక్షే -------తిథౌ---- వాసరే శుభనక్షత్రే శుభయోగే శుభకరణే ఏవం గుణ విశేషణ విశిష్టాయాం సుభతిథౌ శ్రీమాన్ -------- గోత్రః -------నామధేయః (పురుషులైనచో గోత్రస్య, నామధేయస్య, స్త్రీలైనచో గోత్రవతీ నామధేయవతీ అని చెప్పవలెను.) ధర్మపత్నీ సమేతస్య అస్మాకం వంశానాం దైవ ప్రీత్యర్థం అస్మాకం సహ కుటుంబానాం క్షేమ, స్థైర్య ధైర్య విజయ, అభయ, ఆయురారోగ్య ఐశ్వర్య అభివృద్ధ్యర్థం, ధర్మార్థకామమోక్ష చతుర్విధ పురుషార్థ ఫల సిద్ధ్యర్థం, పుత్ర పౌత్రాది వృద్ధ్యర్థం, నానా విధ సౌభాగ్య సిద్ధ్యర్థం, మనోవాంఛా ఫలసిద్ధ్యర్థం, భక్తి జ్ఞాన వైరాగ్యయోగ ప్రాప్త్యర్థం. చరాచరప్రాణి కోటీనాం క్షేమ సిద్ధ్యర్థం శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం. మమఇష్టదేవతా ముద్దిశ్య ఇష్టదేవతా ప్రీత్యర్థం (ఇచ్చట వారి వారి ఇష్టదేవతా పేరు చెప్పుకోవలెను.) ఆవాహ తేభ్య స్సర్వేభ్యోదేవేభ్యః - సంభవద్భిః ద్రవ్యైః- సంభవద్భిః పదార్థైః- సంభవద్భిః ఉపచారైః- సంభావిత నియమేన పురుషసూక్త విధానేన యావచ్ఛక్తి ధ్యానా వాహనాది షోడశోపచార పూజామహంకరిష్యే.

(అని చెప్పి చేతిలో నున్న పుష్పములు, అక్షతలు దేవునిపై వేయవలెను)

# కలశారాధన

తదంగ కలశారాధనం కరిష్యే కలశం గంధపుష్పాక్షతైః అభ్యర్చ్య. (కలశమునకు గంధము, అక్షతలు, పుష్పములు, కుంకుమతో అలంకరిచవలెను. కలశములో తులసీదళముగాని, పుష్పముగాని వుంచవలెను. ఈదిగువ నున్న మంత్రములు చెప్పుచు కలశముపై ముందు కుడి చేయి పై ఎడమచేయి పెట్టియుంచవలెను.)

శ్లో॥ కలశస్యము ఖేవిష్ణుః కంఠే రుద్ర స్సమాశ్రితః
మూలేతత్ర స్థితో బ్రహ్మమధ్యేమాతృగణాస్మృతాః ॥

శ్లో॥ కుక్షౌతు సాగరా స్సర్వే సప్త ద్వీపావసుంధరా
ఋగ్వేదోఽ థయజుర్వేదస్సామ వేదోహ్యథర్వణః ॥

శ్లో॥ అంగైశ్చ స్సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితాః
ఆయాంతు దేవపూజార్థం సర్వదురితక్షయకారకాః ॥

మం॥ ఆకలశేషుధావతి పవిత్రే పరిశిచ్యతే
ఉక్థైర్యజ్ఞేషు వర్ధతే, ఆపోవా ఇదగ్ం
సర్వం విశ్వాభూతాన్యాపః ప్రాణావాఆపః
పశవ ఆపోఽన్నమాపో ఽ మృతమాప
స్సమ్రా డాపోవిరాడాపస్స్వరాడాపఛం
దాగ్ం ష్యాపోజ్యోతీగ్ం ష్యాపో యజూగ్ంష్యాప
స్సత్యమాపస్సర్వాదేవతా ఆపోభూర్భువస్సువరాప ఓమ్.

శ్లో॥ గంగేచయమునేకృష్ణే గోదావరి సరస్వతీ।
నర్మదేసింధు కావేర్యౌ జలేఽస్మిన్ సన్నిధింకురు॥
ఓం భూర్భావస్సువో, భూర్భువస్సువో, భూర్భువస్సువః
కలశోదకేన పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య. దేవం ఆత్మానంచ సంప్రోక్ష్య.

(అని చెప్పి పుష్పముతోగాని, తమలపాకుతోగాని కలశములోని జలమును తీసుకొని అచ్చటనున్న పూజాద్రవ్యములపై, దేవునిపై, తనపై చల్లుకొనవలెను.)

ఆదౌ నిర్విఘ్నపరి సమాప్త్యర్థం శ్రీమహాగణపతి పూజాంచకరిష్యే

గణపతి విగ్రహమున్నచో దానికే పూజింపవచ్చును. లేనిచో పసుపుతో గణపతిని చేసి తమలపాకులో పెట్టి సర్వ విఘ్నశాంతికై పూజించవలెను.

# ధ్యానమ్

మం॥ ఓం గణానాంత్వాగణపతిగ్ం హవామహే। కవింకవీనాముపమ్రశవస్తమమ్।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాంబ్రహ్మణస్పత ఆనశ్శృణ్వనూతి భీస్సీద సాదనమ్ ॥
ఓం శ్రీ మహాగణాధిపతయేనమః ధ్యాయామిధ్యానంసమర్పయామి.

(అని అక్షతలు విఘ్నేశ్వరుని మీద వేయవలెను.)

శ్రీ మహాగణాధిపతయేనమః ఆవాహయామి.
సువర్ణ ఖచిత రత్న సింహాసనం సమర్పయామి.
పాదయోః పాద్యం సమర్పయామి.
హస్తయోః అర్ఘ్యం సమర్పయామి.
ఆచమనీయం సమర్పయామి. శ్రీ మహాగణాధిపతయేనమః స్నానం

మంత్రం : ఓం ఆపోహిష్ఠామయోభువః। తాన ఊర్జేదధాతన మహేరణాయ చక్షసే।
యోవశ్శివత మోరసః। తస్యభాజయ తేహనః। ఉశతీరివ మాతరః।
తస్మాఅరంగమా మవః। యస్యక్షయాయజిన్వథఆపోజనయథాచనః॥

శ్రీమహాగణాధిపతయేనమః శుద్ధోదక స్నానం సమర్పయామి।

(ఈ పై మంత్రము చెప్పుచు స్నానము చేయవలెను.)

ఓం శ్రీ మహాగణపతయేనమః వస్త్రయుగ్మం సమర్పయామి।

(వస్త్రము లేనిచో దూదికి పసుపు, కుంకుమ పెట్టిఉంచవలెను.)

శ్రీ గణపతయేనమః యజ్ఞోపవీతార్థం అక్షతాన్ సమర్పయామి
దివ్య శ్రీచందనం సమర్పయామి
గంధస్యోపరి కుంకుమం సమర్పయామి
పుష్పమాలాం సమర్పయామి పుష్పైః పూజయామి

(పుష్పములుకాని లేక అక్షతలతో పూజించవలెను.)

ఓం సుముఖాయనమః ఓం ఏకదంతాయనమః ఓం కపిలాయ నమః
ఓం గజకర్ణకాయమనః ఓం లంబోదరాయనమః ఓం వికటాయనమః
ఓం విఘ్నరాజాయనమః ఓం గణాధిపాయనమః ఓం ధూమకేతవేనమః
ఓం గణాధ్యక్షాయనమః ఓం ఫాలచంద్రాయనమః ఓం గజాననాయనమః
ఓం వక్రతుండాయనమః ఓం శూర్పకర్ణాయనమః ఓం హేరంబాయనమః
ఓం స్కంధపూర్వజాయనమః

శ్రీ మహాగణాధిపతయేనమః షోడశనామ పూజాం సమర్పయామి.
ఓం మహాగణాధిపతయేనమః ధూపమాఘ్రాపయామి. ఓం మహాగణాధిపతయే నమః దీపం దర్శయామి ( దీపము వద్ద పుష్పములు వేసి నమస్కరించవలెను) దీప, ధూపానంతరం శుద్ధఆచమనీయం సమర్పయామి. (కొద్దిగా జలము ఆకులో విడిచి పెట్టవలెను).
నైవేద్యం: బెల్లం, పండ్లు, నారికేళము (ఈమంత్రము చెప్పుచు నైవేద్యముపైనీరు చల్లవలెను) ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం। భర్గోదేవస్య ధీమహీ। ధియోయోనః ప్రచోదయాత్। మహాగణాధిపతయేనమః అమృతనైవేద్యం నివేదయామి। హస్తౌప్రక్షాళయామి, పాదౌప్రక్షాయామి, శుద్ధఆచమనీయం సమర్పయామి. (అని చెప్పి ప్రక్కన నీరు విడిచి పెట్టవలెను). ఓం మహాగణపతయేనమః దక్షిణ సహిత తాంబూలం సమర్పయామి.

కర్పూర హారతి : వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభా ।
అవిఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా॥
కర్పూర నీరాజనం సమర్పయామి.

మంత్రపుష్పము : (పుష్పములు పట్టుకొని ఈ మంత్రము చెప్పవలెను.)
తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి. తన్నోదంతిః ప్రచోదయాత్॥ సువర్ణ దివ్య మంత్ర పుష్పం సమర్పయామి. (అని చెప్పి గణపతి పైన పుష్పములు వేయవలెను.)

ఓం మహాగణాధిపతయేనమః ఆత్మ ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి.
(తనచుట్టూ తాను మూడుసార్లు తిరగవలెను.)

మంత్ర హీనం క్రియాహీనం భక్తిహీనం గణాధిప।
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే॥
అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయా భగవాన్
సర్వాత్మకః శ్రీ మహాగణాధిపతిః సుప్రీత స్సు ప్రసన్నో
వరదోభవతు మహాగణాధిపతి అనుగ్రహ సిద్ధిరస్తు.
(చేతిలో అక్షతలు, నీరు వేసుకొని ప్రక్క ఆకులో విడిచిపెట్టవలెను.)

శ్రీ మహాగణాదిపతి ప్రసాదం శిరసా గృహ్ణామి.
(అనుచు పూజించిన పుష్పములు అక్షతలు శిరస్సుపై వేసుకొనవలెను.)

**ఉద్వాసనం:** యజ్ఞేన యజ్ఞమయజంత దేవాః తానిధర్మాణి ప్రథమాన్యాసన్। తేహనాకం మహిమానస్సచంతే యత్ర పూర్వేసాధ్యాస్సంతి దేవాః॥
శ్రీ మహాగణాధిపతిం యథాస్థానం ప్రవేశయామి పునరాగమనాయచ.

(అని పై మంత్రము చెప్పి ప్రతిమను కొంచెము కదపవలెను.)

## పురుషసూక్త విధానేన పూజా ప్రారంభః

ఇదంవిష్ణుర్విచక్రమే త్రేధానిదధే పదం సమూఢమస్య పాగ్ం సురే॥ సక్తుమివతిత ఉనాపునంతో యత్ర ధీరామనసా వాచ మక్రతా। అత్రా సఖాయస్సఖ్యానిజానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాధివాచి॥ అని మీ ఇష్టదైవం పేరు చెప్పి సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీ పుత్ర పరివార సమేతం శ్రీ లక్ష్మీ నారాయణ మావాహయామి. స్థాపయామి. పూజయామి. (నిత్యపూజకు ప్రాణ పతిష్ఠ అవసరం లేదు. విశేష దినములలో ప్రాణ పతిష్ఠ చేయవలెను.)

## ప్రాణ ప్రతిష్ఠాపనమ్

(ఈ క్రింది మంత్రమును చదువుచు దేవుని పై తమలుపాకును పట్టుకొని వుంచవలెను.)
అస్యశ్రీప్రాణప్రతిష్ఠా మహామంత్రస్య, బ్రహవిష్ణు మహేశ్వరాఋషయః, ఋగ్యజుస్సామా థర్వణశ్ఛందాంసి ప్రాణ శక్తిః, పరాదేవతా, హ్రాం బీజం, హ్రీం శక్తిః, క్రోం కీలకం, ప్రాణ పతిష్ఠాసిద్ధ్యర్థేజపేవినియోగః॥

**కరన్యాసమ్** – హ్రాం అంగుష్ఠాభ్యాం నమః, హ్రీం తర్జనీభ్యాం నమః, – హ్రూం మధ్యమాభ్యాం నమః, హ్రైం అనామికాభ్యాంనమః, హ్రౌం కనిష్ఠికాభ్యాంనమః, హ్రః కరతల కర పృష్ఠాభ్యాంనమః

**అంగన్యాసమ్** – హ్రాం హృదయాయనమః, హ్రీం శిరసేస్వాహా, హ్రూం శిఖాయైవషట్, హ్రైంకవచాయహుమ్, హ్రౌం నేత్రత్రయాయ వౌషట్, హ్రః అస్త్రాయ ఫట్, భూర్భువస్సువరోమితి దిగ్బంధః

**ధ్యానమ్** – శాంతాకారం భుజగ శయనం పద్మనాభం సురేశమ్।
విశ్వాకారం గగన సదృశం మేఘవర్ణం శుభాంగమ్॥
లక్ష్మీకాంతం కమలనయనం యోగి హృద్ధ్యానగమ్యమ్।
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైక నాథమ్॥

ఓం హ్రాం, హ్రీం, క్రోం, యం, రం. లం, వం, శం, షం, హం, ళం, క్షం, శ్రీలక్ష్మీ నారాయణ ప్రాణ ఇహప్రాణః ఓం హ్రాం, హ్రీం, క్రోం, శ్రీలక్ష్మీనారాయణ సర్వేంద్రియమనోవాఙ్మనః చక్షుః శ్రోత్ర, జిహ్వా ఘ్రాణ ఇహైవాగత్య సుఖం చిరం తిష్ఠంతు స్వాహా।

ఓం అసునీతే పునరస్మాసు చక్షుఃపునః ప్రాణమిహినో ధేహిభోగం। జోక్పస్యేమ సూర్యముచ్చరం తమనుమతేమృడయాన స్వస్తి॥ అమృతం వై ప్రాణ అమృత మాపః ప్రాణానేన యథాస్థానము పహ్వాయతే। సాంగం, సాయుధం, సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం హేస్వామిన్॥ సర్వజగన్నాథయా వత్పూజావసానకమ్ తావత్త్వం ప్రీతిభావేన ప్రతిమాయాం స్థిరోభవ, వరదోభవ, అవకుంఠితోభవ, సుముఖోభవ, సుప్రసన్నోభవ, స్థిరాసనంకురు

(అని అక్షతలు, పుష్పములు దేవునిపై వేయవలెను.)

## ధ్యానమ్

ఓం ధ్యాయేత్ సత్వగుణాతీతంగుణత్రయసమన్వితం।
లోకనాథం త్రిలోకేశం కౌస్తుభాభరణం హరిం।
పీతాంబరం నీలంవర్ణం శ్రీవత్సపరిభూషితం।
గోవిందం గోకులానందం బ్రహ్మాద్యైరభి పూజితమ్॥

(ఇట్లు ధ్యానించి నమస్కరించవలెను)

## ఆవాహనమ్

సహస్రశీర్షాపురుషః సహస్రాక్షః సహస్రపాత్ । సభూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠద్దశాంగులమ్ । సాంగం సాయుధం సశక్తి పత్నీపుత్ర పరివార సమేతం శ్రీ లక్ష్మి నారాయణ మావాహయామి, పూజయామి ॥

( అని చెప్పి అక్షతలు పుష్పములు దేవుని పై వేయవలెను)

## ఆసనమ్

పురుష ఏ వేదగ్ం సర్వం – యద్భూతం యచ్చభవ్యం।
ఉతామృతత్వస్యేశానః – యదన్నేనాతిరోహతి।

శ్లో॥ కల్పద్రుమూలే మణి వేది మధ్యే సింహాసనం స్వర్ణ మయం సురత్నం।
విచిత్ర వస్త్రావృత మచ్యుతప్రభో గృహాణ లక్ష్మి ధరణీ సమన్వితా॥
శ్రీ లక్ష్మి నారాయణాభ్యాం నమః నవరత్న ఖచిత హేమ సింహాసనం సమర్పయామి

(అని అక్షతలు వేయవలెను)

## పాద్యమ్

ఏతావానస్యమహిమా – అతో జ్యాయాగ్ంశ్చ పూరుషః–
పాదోస్యవిశ్వాభూతాని। త్రిపాదస్యామృతం దివి॥

శ్లో॥ శ్రీ కృష్ణ సర్వ దేవానాం అధిక స్సర్వకామదః।
పాద్యం గృహాణదేవేశ మమ సౌఖ్యం వివర్ధయ ।

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాంనమః పాదయోః పాద్యం సమర్పయామి.

(అని పుష్పముతో దేవుని పాదముల పై నీరు చల్లవలెను)

## అర్ఘ్యమ్

త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః – పాదోऽస్యేహ భవాత్పునః।
తతో విష్వఙ్వ్య క్రామత్। సాశనానశనే అభి॥

శ్లో॥ గంగాజల సమానీతం సువర్ణకలశేస్థితం।
అర్ఘ్యం గృహాణ భగవన్ కాలరూపనమోస్తుతే॥

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాంనమః హస్తయోః అర్ఘ్యం సమర్పయామి.

(అని పుష్పముతో దేవుని చేతుల పై నీరు చల్లవలెను)

## ఆచమనీయమ్

తస్మాద్విరాఢజాయత। విరాజో అధిపూరుషః।
సజాతో అత్యరిచ్యత। పశ్చాద్భూమిమథోపురః॥

శ్లో॥ మందాకిన్యాస్తు యద్వారి సర్వపాపహరం శుభమ్।
తదితం కల్పితం దేవ సమ్యగాచమ్యతాంవిభో॥

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాంనమః ఆచమనీయం సమర్పయామి.

(అని దేవుని ముఖము మీద పుష్పముతో నీరు చల్లవలెను)

## స్నానమ్

యత్పురుషేణ హవిషా। దేవాయజ్ఞ మతన్వత।
వసంతో అస్యాసీదాజ్యమ్। గ్రీష్మ ఇధ్మశ్శరద్ధవిః॥

శ్లో॥ సుగంధి విష్ణు తైలంచ సుగంధామల కీజలమ్।
దేహ సౌందర్య బీజంచ గృహ్యతాం శ్రీ హరప్రియే॥
ఓం శ్రీ లక్ష్మీ నారాయణాభ్యాం నమః స్నానం ఆరభేత్।
(విగ్రహములున్నచో వాటికి స్నానం చేయించవలెను. లేదా పటమున్నచో దానిపై నీరు చల్లవలెను)
ముందు విగ్రహములను శుద్ధజలముతో కడిగి ఒక పళ్ళెములో నుంచవలెను. వాటికి పంచామృతముతో అభిషేకం చేయవలెను.

## పంచామృతస్నానమ్

### క్షీరం (పాలు)

ఆప్యాయస్వసమేతుతే విశ్వతస్సోమ వృష్ణియమ్। భవావాజస్య సంగధే॥
శ్రీ లక్ష్మీనారాయణాభ్యాంనమః క్షీరేణస్నపయామి॥
(అని విగ్రహముపై పాలు పోయవలెను)

### దధి (పెరుగు)

దధిక్రావుణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్యవాజినః।
సురభినోముఖాకరత్ప్రణ ఆయుగ్ంషితారిషత్॥
ఓం శ్రీ లక్ష్మీనారాయణాభ్యాంనమః దధ్నాస్నపయామి॥
(అని పెరుగు వేయవలెను)

### ఆజ్యం (నెయ్యి)

శుక్ర మసిజ్యోతిరసి తేజోసి దేవోవస్సవితోత్పునా
త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసో స్సూర్యస్యరశ్మిభిః॥
ఓం శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః ఘృతేనస్నపయామి॥
(అని నెయ్యి వేయవలెను)

### మధుః (తేనె)

మధువాతా ఋతాయతే మధుక్షరన్తి సింధవః
మాధ్వీర్నస్సన్త్వోషధీః।
మధు నక్తముతోషసి మధు మత్పార్థివగ్ం రజః
మధు ద్యౌరస్తునఃపితా।

మధు మాన్నో వనస్పతిర్మధు మాగ్ం అస్తుసూర్యః
మాధ్వీర్గావోభవంతునః।
ఓం శ్రీ లక్ష్మీనారాయణాభ్యాంనమః మధునాస్నపయామి॥
(అని తేనె వేయవలెను)

## శర్కర ( పంచదార)

స్వాదుః పవస్వదివ్యాయ జన్మనేస్వాదురింద్రాయ సుహవీతునామ్నే।
స్వాదుర్మిత్రాయ వరుణాయ వాయవే బృహస్పతయే మధుమాం అదాభ్యః
ఓం శ్రీ లక్ష్మీనారాయణాభ్యాంనమః శర్కరయా స్నపయామి॥
(అని పంచదార వేయవలెను)

## ఫలోదకం ( కొబ్బరికాయ)

యాః ఫలి నీర్యా అఫలా అపుష్పాయాశ్చపుష్పిణీః।
బృహస్పతి ప్రసూతాస్తానో ముంచన్త్వగ్ం హసః॥
ఓం శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః ఫలోదకేనస్నపయామి॥
(అని కొబ్బరి నీరు వేయవలెను తరువాత విగ్రహములను బాగా కడిగి ఈదిగువ సూక్తములతో స్నానము చేయించవలెను)
పురుషసూక్తమ్ – విష్ణుసూక్తమ్ – నారాయణ సూక్తమ్ – భూసుక్తంతో స్నానము చేయవలెను.

## శుద్ధోదక స్నానమ్

(అనగా సుగంధ ద్రవ్యములతో చేయవలెను)

ఓం ఆపోహిష్ఠామయోభువస్థాన ఊర్జేదధాతన।
మహేరణాయ చక్షషే। యోవశ్శివతమోరసః। తస్యభాజ
యతేహనః ఉశతీరివమాతరః । తస్మాదరంగ
మామవో యస్యక్షయాయజిన్వథ ఆపోజనయథాచనః॥
ఓం శ్రీ లక్ష్మీనారాయణాభ్యాంనమః శుద్ధోదక స్నానం సమర్పయామి॥

## వస్త్రమ్

ఓం సప్తాస్యాసన్పరిధయః। త్రిస్సప్తసమిధః కృతాః।
దేవాయద్యజ్ఞం తన్వానాః। అబధ్నన్పురుషంపశుమ్॥

శ్లో॥ స్వర్ణాంచలం స్వర్ణవిచిత్రశోభితం।
కౌశేయ యుగ్మం పరికల్పితంమయా।
దామోదర ప్రావరణం గ్రహణ మాయాబల ప్రావృత దివ్యరూప॥

ఓం శ్రీ లక్ష్మీనారాయణాభ్యాంనమః వస్త్రయుగ్మం సమర్పయామి॥

(అని చెప్పి వస్త్రము కాని లేదా ప్రత్తిని (దూది) గంధముతోను కుంకుమతో బొట్టుపెట్టి దేవుని పై వుంచవలెను)

## యజ్ఞోపవీతమ్ – జంద్యమ్

ఓం తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్ పురుషం జాతమగ్రతః।
తేనదేవ అయజంత సాధ్యాఋషయశ్చయే॥

శ్లో॥ బ్రహ్మ విష్ణు మహేశానం నిర్మితం బ్రహ్మ సూత్రకం।
గృహాణ భగవన్ విష్ణో సర్వేష్టఫలదోభవ॥

ఓం శ్రీ లక్ష్మీనారాయణాభ్యాంనమః ఉపవీతం సమర్పయామి॥

(ప్రత్తితో దారము చేసి గంధము, కుంకుమ బొట్టు పెట్టి వుంచవలెను)

## గంధమ్

తస్మాద్యజ్ఞాత్సర్వహుతః। సంభృతం పృషదాజ్యమ్।
పశూగ్ంస్తాగ్ంశ్చక్రే వాయువ్యాన్। ఆరణ్యాన్గ్రామ్యాశ్చయే॥

శ్లో॥ శ్రీ ఖండం చందనం దివ్యం గంధాఢ్యం సుమనోహరమ్।
విలేపన సురశ్రేష్ఠ ప్రీత్యర్థం ప్రతి గృహ్యతామ్॥

ఓం శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః దివ్య శ్రీ చందనం సమర్పయామి.

(అని కుడిచేతి ఉంగరవ్రేలితో స్వామి ముఖంపై గంధం పెట్టవలెను)

## ఆభరణమ్

ఓం తస్మాద్యజ్ఞాత్సర్వహుతః। ఋచస్సామాని జజ్ఞిరే।
ఛందాగ్ం సిజి జ్ఞిరే తస్మాత్। యజుస్తస్మాదజాయత॥

శ్లో॥ హిరణ్యహారకేయూర గ్రైవేయ మణికంకణైః ।
సుహారంభూషణైర్యుక్తం గృహాణ పురుషోత్తమ ॥

ఓం శ్రీ లక్ష్మీనారాయణాభ్యాంనమః ఆభరణాని సమర్పయామి॥
ఆభరణార్థే అక్షతాన్ సమర్పయామి॥

(ఆభరణములు లేనిచో అక్షతలు వేయవలెను)

## పుష్పమ్

ఓం తస్మాదశ్వా అజాయంత । యే కేచోభయాదతః।
గావోహ జజ్ఞిరే తస్మాత్। తస్మాజ్జాతా అజావయః॥

శ్లో॥ చామంతి కావకుళ చంపక పాటలా। పున్నాగ జాజి రసాల మల్లికైః।
బిల్వ ప్రవాళ తులసీదళ పుష్పైభిః త్వాం పూజయామి జగదీశ్వర ॥

ఓం శ్రీ లక్ష్మీనారాయణాభ్యాంనమః సువర్ణ పుష్పాణి సమర్పయామి॥
పుష్పైః పూజయామి॥

### అథాంగ పూజా

ఓం కేశవాయనమః పాదౌ పూజయామి।
ఓం గోవిందాయనమః గుల్ఫౌ పూజయామి।
ఓం ఇందిరాపతయేనమః జంఘే పూజయామి।
ఓం అనఘాయనమః జానుని పూజయామి।
ఓం జనార్ధనాయ నమః ఊరూం పూజయామి।
ఓం విష్టరశ్రవసేనమః కటిం పూజయామి।
ఓం కుక్షిస్థాకిల భువనాయనమః ఉదరం పూజయామి।
ఓం లక్ష్మీ వక్షస్థలాయనమః వక్షస్థలం పూజయామి।
ఓం శంఖచక్ర గదాశారంగ పాణయేనమః పాణౌ పూజయామి।
ఓం మహా బాహ వేనమః బాహూన్ పూజయామి।

ఓం కంబు కంఠాయనమః కంఠం పూజయామి ।
ఓం కుందకుట్మల దంతాయనమః దంతం పూజయామి ।
ఓం సూర్య చంద్రాగ్ని ధారయేనమః నేత్రే పూజయామి।
ఓం నాసాగ్ర మౌక్తికాయనమః నాసికం పూజయామి ।
ఓం సహస్ర శిరసే నమః శిరః పూజయామి ।
ఆవాహితేభ్యస్సర్వేభ్యో దేవేభ్యోనమః సర్వాణ్యంగాని పూజయామి।
(వీలును బట్టి ఇష్టదేవతను సహస్ర నామములతో గాని అష్టోత్తర శత నామములతోగాని పూజ చేయవలెను. పుష్పములతోగాని లేక అక్షతలతోగాని పూజచేయవలెను)



## శ్రీ విష్ణు అష్టోత్తర శతనామావళి

ఓం విష్ణవేనమః
ఓం జిష్ణవే నమః
ఓం వషట్కారాయ నమః
ఓం దేవదేవాయ నమః
ఓం వృషాకపయే నమః
ఓం దామోదరాయ నమః
ఓం దీన బంధవే నమః
ఓం ఆది దేవాయ నమః
ఓం అది తేస్తుతాయ నమః
ఓం పుణ్డరీకాయ నమః 10
ఓం పరానందాయ నమః
ఓం పరాత్పరాయ నమః
ఓం నరకాంతకాయ నమః
ఓం అవ్యక్తాయ నమః
ఓం శాశ్వతాయ నమః
ఓం అనంతాయ నమః
ఓం అజాయ నమః
ఓం వాసుదేవాయ నమః
ఓం అవ్యయాయ నమః
ఓం నారాయణాయ నమః 20
ఓం గవాధ్యక్షాయ నమః
ఓం గోవిందాయ నమః
ఓం కీర్తి భాజనాయ నమః
ఓం గోవర్ధనోద్ధరాయ నమః
ఓం దేవాయ నమః
ఓం భూధరాయ నమః
ఓం భువనేశ్వరాయ నమః
ఓం వామనాయ నమః
ఓం యజ్ఞపురుషాయ నమః
ఓం యజ్ఞేశాయ నమః 30
ఓం యజ్ఞవాహకాయ నమః
ఓం చక్రపాణయే నమః
ఓం గదా పాణయే నమః
ఓం నరోత్తమాయ నమః
ఓం వైకుంఠాయ నమః
ఓం దుష్టమదనాయ నమః
ఓం భూగర్భాయ నమః
ఓం పీత వాససే నమః

## శ్రీ విష్ణు అష్టోత్తరశతనామావళి

ఓం త్రివిక్రమాయ నమః
ఓం త్రికాలజ్ఞాయ నమః 40
ఓం త్రిమూర్తయే నమః
ఓం నందికేశ్వరాయ నమః
ఓం రామాయనమః
ఓం హయగ్రీవాయ నమః
ఓం భీమాయ నమః
ఓం రౌద్రాయ నమః
ఓం భవోద్భవాయ నమః
ఓం శ్రీ పతయే నమః
ఓం శ్రీ ధరాయ నమః
ఓం శ్రీ శాయ నమః 50
ఓం మంగళాయ నమః
ఓం దామోదరాయ నమః
ఓం జనార్ధనాయ నమః
ఓం దయోపేతాయ నమ
ఓం కేశావాయ నమః
ఓం కేశసూదనాయ నమః
ఓం మధుసూధనాయ నమః
ఓం వరేణ్యాయ నమః
ఓం వరదాయ నమః
ఓం జలశాయినే నమః 60
ఓం ఆనందాయ నమః
ఓం వసుదేవజాయ నమః
ఓం హిరణ్యరేతసే నమః
ఓం దీప్తాయ నమః
ఓం పురాణాయ నమః
ఓం పురుషోత్తమాయ నమః
ఓం గజేంద్రవరదాయ నమః
ఓం సనకాది మునిసేవ్యాయ నమః
ఓం భగవతే నమః
ఓం శంకరప్రియాయ నమః 70
ఓం నీళాకాంతాయ నమః
ఓం లీలామానుషవిగ్రహాయ నమః
ఓం ఘనశ్యామాయ నమః
ఓం జగత్కారణాయ నమః
ఓం ధరాకాంతాయ నమః
ఓం బాదరాయ ణాయ నమః
ఓం రక్షణాయ నమః
ఓం దుస్స్వప్ననాశకాయ నమః
ఓం పుణ్యాయ నమః
ఓం సకలాయ నమః 80
ఓం నిష్కలాయ నమః
ఓం శుద్ధాయ నమః
ఓం నిర్గుణాయ నమః
ఓం గుణ శాశ్వతాయ నమః
ఓం హిరణ్యాతను సంకాశాయ
ఓం ప్రభాయనమః
ఓం మేఘశ్యామాయ నమః
ఓం చతుర్బాహవే నమః
ఓం కుశలాయ నమః
ఓం కమలేక్షణాయ నమః 90
ఓం జ్యోతిషేయ నమః
ఓం రూపాయ నమః
ఓం అరూపాయ నమః
ఓం నిరంజనాయ నమః
ఓం సర్వేశాయ నమః
ఓం సర్వతోముఖాయ నమః
ఓం జ్ఞానాయ నమః
ఓం కూటస్థాయ నమః
ఓం అచలాయ నమః
ఓం జ్ఞానదాయ నమః 100
ఓం పరమాయ నమః
ఓం బుద్ధావతారాయ నమః
ఓం దత్తాత్రేయాయ నమః
ఓం ధన్వంతరిణే నమః
ఓం యోగరూపిణే నమః
ఓం ఋషభాయ నమః
ఓం భూతమయాయ నమః
ఓం ప్రభవే నమః 108

ఇతి శ్రీనారాయణాష్టోత్తర శతనామావళి స్సమాప్తా

## ధూపమ్

ఓం యత్పురుషం వ్యదధుః కతిధావ్య కల్పయన్।
ముఖం కిమస్య కౌబాహూకావూరూ పాదావుచ్యేతే॥

శ్లో॥ దశాంగ గుగ్గులో పేతం సుగంధంసుమనోహరమ్।
ధూపం గృహాణ దేవేశ సర్వ దేవ నమస్కృత॥

ఓం శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః ధూపమాఘ్రాపయామి॥

(అగరుబత్తి వెలిగించి స్వామికి చూపవలెను)

## దీపమ్

ఓం బ్రహ్మణోస్య ముఖమాసీత్। బాహూరాజన్యః కృతః।
ఊరూతదస్య యద్వైశ్యః । పద్భ్యాగ్ం శూద్రోఅజాయత॥

శ్లో॥ దీపం కాంచన పాత్రస్థం నవగోఘృత సాధితం।
అర్పయామి మహాధ్వాంత గజపంచాస్యసన్నిభమ్॥

ఓం శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః దీపం దర్శయామి

(ఒక నెయ్యి వత్తి వెలిగించి స్వామికి చూపవలెను)

## నైవేద్యమ్

ఓం చంద్రమామనసోజాతః చక్షోస్సూర్యో అజాయత।
ముఖాదింద్రశ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయురజాయత॥

శ్లో॥ ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యమ్।
భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్॥

సత్యం త్వర్తేన పరిషించామి। అమృత మస్తు। అమృతోపస్తరణమసి॥

(అని చెప్పుచు నైవేద్యం పై నీరు చల్లవలెను). ఈక్రింది విధముగా చెప్పుచు ఐదు మార్లు రెండు చేతులతోను పదార్థములను దేవునికి నివేదించవలెను.

ఓం ప్రాణాయ స్వాహా। ఓం అపానాయస్వాహా। ఓం వ్యానాయ స్వాహా।
ఓం ఉదానాయ స్వాహా। ఓం సమానాయ స్వాహా। ఓం బ్రహ్మణ్యే స్వాహా।
మధ్యే మధ్యే పానీయం సమర్పయామి। హస్తౌ ప్రక్షాళయామి।
పాదౌ ప్రక్షాళయామి। (అని ప్రక్కకు నీళ్లు విడిచి పెట్టవలెను)
శుద్ధాచమనీయం సమర్పయామి। మహానైవేద్యం నివేదయామి॥

## తాంబూలమ్

ఓం నాభ్యా ఆసీదంతరిక్షం శీర్ష్ణో ద్యౌ స్సమవర్తత।
పద్భ్యాం భూమిర్దిశశ్శ్రోత్రాత్। తథాలోకాగ్ం అకల్పయన్ ॥

శ్లో॥ పూగీఫలం మహద్దివ్యం నాగవల్యాదళైర్యుతం।
కర్పూర చూర్ణేన సంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్॥

ఓం శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః దక్షిణ సహిత తాంబూలం సమర్పయామి।
**(అని దక్షిణ, తమలపాకులు, వక్కలు దేవుని ముందు వుంచవలెను)**

తాంబూలానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి।

(అని నీళ్ళు ప్రక్కకు విడువవలెను)

## నీరాజనమ్

ఓం వేదాహమేతం పురుషం మహాంతమ్ । ఆదిత్యవర్ణం తమసస్తుపారే।
సర్వాణి రూపాణి విచిత్యధీరః నామాని కృత్వాఽభివదన్ యదాస్తే॥

మం॥ హిరణ్య పాత్రం మధోః పూర్ణందదాతి।
మధవ్యో సానీతి ఏకధా బ్రహ్మణముపహరతి॥
ఏకధైవయజమాన ఆయుస్తేజోదధాతి॥

ఓం శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః వేదోక్త కర్పూర నీరాజనమ్ దర్శయామి।
(అని హారతి యివ్వవలెను) నీరాజనానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి॥
(అని నీరు ప్రక్కకు విడిచి పెట్టవలెను)

## మంత్ర పుష్పమ్

**(చేతిలో అక్షతలు పుష్పములు తీసుకొనిలేచి నిలబడి మంత్ర పుష్పం చెప్పవలెను)**

ఓం ధాతా పురస్తాద్యముదాజహార। శక్రః ప్రవిద్వాన్ ప్రదిశ్చతస్రః। తమేవం విద్వానమృత ఇహభవతి। నాన్యఃపన్థా అయనాయ విద్యతే ॥ ఓం సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువమ్। విశ్వం నారాయణం దేవమక్షరం పరమం పదమ్। విశ్వతః పరమాన్ నిత్యం విశ్వంనారాయణగ్ం హరిం। విశ్వమే వేదం పురుషస్త ద్విశ్వముపజీవతి। పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్॥

నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్। నారాయణ పరోజ్యోతి రాత్మానారాయణః పరః। నారాయణ పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః। నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణః పరః। యచ్చకించిత్ జగత్సర్వం దృశ్యతే శ్రూయతేపివా। అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః అనంత మవ్యయంకవిగ్ం సముద్రేంతం విశ్వశంభువమ్। పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్॥ అధోనిష్ట్యావితస్త్యాంతే నాభ్యాముపరితిష్ఠతి। జ్వాలమాలా కులంభాతీ విశ్వస్యాయతనం మహత్। సంతతగ్ం శిలాభిస్తు లంబత్యాకోశసన్నిభం తస్యాంతే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితం ॥ తస్యమధ్యే మహానగ్నిః విశ్వార్చిర్విశ్వతోముఖః। సోగ్రబుగ్విభజన్తిష్ఠన్నాహార మజరకవిః। తిర్యగూర్ధ్వమధ శ్శాయిరశ్మ యస్తస్య సంతతా। సంతాపయితిస్వందేహమాపాదతల మస్తకః। తస్యమధ్యేవహ్నిశిఖా అణీయోఽర్ధ్వావ్యవస్థితః।నీలతో యదమధ్యస్థాద్విద్యుల్లేఖేవ భాస్వరా। నీవార శూక వత్తన్వీపీతా భాస్వత్యణూపమా। తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితః। సబ్రహ్మాస్సశివస్సహరి స్స్యేంద్ర స్సోక్షరఃపరమ స్వరాట్॥

యోఽపాం పుష్పం వేద । పుష్పవాన్ ప్రజావాన్ పశుమాన్ భవతి।

చన్ద్రమావా అపాం పుష్పమ్। పుష్పవాన్ ప్రజావాన్ పశుమాన్ భవతి। యఏవంవేద।

యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।

అగ్నిర్వాఅపామాయతనమ్। ఆయతనవాన్భవతి।

యోఽగ్నేరాయతనం వేద। ఆయతనవాన్భవతి॥

ఆపోవా అగ్నేరాయతనం। ఆయతనవాన్భవతి। య ఏవం వేద

యోఽపా మాయతనంవేద। ఆయతనవాన్భవతి।

వాయుర్వాఅపామాయతనం। ఆయతనవాన్భవతి।

యోవాయోరాయతనం వేద। ఆయతనవాన్భవతి।

ఆపోవైవాయో రాయతనం। ఆయతనవాన్భవతి । యఏవం వేద।

యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।

అసౌవైతపన్నపామాయతనమ్। ఆయతనవాన్భవతి।

యోఽముష్య తపత ఆయతనం వేద। ఆయతనవాన్భవతి॥

ఆపోవా అముష్యతపత ఆయతనమ్। ఆయతనవాన్భవతి। య ఏవం వేద

యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।

చన్ద్రమావా ఆపామాయతనం ॥ ఆయతనవాన్భవతి।

యశ్చన్ద్ర మస ఆయతనం వేద। ఆయతనవాన్భవతి

ఆపోవై చంద్రమస ఆయతనం। ఆయతనవాన్భవతి। యఏవం వేద।

యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।

నక్షత్రాణి వాఅపామాయతనమ్। ఆయతనవాన్భవతి।

యోఽనక్షత్రాణా మాయతనం వేద। ఆయతనవాన్భవతి।

ఆపోవై నక్షత్రాణా మాయతనం । ఆయతనవాన్భవతి। య ఏవం వేద

యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।

పర్జన్యోవా ఆపామాయతనమ్॥ ఆయతనవాన్భవతి।

యః పర్జన్యస్యాయతనం వేద। ఆయతనవాన్భవతి।

ఆపోవై పర్జన్యస్యాయతనం। ఆయతనవాన్భవతి। యఏవం వేద।

యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి।

సంవత్సరోవా అపామాయతనమ్। ఆయతనవాన్భవతి।

యస్సంవత్సరస్యాయతనం వేద । ఆయతనవాన్భవతి।

ఆపోవై సంవత్సర స్యాయ తనం। ఆయతనవాన్భవతి। యఏవం వేద।
యోऽప్సునావం ప్రతిష్ఠితాం వేద। ప్రత్యేవతిష్ఠతి।
కింతద్విష్ణోర్బలమాహుః కాదీప్తిః కిం పరాయణమ్।
ఏకోయద్ధార యద్దేవః రేజతీరోదసీ ఉభౌ।
వాతాద్విష్ణోర్బలమాహుః యద్విష్ణోరేక ముత్తమమ్॥
ఋతగ్ం సత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణ పింగళమ్।
ఊర్ధ్వ రేతం విరూపాక్షం విశ్వరూపాయవైన మోనమః।
రాజాధిరాజాయ ప్రసహ్య సాహినే నమోవయంవైశ్రవణాయ కుర్మహే।
సమేకామాన్ కామ కామాయ మహ్యం కామేశ్వరో వైశ్రవణో దదాతు।
కుబేరాయ వైశ్రవణాయ మహారాజాయనమః।
ఓం తద్బ్రహ్మ। ఓం తద్వాయుః । ఓం తదాత్మ । ఓం తత్సత్యం।
ఓం తత్సర్వం। ఓం తత్పురోర్నమః।
అంతశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు।
త్వం యజ్ఞస్త్వం వషట్ కారస్త్వ మింద్రస్త్వం।
రుద్రస్త్వం విష్ణు స్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః।
త్వం తదాప ఆపో జ్యోతీ రసో మృతం బ్రహ్మభూర్భువస్సు వరోమ్।
ఈశానస్సర్వ విద్యానాం ఈశ్వర స్సర్వ భూతానాం బ్రహ్మాధి
పతిర్బ్రహ్మణోదిపతిర్బ్రహ్మశివోమేऽస్తు సదాశివోమ్॥
సహస్ర పరమాదేవీ శతమూలా శతాంకురా।
సర్వగ్ం హరతు మే పాపం దూర్వాదుస్స్వప్ననాశినీ।
కాండాత్కాండాత్ప్రరోహంతీ పరుషః పరుషః పరి।

ఏవానో దూర్వే ప్రతను సహస్రేణ శతేనచ॥

యాశతేన ప్రతనోషి సహస్రేణ విరోహసి ।

తస్యాః స్తే దేవీష్టకే విధేమ హవిషావయమ్।

అశ్వక్రాంతే రథక్రాంతే విష్ణు క్రాంతే వసుంధరా।

శిరసాధారయిష్యామి రక్షస్వమాం పదేపదే।

తద్విష్ణోః పరమంపదగ్ం సదా పశ్యంతి సూరయః।

దివీవ చక్షు రాతతమ్। తద్వి ప్రాసోవిపన్యవో జాగృవాగ్ం

సస్సమింధతే విష్ణో ర్యత్పరమం పదమ్॥

ఋతగ్ం సత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణ పింగలం

ఊర్ధ్వ రేతం విరూపాక్షం విశ్వ రూపాయవైనమో నమః

నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి తన్నో

విష్ణుః ప్రచోదయాత్

తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి। తన్నో

రుద్రః ప్రచోదయాత్।

ఓం గురుదేవాయ విద్మహే పరబ్రహ్మణే ధీమహి। తన్నో

గురుః ప్రచోదయాత్।

ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛ తి సాగరం।
సర్వ దేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి॥

ఓం శ్రీ లక్ష్మీ నారాయణాభ్యాం నమః సువర్ణ దివ్య మంత్రపుష్పాంజలిం సమర్పయామి।

( అని చేతిలో నున్న పుష్పములు అక్షతలు దేవునిపై వేయవలెను.)

గమనిక : ఈ మంత్రపుష్పములన్ని పూజలయందు చెప్పుకొనవచ్చును.

## ప్రదక్షిణ నమస్కారమ్

(ఈ దిగువ మంత్రం చెప్పుతూ దేవుని చుట్టు మూడు సార్లు ప్రదక్షిణం చేయవలెను లేదా తన చుట్టు తాను మూడు సార్లు తిరగవలెను.)

యాని కాని చ పాపాని జన్మాంతర కృతానిచ।
తాని తాని ప్రశ్యంతి ప్రదక్షిణ పదే పదే॥

పాపోఽహం పాపకర్మా హం పాపాత్మా పాప సంభవః।
త్రాహిమాం కృపయా దేవా శరణాగత వత్సల॥

అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ।
తస్మా త్కారుణ్య భావేన రక్ష రక్ష జనార్దన॥

ప్రదక్షిణం కరిష్యామి సర్వ భ్రమ నివారణం।
సంసార సాగరాన్మాం త్వ ముద్ధ రస్వ మహా ప్రభో॥

ఓం శ్రీలక్ష్మి నారాయణాభ్యాం నమః ఆత్మ ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి ।

ఛత్రం సమర్పయామి – చత్రార్థే అక్షతాన్ సమర్పయామి।

చామరం సమర్పయామి – చామరార్థే అక్షతాన్ సమర్పయామి।

నృతం దర్శయామి – తదర్థే అక్షతాన్ సమర్పయామి।

గీతం శ్రావయామి (సంగీతం వినిపించవలెను.)

ఆందోళి కామా రోహయామి। అశ్వానారోహయామి। గజా నారోహయామి।

సమస్త రాజోపచార, శక్త్యుపచార, భక్త్యుపచార, మంత్రోపచార, దేవోపచార, సర్వోపచార పూజాం సమర్పయామి।

యస్య స్మృత్యాచనామోక్త్యా తపః పూజాక్రియాదిషు।
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యోవందే తమచ్యుతమ్॥

మంత్రహీనం క్రియా హీనం భక్తిహీనం జనార్దన।
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుమే॥

అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయా
భగవాన్ సర్వాత్మకః సుప్రీతః సుప్రసన్నోవరదో భవతు।
(అని చేతిలో అక్షతలు పుష్పములనునీటితో కలిపి పళ్ళెములో విడువవలెను).

సుమంగలీరియం వధూరిమాగ్‌ం సమేత పశ్యత।
సౌభాగ్య మస్యైద త్వాయాథాస్తం విపరీతన॥

శ్రీర్వర్చ స్వమాయుష్య మారోగ్య మా వీధాచ్ఛోభామానం మహీయతే।
ధనం ధాన్యం పశుం బహుపుత్ర లాభం శత సంవత్సరం దీర్ఘమాయుః॥

శతమానం భవతి శతాయుః పురుష శ్శతేంద్రియ।
ఆయుష్యే వేంద్రియేప్రతి తిష్ఠతి॥

(అని పురోహితుడు అచ్చట దంపతులపై ఈ పై మంత్రం చెప్పుతూ అక్షతలు వేయవలెను. తరువాత యజమాని అనగా పూజ చేయు వారు పురోహితునకు దక్షిణ తాంబూల మిచ్చి నమస్కరించవలెను.)

ఓం శ్రీ లక్ష్మీ నారాయణ దేవతా తీర్థ ప్రసాదం శిరసా గృహ్ణామి।
ఏతత్ఫలం శ్రీ పరమేశ్వరార్పణమస్తు ॥

(పూజ చేయబడిన పుష్పాక్షతలు తీసుకొని శిరస్సుపై వేసుకొనవలెను.)

# రుద్ర విధానేన శివపూజా విధిః

పూర్వోక్తప్రకారేణ ( అనగా మంగళ శ్లోకాలు – ఆచమనం – ప్రాణాయామము – సంకల్పం – కలశారాధనం – గణపతి పూజ, ప్రాణప్రతిష్ఠ చేసుకొని తరువాత ఈ క్రింది విధముగా పూజ ప్రారంభించవలెను. )

## ధ్యానమ్

శ్లో॥ ఓంకార బిందు సంయుక్తం నిత్యంధ్యాయంతి యోగినః।
కామదం మోక్షదం తస్మై సకారాయ నమోనమః॥

ఓం నమస్తే రుద్రమన్యవ ఉతోత ఇషవే నమః।
నమస్తే అస్తు ధన్వనే బాహుభ్యాము తతేనమః।
యాత ఇషుశ్శివ తమా శివం బభూవతేధనుః।
శివా శరవ్యా యా తవ తయా నోరుద్రమృడయ।

శ్రీ భవానీ శంకరస్వామినేనమః। ధ్యాయామి ధ్యానం సమర్పయామి।

( అని నమస్కరించ వలెను. )

## ఆవాహనమ్

యాతే రుద్ర శివా తనూర ఘోరాఽపాపకాశినీ।
తయాన స్తనువాశంతమయా గిరిశన్తాభి చాకశీహి।
యామిషంగిరి శన్త హస్తేబిభర్ష్యస్తవే।
శివాం గిరి త్రతాంకురు మాహిగ్ంసీః పురుషం జగత్।

శ్రీ భవానీ శంకరస్వామినే నమః। ఆవాహయామి, ఆవాహనం సమర్పయామి।

( అని అక్షతలు దేవునిపై వేయవలెను. )

## ఆసనమ్

శివేనవచసా త్వాగిరి శాచ్ఛా వదామస్తి। యథానస్సర్వమిజ్జ గద
యక్ష్మగ్ం సుమనా అసత్। అధ్యవోచదధి వక్తా ప్రథమో దైవ్యోభిషక్।
అహీగ్ంశ్చ సర్వాన్జం భయన్థ్సర్వాశ్చ యాతు ధాన్యః।
ఓం శ్రీ భవానీ శంకరస్వామినే నమః। దివ్య రత్న ఖచితహేమ సింహాసనం సమర్పయామి।

( అని అక్షతలు పుష్పములు వేసుకొనవలెను. )

## పాద్యమ్

ఓం అసౌయస్తామ్రో అరుణ ఉత బభ్రుస్సు మంగలః। యే చేమాగ్ం రుద్రా అభితో దిక్షు శ్రితాస్సహస్రశోవైషాగ్ంహేడ ఈ మహే। అసౌయోవ సర్పతి నీలగ్రీవో విలోహితః। ఉతైనం గోపా అదృశన్న దృశన్ను దహార్యః। ఉతైనం విశ్వాభూతాని సదృష్టో మృడయాతినః।

ఓం శ్రీభవానీ శంకర స్వామీనే నమః। పాదయోః పాద్యం సమర్పయామి।

(అని దేవునిపై నీరు ప్రోక్షించవలెను.)

## అర్ఘ్యమ్

ఓం నమో అస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే।
అథోయే అస్య సత్వానోహం తేభ్యోకరం నమః।
ప్రముఞ్చ ధన్వ స్త్వముభయో రార్త్ని యోర్జ్యామ్।
యాశ్చతే హస్త ఇషవః పరాతా భగవోవప।

ఓం శ్రీభవానీ శంకరస్వామినే నమః। హస్త యోః అర్ఘ్యం సమర్పయామి।

(అని భగవంతునిపై నీరు చల్లవలెను.)

## స్నానమ్

(ఇచ్చట పంచామృత స్నానము కూడ చేయవలెను. పాలు, పెరుగు, తేనే,నెయ్యి, చక్కెర.)

ఓం అవతత్య ధనుస్త్వగ్ం సహస్రాక్ష శతేషుధే।
నిశీర్యశల్యానాం ముఖాశివోనస్సుమనాభవ॥

ఓం శ్రీ భవానీ శంకరస్వామినే నమః స్నానం ఆరభేత్।

(అని స్నానం ప్రారంభించవలెను. ఇచ్చట నమక, చమకములతో అభిషేకము చేయవలెను.)

స్నానాంతరం శుద్ధా చమనీయం సమర్పయామి। (అని దేవునిపై నీరు చల్లవలెను.)

ఓం శ్రీభవానీ శంకరస్వామినేనమః। శుద్ధోదక స్నానం (శుద్ధోదకమనగా ముందు చెప్పినట్లు సుగంధ ద్రవ్యాలు అనగా యాలకులు, లవంగాలు, జాజికాయ, జాపత్రి, కుంకుమ పువ్వు).

## వస్త్రమ్

ఓం అవతత్య ధనుస్త్వగ్ం సహస్రాక్ష శతేషుధే। నిశీర్య శల్యానాం ముఖా శివోనః స్సుమనా భవ। విజ్యం ధనుః కపర్దినో

విశల్యోబాణవాగ్ం ఉత। అనేశన్న స్యేషవ ఆభురస్య నిషఙ్గథిః॥
ఓం శ్రీభవానీ శంకరస్వామినే నమః। వస్త్ర యుగ్మం సమర్పయామి।
(అని నూతన వస్త్రమును స్వామికి సమర్పించవలెను.)

## యజ్ఞోపవీతమ్

ఓంయాతేహేతిర్మీఢుష్టమహస్తే బభూవ తేధనుః।
తయాస్మాన్ విశ్వతస్త్వమయక్ష్మయాపరిబ్భుజ॥
ఓంయజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్స హజం పురస్తాత్।
ఆయుష్యమగ్రియం ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః॥

ఓం శ్రీ భవానీ శంకర స్వామినేనమః। ఉపవీతం సమర్పయామి। ఉపవీతార్థం అక్షతాన్‌సమర్పయామి। (అనిచెప్పుతూ యజ్ఞోపవీతమున్నచో యజ్ఞోపవీతముగాని లేదా ప్రత్తితో దారము చేసి దానికి గంధము కుంకుమతో బొట్టుపెట్టి భగవంతునిపై వేయవలెను)

## గంధమ్

ఓం నమస్తే అస్త్వాయుధాయానాతతాయ ధృష్ణవే।
ఉభాభ్యాముతతేనమో బాహుభ్యాం తవధన్వనే।
పరితేధన్వనో హేతి రస్మాన్ వృణక్తు విశ్వతః।
అథోయ ఇషుధిస్తవారే అస్మన్నిధేహితమ్॥

ఓం శ్రీ భవానీ శంకర స్వామినే నమః। దివ్యశ్రీ గంధం ధారయామి।
(అని దేవుని ముఖంపై గంధపు బొట్టు పెట్టవలెను)

## విభూతి

ఓం త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్।
ఉర్వారుకమివ బంధనాన్మృత్యోర్ముక్షీయమామృతాత్॥
ఓం శ్రీ భవానీ శంకర స్వామినే నమః భస్మంధారయామి।
(అని స్వామికి విభూతి పెట్టవలెను)

## కుంకుమ

ఓం నమో హిరణ్యబాహవే సేనాన్యే దిశాంచ పతయేనమో
నమో వృక్షేభ్యో హరికేశేభ్యః పశూనాం పతయేనమో

నమస్సస్పింజరాయ త్విషీమతే పథీనాం పతయే నమః॥
ఓం శ్రీ భవానీ శంకర సామినే నమః। కుంకుమంధారయామి।
(అని గంధముపై కుంకుమ పెట్టవలెను)

## ఆభరణమ్

ఓం ద్రాపే అన్ధసస్పతే దరిద్రన్నీలలోహిత। ఏషాం పురుషాణా
మేషాం పశూనాం మాభేర్మాఽరోమో ఏషాంకించ నామమత్।
యా తే రుద్రశ్శివా తనూశ్శివా విశ్వాహ భేషజీ।
ఓం శ్రీ భవానీ శంకరస్వామినే నమః। ఆభరణాని సమర్పయామి। ఆభరణార్థే అక్షతాన్ సమర్పయామి। (అని స్వామి వారిపై ఆభరణములను అలంకరించవలెను.)

## పుష్పమాల

ఓం శివా రుద్రస్య భేషజీ తయానోమృడజీవసే। ఇమాగ్‌ం
రుద్రాయ తవసే కపర్దినే క్షయ ద్వీరాయ ప్రభరామహే మతిమ్।
యథా న శ్శమ సద్ద్వి పదే చతుష్ప దే విశ్వం పుష్టం గ్రామే అస్మిననాతురమ్।
ఓం శ్రీభవానీ శంకర స్వామినే నమః। అలంకారణార్థే పుష్పమాలాం సమర్పయామి।
(అని స్వామి వారిపై పుష్పమాల వేయవలెను.)

| | |
|---|---|
| ఓం నిధన పతయే నమః | నిధనపతాన్తికాయనమః |
| ఓం ఊర్ధ్వాయనమః | |
| ఓం సువర్ణాయ నమః | సువర్ణ లిఙ్గాయ నమః |
| ఓం హిరణ్యాయన నమః | హిరణ్యలిఙ్గాయ నమః |
| ఓం దివ్యాయ నమః | దివ్యలిఙ్గాయ నమః |
| ఓం భవాయ నమః | భవలిఙ్గాయ నమః |
| ఓం శర్వాయ నమః | శర్వలిఙ్గాయ నమః |
| ఓం శివాయ నమః | శివలిఙ్గాయ నమః |
| ఓం జ్వలాయ నమః | జ్వలలిఙ్గాయ నమః |
| ఓం ఆత్మాయ నమః | ఆత్మలిఙ్గాయ నమః |
| ఓం పరమాయ నమః | – పరమలిఙ్గాయ నమః |

ఏతత్ సోమస్య సూర్యస్య సర్వలిఙ్గగ్‌ం స్థాపయతి పాణిమంత్రం పవిత్రమ్।
భవాయ దేవాయనమః। శర్వాయ దేవాయ నమః।

ఈశాన దేవాయ నమః। పశుపతయేదేవాయ నమః॥
ఉగ్రాయ దేవాయ నమః॥ భీమాయ దేవాయ నమః॥
మహతే దేవాయ నమః॥ భవస్య దేవస్య పత్న్యై నమః॥
శర్వస్య దేవస్య పత్న్యై నమః॥ పశుపతేర్దేవస్యపత్న్యై నమః॥
రుద్రస్య దేవస్య పత్న్యై నమః॥ ఉగ్రస్యదేవస్యపత్న్యై నమః॥
భీమస్య దేవస్య పత్న్యై నమః॥ మహతోదేవస్యపత్న్యై నమః॥

(పిదప ఈ క్రింది నామములు చెప్పుతూ బిల్వ దళములతో పూజించవలెను)

ఓం త్రిదళం త్రిగుణాకారం త్రిణేత్రంచ త్రియాయుధం।
త్రిజన్మపాప సంహారం ఏకబిల్వం శివార్పణమ్॥
త్రిశాఖైర్బిల్వ పత్రైశ్చ అచ్ఛిద్రైః కోమలైశ్శుభైః॥
తవపూజాంకరిష్యామి ఏకబిల్వంశివార్పణమ్॥
దర్శనం బిల్వవృక్షస్య స్పర్శనం పాపనాసనమ్।
అఘోర పాప సంహారం ఏకబిల్వం శివార్పణమ్॥
కాశీ క్షేత్ర నివాసంచకాల భైరవ దర్శనమ్।
ప్రయాగే మాధవం దృష్ట్వా ఏకబిల్వం శివార్పణమ్॥
తులసీ బిల్వనిర్గుణీ జంబీరామలకం తథా।
పంచబిల్వమితిఖ్యాతం ఏకబిల్వం శివార్పణమ్॥
తటాకం ధననిక్షేపం బ్రహ్మస్థాప్యం శివాలయం।
కోటికన్యా మహాదానం ఏకబిల్వం శివార్పణమ్॥
దన్త్యశ్యకోటిదానాని అశ్వమేధశతానిచ।
సర్వేశ్వరం సదాశాంతంఏక బిల్వం శివార్పణమ్॥
సాలగ్రామ సహస్రాణి విప్రాన్నం శతకోటికమ్।
యజ్ఞకోటి సహస్రాణి ఏకబిల్వం శివార్పణమ్॥
అజ్ఞానేనకృతం పాపం జ్ఞానేనాపికృతంచయత్।
తత్సర్వం నాశమాయాత్ ఏకబిల్వం శివార్పణమ్॥
ఏకైక బిల్వపత్రేణ కోటియజ్ఞ ఫలంలభేత్ ।
మహాదేవస్యపూజార్థం ఏకబిల్వం శివార్పణమ్॥
అమృతోద్భవ వృక్షస్యమహాదేవప్రియస్యచ।
ముచ్యంతే కంఠకాఘాతాత్ కంఠకేభ్యోహిమానవాః ॥
ఇతి బిల్వపూజాం సమర్పయామి। అథాష్టోత్తరశతనామావళి పూజా ప్రారంభః॥

## అర్చన

అష్టోత్తర శతనామములతో అర్చన చేయవలెను.

(తదనంతరం ధూప ధీప నైవేద్యములు మొదలైనవి ఇవ్వవలెను.)

## ధూపమ్

ఓం మృడానో రుద్రోతనోమయస్కృధి క్షయ ద్వీరాయ
నమసా విధేమతే। యచ్ఛంచయోశ్చమనురాయజేపితా
తదశ్యామ తవరుద్ర ప్రణీతౌ॥

ఓం శ్రీ భవానీ శంకర స్వామినే నమః। ధూపమాఘ్రాపయామి।

(అని స్వామికి అగరు బత్తి వెలిగించి చూపించవలెను)

## దీపమ్

ఓం మానో మహాన్తముత మానో అర్భకం మాన ఉక్షన్తముతమాన ఉక్షితమ్।
మానో వధీః పితరం మోత మాతరం ప్రియామానస్తనువో రుద్రరీరిషః।

ఓం శ్రీ భవానీ శంకర స్వామినే నమః। దీపం దర్శయామి।

(అని స్వామివారికి నెయ్యి వత్తి వెలిగించి చూపించవలెను)

## నైవేద్యమ్

ఓం మానస్తోకేతనయో మాన ఆయుషి మానో గోషుమానో అశ్వేషురీరిషః।
వీరాన్మానో రుద్ర భామితో వధీర్ హవిష్మన్తో నమసా విధేమతే।

ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యమ్ భర్గో దేవస్య
ధీమహి ధియోయోనః ప్రచోదయాత్॥

(ఈ పై మంత్రముచెప్పుతూ నైవేద్య పదార్థములపై నీరు చల్లవలెను)

సత్యంత్వర్తేన పరిషించామి। అమృతమస్తు అమృతోపస్తరణమసి।
ఓం ప్రాణాయ స్వాహా। ఓం అపానాయ స్వాహా। ఓం వ్యానాయ స్వాహా
ఓం ఉదానాయ స్వాహా। ఓం సమానాయస్వాహా । ఓం బ్రహ్మణ్యే స్వాహా।
ఓం శ్రీ భవానీ శంకర స్వామినే నమః। మహానైవేద్యం సమర్పయామి।
అమృతాపిధానమసి। ఉత్తరాపోశనం సమర్పయామి।
హస్తౌ ప్రక్షాళయామి పాదౌ ప్రక్షాళయామి। శుద్ధాచమనీయం సమర్పయామి।

(అని చెప్పుతూ నీరు ప్రక్కకు వదలవలెను)

## తాంబూలమ్

ఓం అరాత్తే గోఘ్న ఉతపూరుషఘ్నేక్షయద్వీరాయ
సుమ్నమస్మేతే అస్తు। రక్షాచనో అధిచదేవ బ్రూ
హ్యధాచన శర్మ యచ్ఛద్విబర్హాహా॥

ఓం శ్రీ భవానీ శంకర స్వామినేనమః। దక్షిణ సహిత తాంబూలం సమర్పయామి।
తాంబూలానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి॥

## నీరాజనమ్

ఓం స్తుహి శ్రుతం గర్త సదం యువానం మృగన్న
భీమముపహత్నుముగ్రమ్। మృడా జరిత్రే రుద్రస్తవానో
అన్యంతే అస్మన్నివపన్తు సేనాః।

ఓం సోమోవాఏతస్య రాజ్యమాదత్తే। యోరాజాసన్ రాజ్యో
వాసోమేనయజతే। దేవసువామేతానిహవీగ్ంషి
భవన్తి। ఏతావన్తోవై దేవానాగ్ం సవాః। తఏవాస్మై
సవాన్ప్రయచ్ఛంతి। తయేనం పునస్సువంతే రాజ్యాయ।
దేవసూరాజా భవతి।

ఓం శ్రీ భవానీ శంకర స్వామినే నమః। కర్పూర నీరాజనందర్శయామి।
( అని మంత్రము చెప్పుతూ స్వామి వారికి హారతివ్వవలెను)

## నంది హారతి

శ్లో॥ బాణ రావణ చణ్డేశనన్ది భృఙ్గిరిటాదయః।
మహాదేవ ప్రసాదోఽయం సర్వే గృహ్ణన్తు శాంభవాః॥

## మంత్ర పుష్పము

ఈ పుస్తకములో 20వ పేజీయందు చెప్పిన విధముగా చెప్పుకొని అంతిమంలో ఈ క్రింది శ్లోకమును కూడా చెప్పవలెను.

ఓం దేవ దేవ జగన్నాథ పార్వతీ ప్రియ శంకర
పుష్పాంజలిం ప్రదాస్యామి నమస్తే వృషభధ్వజ।

నానాసుగంధపుష్పాణి యథాకాలోద్భవానిచ
భక్త్యాదత్తాని పూజార్థం గృహాణపరమేశ్వర॥
ఓం శ్రీ భవానీ శంకరాభ్యాం నమః సువర్ణ మంత్రపుష్పాంజలిం సమర్పయామి.
(అని చేతిలో ఉన్న పుష్పాక్షతలను దేవునిపై వేయవలెను)

## ప్రదక్షిణనమస్కారం

ఓం యానికాని చ పాపానిజన్మాంతర కృతానిచ।
తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే॥
ప్రదక్షిణం కరిష్యామి సర్వభ్రమనివారణం।
సంసార సాగరాన్మాంత్వముద్ధరస్వ మహాప్రభో॥

ఓం శ్రీ భవానీ శంకరాభ్యాం నమః ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి।

ఛత్రం ఆచ్ఛాదయామి, చామరం వీజయామి, నృత్యందర్శయామి, గీతం శ్రావ్యయామి, ఆందోళికా మారోహయామి, అశ్వానారోహయామి, గజానారోహ యామి, సమస్తరాజోపచార శక్త్యుపచార, భక్త్యుపచార పూజాం సమర్పయామి.

అస్యదేవదేవస్య, మహాదేవస్య, అఖిలాణ్డకోటిబ్రహ్మాండనాయకస్య, దేవదేవోత్తమస్య, దేవతాసార్వభౌమస్య, సకలనిష్కల స్వరూపస్య, షట్త్రిగ్ం శత్త్వాతీతస్య, సర్వజ్ఞత్వ, సర్వేశ్వరత్వ, సర్వాన్తర్యామిత్వ, సర్వస్రష్టృత్వ, సర్వభోక్తృత్వ, సర్వవ్యాప! త్వ, సర్వశక్తిమత్వాది గుణగుణ విభూషితస్య, వేదాంత వేద్యస్య, పార్వతీ సనాథస్య, ఋషభవాహనా రూఢస్య, కైలాస శిఖర నివాసస్య, నన్దీభృఙ్గీచండకుండోదరపత ఞ్జలివ్య ఘ్రపాదవినాయకషణ్ముఖాద్యైః, సకలప్రమథ గణ సేవిత సేవ్య మానస్య, మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్త్వస్య, చిన్ముద్రాఙ్కితకరస్య, సనకాదిమునిజనావృతస్య, వటమూలనివాసస్య, ముముక్షు జనవరదస్య, సంసారభయనివారకస్య, లోకానుగ్రహ కారకస్య, భక్తానుగ్రహ వరదస్య, భగవతః శ్రీ భవానీ శంకరస్వామినః నిత్యపూజాభిషే కాలఙ్కరనైవేద్య దీపారాధన కర్మమధ్యే యత్కిఞ్చిత్ మన్త్రలోపే తన్త్రలోపే క్రియాలోపే శక్తిలోపే శ్రద్ధాలోపే కాలలోపే నియమలోపే నైవేద్యాది విహితలోపే చసర్వం యథాప్రోక్తం యథాశాస్త్రానుష్ఠితం భగవత్ప్రీతికరం

భూయాదితి మహాన్తో౽ను గృహ్ణన్తు। తథాస్తు॥
సర్వేజనాః సుఖినోభవన్తు। తథాస్తు॥
సమస్తసన్మఙ్గళాని సన్తు। తథాస్తు॥
రాజాధార్మికో విజయీభవతు। తథాస్తు॥
దేశో౽యం నిరుపద్రవో౽స్తు। తథాస్తు॥
సత్యాఏతా ఆశిషః సన్తు। తథాస్తు॥

మంత్ర హీనం క్రియాహీనం భక్తిహీనం జనార్దన।
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుమే ॥

అనయాధ్యానావాహనాది షోడశోపచార పూజయా భగవాన్
సర్వాత్మకః భవానీ శంకర స్వామినః సుప్రీతః సుప్రసన్నో వరదోభవతు.

(చేతిలో అక్షతలు నీరు వేసుకొని పళ్ళెములో విడువవలెను. ఇప్పుడు ప్రసాదము తీర్థము భక్తిభావముతో పుచ్చుకొనవలెను)

ఓం శ్రీభవానీ శంకర స్వామి ప్రసాదం శిరసా గృహ్ణామి।
ఏతత్ఫలం పరమేశ్వరార్పణమస్తు.

## ఉద్వాసనమ్

ఉద్వాసనమనగా ఆహ్వానించుట, పంపుట పూజ ప్రారంభములో భగవంతుని, ప్రతిమలో ఆవాహనం చేసి నాము పూజ అయిన తరువాత యథాస్థానమునకు పంపుట. ఈ దిగువ మంత్రము చెప్పుచూ శివలింగమును కదపవలెను.

మ ॥ యజ్ఞేన యజ్ఞమయజంత దేవాః తానిధర్మాణి ప్రథమాన్యాసన్।
తేహనాకం మహిమానస్సచంతే యత్ర పూర్వేసాధ్యాస్సంతి దేవాః॥
శ్రీ భవానీ శంకర స్వామినే నమః యథాస్థానం ప్రవేశయామి –
శోభనే పునరాగమనాయచ.

**రుద్ర విధానేన శివపూజాస్సమాప్తా**

# శ్రీ సూక్తవిధానేన దేవీ పూజా విధిః

ఈ పుస్తకములో 1 నుండి 8 వ పేజీ వరకు ఉన్న విధముగా చేసిన తరువాత దేవీ పూజ ప్రారంభము చేయవలెను. మంగళ శ్లోకములు, ఆచమనం, ప్రాణాయామం, సంకల్పం, కలశారాధనం, గణపతి పూజ, ప్రాణ ప్రతిష్ఠ.

## ధ్యానమ్

శ్లో॥ ధ్యాయేత్ పద్మాసనస్థాం వికసిత వదనాం పద్మ పత్రాయతాక్షీం।
హేమాభాం పీతవస్త్రాం కరకలితల సద్ధేమ పద్మాం వరాంగీమ్॥
సర్వాలంకారయుక్తాం సతతమభయదాం భక్తనమ్రాంభవానీం।
శ్రీ విద్యాంశాంతమూర్తిం సకల సురనుతాం సర్వసంపత్ప్రదాత్రీమ్॥

ఓం శ్రీ మహాదేవ్యైనమః ధ్యాయామి ధ్యానం సమర్పయామి.

(అని నిర్మల మనస్సుతో జగన్మాతను స్మరించవలెను)

## నమస్కారం

శ్లో॥ క్షీరోదార్ణవ సంభూతే కమలే కమలాలయే।
సుస్థిరోభవమే గేహే సురాసురనమస్కృతే॥

ఓం హ్రీం శ్రీం శ్రీదేవ్యైనమః నమస్కారం సమర్పయామి.

## ఆవాహనమ్

మం॥ హిరణ్య వర్ణాం హరిణీం సువర్ణ రజతస్రజాం।
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీంజాతవేదోమమావహ॥
సాంగాం – సాయుధాం – సవాహనాం – సశక్తిం – సభర్తృ –
పుత్ర పరివార సమేతాం మహాలక్ష్మీ, మహాకాళీ, మహా
సరస్వతీ దేవతామావాహయామి – స్థాపయామి – పూజయామి.

(అని దేవీ పై పుష్పములు అక్షతలు వేయవలెను)

## ఆసనం

మం॥ తాంమ్మ ఆవహజాతవేదో లక్ష్మీ మనపగామినీం।
యస్యాం హిరణ్యం విందేయంగామశ్వం పురుషానహమ్॥

శ్లో॥ సూర్యకోటి నిభస్స్ఫూర్తే స్ఫుర ద్రత్నవిభూషితే।
సింహాసన మిదం దేవీ స్వీకృతాంసురపూజితే॥

ఓం ఐం హ్రీ శ్రీం శ్రీదేవ్యైనమః రత్న సింహాసనం సమర్పయామి॥
(అని అక్షతలు పుష్పములు వేయవలెను)

## పాద్యం

మం॥ అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాద ప్రబోధినీమ్ ।
శ్రియం దేవీ ముపహ్వాయే శ్రీర్మాదేవీ జుషతామ్ ॥

శ్లో॥ శుద్ధగంగోదక మిదం సర్వవందిత మీప్సితం ।
పాపేధ్మవహ్నిరూపంచ గృహ్యతాం పరమేశ్వరి॥

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీదేవ్యైనమః పాదయోః పాద్యం సమర్పయామి.

(అని దేవీ పాదములపై కొద్ది జలము వేయవలెను)

## అర్ఘ్యం

ఓం కాం సోస్మితాం హిరణ్యప్రాకారామార్ద్రాం జ్వలంతీం తృప్తాం తర్పయంతీం।
పద్మేస్థితాం పద్మవర్ణాం తామిహోపహ్వయే శ్రియమ్।

శ్లో॥ శుద్ధోదకంచపాత్రస్థం గంధపుష్పాదిమిశ్రితం
అర్ఘ్యందాస్యామి తే దేవి గృహాణ సురపూజితే।

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ దేవ్యై నమః హస్తయోః అర్ఘ్యం సమర్పయామి।

(అని అమ్మవారి చేతుల పై జలము చల్లవలెను)

## ఆచమనీయమ్

చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం శ్రియంలోకేదేవజుష్టాముదారామ్।
తాం పద్మినీమీం శరణమహం ప్రపద్యేఽ లక్ష్మీర్మే నశ్యతాం త్వాంవృణే।

శ్లో॥ శరణాగత దీనార్థపరిత్రాణపరాయణే ।
సర్వస్యార్తి హరే దేవీ నారాయణినమోస్తుతే॥

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీదేవ్యైనమః ముఖే ఆచమనీయం సమర్పమామి।

(అని అమ్మ వారి ముఖంపై జలము చల్లవలెను)

## పంచామృత స్నానమ్

ఆదిత్యవర్ణే తపసోధిజాతో వనస్పతి స్తవ వృక్షోథ బిల్వః।
తస్యఫలాని తపసానుదంతు మాయాంతరాయశ్చ బాహ్యా అలక్ష్మీః॥

శ్లో॥ పయోదధిఘృతోపేతం శర్కరామధు సంయుతం।
పంచామృతస్నానమిదం గృహాణకమలాలయే॥

( అని పై మంత్రము చెప్పుతూ పాలు, పెరుగు, నెయ్యి, చక్కెర, తేనె, పండ్లు విడి విడిగా అమ్మ వారి విగ్రహమునకు పంచామృతస్నానం చేయవలెను) ఇచ్చట అభిషేకము చేయునప్పుడు శ్రీ సూక్తమ్, నీళాసూక్తమ్, దుర్గాసూక్తమ్, మేధాసూక్తమ్, భూసూక్తమ్ మొ॥ లైన సూక్తములు చెప్పవలెను).

## శుద్ధోదక స్నానమ్

ఓం గంగాది సర్వతీర్థేభ్యః ఆహృ తైరమలైజలైః।
స్నానంకురుష్వ శ్రీదేవీ సర్వలోక సుతోషిణీ॥

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీదేవ్యైనమః। స్నానాంతరం శుద్ధోదకస్నానం సమర్పయామి।

## వస్త్రయుగ్మమ్

మ॥ ఉపైతుమాందేవసఖః కీర్తిశ్చమణినాసహ।
ప్రాదుర్భూతోఽస్మి రాష్ట్రేఽస్మి న్కీర్తిమృద్ధిం దదాతుమే॥

శ్లో॥ సకార రూపే సర్వేశీ సర్వహంత్రి సనాతనే।
సౌవర్ణాంచల సంయుక్తం వస్త్రయుగ్మంచధారయ॥

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీదేవ్యై నమః। వస్త్రం సమర్పయామి
వస్త్రార్థే అక్షతాన్ సమర్పయామి।

## ఉపవీతమ్

మ॥ క్షుత్పిపాసామలాం జ్యేష్ఠామలక్ష్మీర్నాశయా మ్యహమ్।
అభూతి మసమృద్ధించ సర్వాన్నిర్ణుద మేగృహాత్॥

మ॥ యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్ ।
ఆయుష్యమగ్రియం ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః॥

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీదేవ్యైనమః। ఉపవీతం సమర్పయామి।
ఉపవీతార్థే అక్షతాన్ సమర్పయామి।

## గంధమ్

మ॥ గంధద్వారాం దురాధర్షాం నిత్య పుష్టాం కరీషిణీం ।
ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్।

శ్లో॥ శ్రీ గంధం చందనం దివ్యం గంధాఢ్యం సుమనోహరమ్।
విలేపనం సురశ్రేష్ఠే ప్రీత్యర్థం ప్రతి గృహ్యతామ్॥

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీదేవ్యై నమః। శ్రీ గంధం సమర్పయామి।

## కుంకుమ

శ్లో॥ సర్వమంగళ మాంగల్యే శివే సర్వార్థ సాధకే
శరణ్యేత్ర్యంబకే దేవీ నారాయణి నమోస్తుతే॥

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీదేవ్యై నమః। సర్వమంగళ స్వరూపిణి జగన్మాత్రే నమః।
కుంకుమ సమర్పయామి।

## హరిద్రామ్

శ్లో॥ హరిద్రాచమయానీతం దేవి కళ్యాణ దాయివి
సౌభాగ్య వర్ధనీంనిత్యం గృహాణ హరివల్లభే॥

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీదేవ్యై నమః। దివ్య హరిద్రాం సమర్పయామి।

(అని దేవి పాదములపై పసుపు రాయవలెను)

## ఆభరణాని

మ॥ మనసఃకామ మాకూతిం వాచ స్సత్య మశీమహి।
పశూనాగ్ం రూపమన్నస్యమయి శ్రీశ్రయతాం యశః॥

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీదేవ్యై నమః। సర్వాభరణాని సమర్పయామి।
ఆభరణార్థే అక్షతాన్ సమర్పయామి।

## పుష్పమాల

మ॥ కర్దమేన ప్రజాభూతా మయిసంభవ కర్దమ
శ్రియంవాసయమేకులే మాతరం పద్మమాలినీమ్॥

శ్లో॥ మల్లికాజాజి కుసుమైః చంపకైర్వకులైస్తథా।
శతపత్త్రైశ్చ కల్హారై సర్వపుష్పాన్ ప్రతి గృహ్యతామ్॥
ఓం ఐం హ్రీం శ్రీం సర్వదేవతా స్వరూపిణీ దేవ్యైనమః।
పుష్పమాలాం సమర్పయామి।

## పరిమళద్రవ్యమ్

శ్లో॥ సుగంధ శీతలం శుభ్రం నానాగంధ సమన్వితం।
ప్రీత్యర్థ తవదేవేశిత్వా మద్య ప్రతి గృహ్యతామ్॥
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీదేవ్యై నమః దివ్యసుగంధయుక్త పరిమళం సమర్పయామి।
(అని అమ్మవారిపైన పన్నీరుగాని అత్తరుగాని చల్లవలెను)

## అథాంగ పూజా

ఓం ఐం హ్రీం శ్రీం చంచలాయైనమః – పాదౌ పూజయామి।
ఓం ఐం హ్రీం శ్రీం చపలాయై నమః – గుల్ఫౌ పూజయామి।
ఓం ఐం హ్రీం శ్రీం కాంత్యై నమః – జంఘే పూజయామి।
ఓం ఐం హ్రీం శ్రీం కమలవాసిన్యై నమః – ఊరూం పూజయామి।
ఓం ఐం హ్రీం శ్రీం లలితాయైనమః – నాభిం పూజయామి।
ఓం ఐం హ్రీం శ్రీం క్షమాయై నమః – ఉదరం పూజయామి।
ఓం ఐం హ్రీం శ్రీం గౌర్యై నమః – హృదయం పూజయామి।
ఓం ఐం హ్రీం శ్రీం కంబు కంఠ్యై నమః – కంఠం పూజయామి।
ఓం ఐం హ్రీం శ్రీం సువాసిన్యై నమః – ముఖం పూజయామి ।
ఓం ఐం హ్రీం శ్రీం స్వర్ణకుండలాయైనమః – కర్ణద్వయం పూజయామి।
ఓం ఐం హ్రీం శ్రీం కుమార్యై నమః – శిరః పూజయామి।
ఓం ఐం హ్రీం శ్రీం యోగనిద్రాయైనమః – పాదుకే పూజయామి।

(ఈ అంగ పూజా అయిన తరువాత, దేవికి సంబంధించిన ఉదా: గౌరి, లక్ష్మి, సరస్వతి, లలితా మొ॥లైన అష్టోత్తరశత నామములతో గాని లేక సహస్రనామము లతో గాని మీవీలును బట్టి పూజ జరుపుకొనవచ్చును).

## ధూపమ్

మ॥ ఆపస్స్రు జంతుస్నిగ్ధాని చిక్లీత వసమేగృహే।
నిచ దేవీం మాతరం శ్రియం వాసయమేకులే॥

శ్లో॥ ఓం వనసత్యుర్భవైర్దివ్యై నానా గంధ సమన్వితైః।
అఘ్రేయ స్సర్వదేవానాం ధూపోయం ప్రతి గృహ్యతామ్॥

ఓం ఐం హ్రీం శ్రీ శ్రీదేవ్యై నమః। ధూపమాఘ్రాపయామి।

(అని అగరవత్తులు గాని లేక సాంబ్రాణి కాని వెలిగించి అమ్మవారికి చూపాలి)

## దీపమ్

మ॥ ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం సువర్ణాం హేమమాలినీం।
సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదోమమావహ॥

శ్లో॥ జగచ్చక్షు స్వరూపంచ ప్రాణ రక్షణ కారణం
ప్రదీపం శుద్ధరూపంచ గృహ్యతాం పరమేశ్వరీ॥

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీసర్వ మంగళ స్వరూపిణీ శ్రీదేవ్యై నమః।
దీపం దర్శయామి।

## నైవేద్యమ్

మ॥ ఆర్ద్రాం యఃకరిణీం యష్టిం పింగళాం పద్మ మాలినీం।
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీంజాత వేదో మమావహ॥

ఓం భూర్భువస్సువః తత్సవితుర్వ రేణ్యం భర్గో దేవస్య ధీమహి
ధియోయోనః ప్రచోదయాత్।

సత్యంత్వర్తేన పరిషించామి। అమృతమస్తు అమృతోపస్తరణమసి।

(అని చెప్పి జలమును నైవేద్యం పై ప్రోక్షించవలెను)

ఓం ప్రాణాయ స్వాహా ఓం అపానాయ స్వాహా ఓం వ్యానాయ స్వాహా
ఓం ఉదానాయ స్వాహా ఓం సమానాయ స్వాహా ఓం బ్రహ్మణ్యే స్వాహా
మధ్యే మధ్యే పానీయం సమర్పయామి ఉత్తరాపోశనం సమర్పయామి।
హస్తౌప్రక్షాళయామి–పాదౌప్రక్షాళయామి–శుద్ధాచమనీయం సమర్పయామి.

(అని చెప్పినప్పుడు ప్రక్కలో నీళ్ళు వదలవలెను)

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమహాదేవ్యై నమః। మహానైవేద్యం నివేదయామి।

## తాంబూలమ్

మ॥ తాంమ ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీం ।
యస్యాంహిరణ్యం ప్రభూతంగావోఽ దాస్యోశ్వాన్ విందేయం పురుషానహమ్।

శ్లో॥ తాంబూలంచ వరం రమ్యం కర్పూరాది సువాసితం ।
జిహ్వాజాడ్య చ్ఛేదకరం తాంబూలం ప్రతిగృహ్యతామ్॥

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీదేవ్యై నమః। దక్షిణ సహిత తాంబూలం సమర్పయామి।
తాంబూలానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి।

## నీరాజనమ్

(ఈ క్రింది మంత్రములు చెప్పుచూ కర్పూర హారతి ఇవ్వవలెను.)

మ॥ సామ్రాజ్యం భోజ్యం స్వారాజ్యం వైరాజ్యం పారమేష్ఠికం
రాజ్యం మహారాజ్యమాధి పత్యం ।

మ॥ నతత్ర సూర్యో భాతిన చంద్ర తారకం –
నేమా విద్యుతో భాంతికుతోయమగ్నిః ।
తమేవ భాంత మనుభాతి సర్వం ।
తస్య భాసా సర్వమిదం విభాతి ॥

శ్లో॥ ఓం మంగళం శ్రీ మహాలక్ష్మై శారదాయై సుమంగళం।
మహిషాసురమర్దిన్యై మహాగౌర్యై చమంగళం॥

శ్లో॥ సర్వమంగళ మాంగల్యే శివే సర్వార్థ సాధకే
శరణ్యే త్ర్యంబకేదేవి నారాయణి నమోస్తుతే॥

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమహాదేవ్యై నమః మంగళ కర్పూర నీరాజ సందర్శయామి
నీరాజనానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి।

## మంత్ర పుష్పమ్

(20 వ పేజిలో చెప్పిన విధముగ మంత్రపుష్పమునంతము చెప్పి ఈ క్రింది శ్రీ దుర్గా సూక్తమును కూడ చెప్పవలెను)

జాతవేదసే సునవామ సోమ మరాతీయతో నిదహాతి వేదః।
సనః పర్షదతి దుర్గాణి విశ్వానావేవసిన్ధుం దురితాఽత్యగ్నిః॥

తామగ్నివర్ణాం తపసాజ్వలన్తీం వైరోచనీం కర్మఫలేషుజుష్టామ్।
దుర్గాం దేవీగ్ం శరణమహం ప్రపద్యేసుతరసితరసేనమః॥
అగ్నేత్వంపారయానవ్యోఅస్మాన్స్వ్ స్తిభిరతి దుర్గాణి విశ్వా ।
పూశ్చపృథ్వీ బహులాన ఉర్వీ భవాతోకాయ తనయాయ శంయోః ॥
విశ్వాని దుర్గహాజాతవేద స్సిన్ధుంననావాదురితాఽతిపర్షి।
అగ్నే అత్రి వన్మనసాగృణానోఽస్మాకం బోధ్య వితాతనూనామ్॥
పృతనాజితగ్ం సహమానముగ్ర మగ్నిగ్ం హువేమ పరమాథ్సధస్తాత్।
సనఃపర్షదతి దుర్గాణి విశ్వాక్షామద్దేవో అతిదురి తాఽత్యగ్నిః॥
ప్రత్నోషిక మీడ్యోఅధ్వరేషు సనాచ్చహోతానవ్యశ్చ సత్సి।
స్వాంచాగ్నే తనువంపిప్రయస్వాస్మభ్యంచ సౌభగమాయజస్వ॥

నాకస్య పృష్టమభిసంవసానో వైష్ణవీ లోకఇహమాద యన్తామ్॥
ఓం కాత్యాయనాయ విద్మహే కన్యకుమారి ధీమహి తన్నోదుర్గిః ప్రచోదయాత్॥
ఓం మహాదేవ్యైచవిద్మహే విష్ణుపత్న్యై చధీమహి తన్నో లక్ష్మీ ప్రచోదయాత్॥
ఓం వీణాపాణ్యైచవిద్మహే బ్రహ్మపత్న్యైచధీమహి తన్నో వాణీ ప్రచోదయాత్ ।
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీదేవ్యై నమః వేదోక్తసువర్ణ మంత్రపుష్పం సమర్పయామి ॥

**(అని పుష్పములు అక్షతలు అమ్మవారి పైవేసి నమస్కరించవలెను)**

## ప్రదక్షిణము

**(ఈ దిగువ మంత్రము జపించుచూ మూడుసార్లు ప్రదక్షిణము చేయవలెను)**

శ్లో॥ యానికాని చపాపాని జన్మాంతర కృతానిచ
తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదే పదే॥

శ్లో॥ శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణే।
సర్వస్యార్తి హరే దేవి నారాయణి నమోస్తుతే॥

శ్లో॥ అన్యథా శరణం నాస్తిత్వ మేవ శరణం మమ।
తస్మాత్కారుణ్యభావేన రక్ష రక్ష మహేశ్వరీ॥

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ దేవ్యై నమః ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి॥

## సాష్టాంగ నమస్కారం

ఉరసాశిరసా దృష్ట్యా మనసా వచసాతథా।
పద్భ్యాం కరాభ్యాం కర్ణాభ్యాం ప్రణామోష్టాంగవుచ్యతే॥
ఓం శ్రీ దేవ్యై నమః నమస్కారాన్ సమర్పయామి
ఓం శ్రీ దేవ్యై నమః ఛత్రం ఆచ్ఛాదయామి, చామరం వీజయామి
నృత్యందర్శయామి, గీతం శ్రావయామి
ఆందోళికామారోహయామి – అశ్వానారోహయామి।
గజానారోహయామి. సమస్త రాజోపచార శక్త్యుపచార,
భక్త్యుపచార మంత్రోపచార సర్వోపచార పూజాం సమర్పయామి.

శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్దన।
యత్పూజితం మయాదేవి పరిపూర్ణం తదస్తుమే॥
అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయా భగవతీ
జగన్మాతాదేవతా సుప్రీతా సుప్రసన్నా వరదా భవతు.

(ఈపై వాక్యము చెప్పి అక్షతలు, పుష్పములు, నీరు కలిపి పళ్ళెములో విడువవలెను.)

( పూజాక్షతలు శిరస్సు పై ఉంచు కొనవలెను. తీర్థ ప్రసాదములు తీసుకొని అందరికి పంచవలెను).

ఓం సర్వేషాం స్వస్తిర్భవతు, ఓం సర్వేషాం శాన్తిర్భవతు
ఓం సర్వేషా పూర్ణంభవతు, ఓం లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు
ఓం శ్శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

## ఉద్వాసనము

ఓం యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాః।
తాని ధర్మాణి ప్రధమాన్యాసన్।
తేహనాకం మహిమానస్సచంతే
యత్ర పూర్వే సాధ్యాస్సంతి దేవాః॥

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీదేవ్యై నమః యథాస్థానం ప్రవేశయామి పునరాగమనాయచ

(అని ఈ మంత్రము చెప్పుచు విగ్రహములను కదపవలెను)

శ్రీ దేవీ పూజా సమాప్తః



# శ్రీ గణపత్యష్టోత్తర శతనామావళి

(ప్రతి నామమునకు ముందు ఓం అని, చివర నమః అనియు చెప్పుకోవలెను)

ఓం గజాననాయ నమః
విఘ్నరాజాయ
గణాధ్యక్షాయ
వినాయకాయ
ద్వైమాతురాయ
ద్విముఖాయ
ప్రముఖాయ
సుప్రదీపాయ
సుముఖాయ
సుఖనిధయే 10
సురాధ్యక్షాయ
సురానిఘ్నాయ
మహాగణపతయే
మాన్యాయ
మహాకాలాయ
మహాబలాయ
హేరంబాయ
లంబ జఠరాయ
హ్రస్వగ్రీవాయ
మహోదరాయ 20
మదోత్కటాయ
మంత్రిణే
మహావీరాయ
మంగళస్వరూపాయ
ప్రమదాయ
ప్రథమాయ

ఓం ప్రాజ్ఞాయ నమః
విఘ్నకర్త్రే
విఘ్నహంత్రే
విశ్వనేత్రాయ 30
విరాట్పతయే
శ్రీ పతయే
కృతినే
వాక్పతయే
శృంగారిణే
ఆశ్రిత వత్సలాయ
శివప్రియాయ
శీఘ్రకారిణే
శాశ్వతాయ
భవాయ 40
బలోత్థితాయ
భవాత్మజాయ
పురాణ పురుషాయ
పూష్ణే
ప్రభవే
పుష్కరోక్షిప్తాయ
అగ్రగణ్యాయ
అగ్రపూజ్యాయ
అగ్రగామినే
నేత్ర కృతే 50
చామీకరప్రభాయ
సర్వాయ
సర్వోపన్యాసాయ

ఓం సర్వకర్త్రే నమః
సర్వ నేత్రాయ
సర్వ సిద్ధిప్రదాయ
పంచ హస్తాయ
సర్వ సిద్ధయే
పార్వతీ నందనాయ
కుమార గురవే 60
అక్షోభ్యాయ
కుంజరాసుర భంజనాయ
ప్రమోదాయ
మోదకప్రియాయ
కాంతిమతే
ధృతిమతే
కామినే
కపిత్థఫలప్రియాయ
బ్రహ్మచారిణే
బ్రహ్మవిద్యావిభవే 70
జిష్ణవే
విష్ణు ప్రియాయ
భక్త జీవితాయ
జిత మన్మథాయ
ఐశ్వర్యకారణాయ
జ్యాయసే
యక్షకిన్నర
సేవితాయ
గంగా సుతాయ
గణాధీశాయ
గంభీర నినధాయ 80

ఓం వటవే నమః
అభీష్ట వరదాయ
జ్యోతిషే
భక్తనిధయే
భావగమ్యాయ
మంగళప్రదాయ
అవ్యక్తాయ
అప్రాకృత పరాక్రమాయ
సత్య ధర్మిణే
సఖ్యే 90
సంసారాంబునిధయే
మహేశాయ
దివ్యాంగాయ
మణికింకణీ మేఖలాయ
సమస్త దేవతామూర్తయే
సహిష్ణవే
సతతోత్థితాయ
విఘ్నాంతకారిణే
విశ్వదృశే
విశ్వరక్షా విధానకృతే 100
కళ్యాణ గురవే
ఉన్మత్త వేషాయ
పరాజితే
సమస్త జగధారాయ
సర్వైశ్వర్య ప్రదాయ
ఏకదంతాయ
శ్రీ విఘ్నేశ్వరాయ
శ్రీ హరిద్రా గణపతయే 108

**ఓం ఇతి శ్రీ విఘ్నేశ్వరాష్టోత్తర శతనామావళి స్సమాప్తా**



# శ్రీ శివాష్టోత్తర శతనామావళి

(ప్రతి నామమునకు ముందు ఓం అని, చివర నమః అనియు చెప్పవలెను)

శాన్తం పద్మాసనస్థం శశిధర మకుటం పఞ్చ వక్త్రం త్రినేత్రం  
శూలం వజ్రం చ ఖడ్గం పరశుమభయదం దక్షిణాఙ్గే వహన్తమ్ ।  
నాగం పాశం చ ఘణ్టాం వరడమరుయుతం చామ్బికాం వామభాగే  
నానా లఙ్కారయుక్తం స్పటిక మణినిభం పార్వతీశం నమామి ॥

ఓం శివాయ నమః  
మహేశ్వరాయ  
శంభవే  
పినాకినే  
శశిశేఖరాయ  
వామదేవాయ  
విరూపాక్షాయ  
కపర్దినే  
నీలలోహితాయ  
శంకరాయ 10  
శూలపాణినే  
ఖట్వాంగిణే  
విష్ణువల్లభాయ  
శిపివిష్టాయ  
అంబికానాథాయ  
శ్రీకంఠాయ  
భక్తవత్సలాయ  
భవాయ  
శర్వాయ  
త్రిలోకేశాయ 20  
శితికంఠాయ  
శివాప్రియాయ  
ఉగ్రాయ  
కపాలినే  
కామారయే  
అంధకాసురసూదనాయ  
ఓం గంగాధరాయ నమః  
లలాటాక్షాయ  
కాలకాలాయ  
కృపానిధయే 30  
భీమాయ  
పరశుహస్తాయ  
మృగపాణయే  
జటాధరాయ  
కైలాసవాసినే  
కవచినే  
కఠోరాయ  
త్రిపురాంతకాయ  
వృషాంకాయ  
వృషభారూఢాయ 40  
భస్మోద్ధూళిత విగ్రహాయ  
సామప్రియాయ  
సర్వమయాయ  
త్రయీమూర్తయే  
అనీశ్వరాయ  
సర్వజ్ఞాయ  
పరమాత్మనే  
సోమసూర్యాగ్నిలోచనాయ

ఓం హవిషే నమః
యజ్ఞమయాయ 50
సోమాయ
పంచవక్త్రాయ
సదాశివాయ
విశ్వేశ్వరాయ
వీరభద్రాయ
గణనాథాయ
ప్రజాపతయే
హిరణ్యరేతసే
దుర్ధర్షాయ
గిరీశాయ 60
గిరిశాయ
అనఘాయ
భుజంగభూషణాయ
భర్గాయ
గిరిధన్వినే
గిరిప్రియాయ
కృత్తివాససే
పురారాతయే
భగవతే
ప్రమథాధి పాయ 70
మత్యుంజయాయ
సూక్ష్మతనవే
జగద్వ్యాపినే
జగద్గురవే
వ్యోమకేశాయ
మహాసేన జనకాయ
చారువిక్రమాయ

ఓం రుద్రాయ నమః
భూతపతయే
స్థాణవే 80
అహిర్బుధ్న్యాయ
దిగంబరాయ
అనేకాత్మనే
అష్టమూర్తయే
సాత్వికాయ
శుద్ధ విగ్రహాయ
శాశ్వతాయ
ఖండపరశవే
అజాయ
పాశవిమోచకాయ 90
మృడాయ
పశుపతయే
దేవాయ
మహా దేవాయ
అవ్యయాయ
హరయే
పూషదంతభిదే
అవ్యగ్రాయ
దక్షాధ్వరహరాయ
హరాయ 100
భగనేత్రభిదే
అవ్యక్తాయ
సహస్రాక్షాయ
సహస్రపదే
అపవర్గప్రదాయ
అనంతాయ
పరమేశ్వరాయః 108

ఓం తత్సత్ ఇతి శ్రీ శివాష్టోత్తర శతనామావళి స్సమాప్తా



# శ్రీ సుబ్రహ్మణ్యస్వామ్యష్టోత్తర శతనామావళి

(ప్రతి నామమునకు ముందు ఓం అని, చివర నమః అనియు చెప్పుకోవలెను)

శ్లో ॥ ఓం షడాననం కుంకుమరక్త వర్ణం
మహామతిం దివ్య మయూరవాహనం
రుద్రస్య సూనుం సురసైన్యనాథం
గుహం సదాఽహం శరణం ప్రపద్యే ॥

ఓం శ్రీ సుబ్రహ్మణ్య స్వామినే నమః
స్కందాయ
గుహాయ
షణ్ముఖాయ
ఫాలనేత్ర సుతాయ
ప్రభవే
పింగళాయ
కృత్తికాసూనవే
శిఖివాహనాయ
ద్విషడ్భుజాయ 10
ద్విషణ్ణేత్రాయ
శక్తిధరాయ
పిశితాశ ప్రభంజనాయ
తారకాసుర సంహారిణే
రక్షోబలవిమర్దనాయ
మత్తాయ
ప్రమత్తాయ

సురసైన్య సురక్షకాయ
దేవసేనాపతయే 20
ప్రాజ్ఞాయ
కృపాళవే
భక్తవత్సలాయ
ఉమాసుతాయ

ఓం శక్తిధరాయ నమః
కుమారాయ
క్రౌంచదారణాయ
సేనాన్యే
అగ్ని జన్మనే
విశాఖాయ 30
శంకరాత్మజాయ
శివస్వామినే
గణస్వామినే
సర్వ స్వామినే
సనాతనాయ
అనంత శక్తయే
అక్షోభ్యాయ
పార్వతీప్రియనందనాయ
గంగాసుతాయ
శరోద్భూతాయ 40
ఆహూతాయ
పావకాత్మజాయ
జృంభాయ
ప్రజృంభాయ
ఉజ్జృంభాయ
కమలాసన సంస్తుతాయ
ఏకవర్ణాయ
ద్వివర్ణాయ

ఓం త్రివర్ణాయ నమః
సుమనోహరాయ 50
చతుర్వర్ణాయ
పంచవర్ణాయ
ప్రజాపతయే
అహర్పతయే
అగ్నిగర్భాయ
శమీ గర్భాయ
విశ్వరేతసే
సురారిఘ్నే
హరిద్వర్ణాయ
శుభకరాయ 60
వటవే
వటువేషభృతే
పూష్ణే
గభస్తయే
గహనాయ
చంద్రవర్ణాయ
కళాధరాయ
మాయాధరాయ
మహామాయినే
కైవల్యాయ 70
శంకరాత్మజాయ
విశ్వయోనయే
అమేయాత్మనే
తేజోనిధయే
అనామయాయ
పరమేష్ఠినే
పరబ్రహ్మణే
వేదగర్భాయ

ఓం విరాట్సుతాయ నమః
పుళిందకన్యాభర్త్రే 80
మహా సారస్వతా వృతాయ
ఆశ్రితాఖిలదాత్రే
చోరఘ్నాయ
రోగనాశనాయ
అనంత మూర్తయే
ఆనందాయ
శిఖండికృత కేతనాయ
డంభాయ
పరమ డంభాయ
మహాడంభాయ 90
వృషాకపయే
కారణోపాత్త దేహాయ
కారణాతీత విగ్రహాయ
అనీశ్వరాయ
అమృతాయ
ప్రాణాయామ పరాయణాయ
విరుద్ధ హంత్రే
వీరఘ్నాయ
రక్త శ్యామాంగాయ
సుబ్రహ్మణ్యాయ 100
గుహాయ
ప్రీతాయ
బ్రహ్మణ్యాయ
బ్రాహ్మణప్రియాయ
వంశ వృద్ధి కరాయ
వేద వేద్యాయ
అక్షయఫల ప్రదాయ
శాశ్వతాయ 108

ఓం తత్సత్ ఇతి శ్రీ సుబ్రహ్మణ్యష్టోత్తర శత నామావళి స్సమాప్తా



# శ్రీ రామాష్టోత్తర శతనామావళి

(ప్రతి నామమునకు ముందు ఓం అని, చివర నమః అనియు చెప్పుకోవలెను)

శ్లో ॥ ఓం రామాయ రామభద్రాయ
రామచంద్రాయ వేదసే
రఘునాథాయ నాథాయ
సీతాయాః పతయే నమః ॥

ఓం శ్రీరామాయ నమః
రామ భద్రాయ
రామచంద్రాయ
శాశ్వతాయ
రాజీవలోచనాయ
శ్రీమతే
రాజేంద్రాయ
రఘుపుంగవాయ
జానకీ వల్లభాయ
జైత్రాయ 10
జితామిత్రాయ
జనార్దనాయ
విశ్వామిత్ర ప్రియాయ
దాంతాయ
శరణత్రాణ తత్పరాయ
వాలి ప్రమథనాయ
వాగ్మినే
సత్యవాచే
సత్య విక్రమాయ
సత్య వ్రతాయ 20
వ్రతధరాయ
సదాహనుమదాశ్రితాయ
కౌశలేయాయ
ఖరధ్వంసినే

ఓం విరాధవధఖండితాయ నమః
విభీషణ పరిత్రాత్రే
హర కోదండ ఖండనాయ
సప్తతాళ ప్రభాత్రే
దశగ్రీవశిరోహరాయ
జామదగ్న్యమహాదర్పదళనాయ 30
తాటకాంతకాయ
వేదాంతసారాయ
వేదాత్మనే
భవరోగస్య భేషజాయ
ధూషణత్రిశిరోహంత్రే
త్రిమూర్తయే
త్రిగుణాత్మకాయ
త్రివిక్రమాయ
త్రిలోకాత్మనే
పుణ్యచారిత్రకీర్తనాయ 40
త్రిలోకరక్షకాయ
ధన్వినే
దండకారణ్య వర్తనాయ
అహల్యాశాపశమనాయ
పితృభక్తాయ
వరప్రదాయ
జితక్రోధాయ
జితామిత్రాయ

ఓం జగద్గురవే నమః
ఋక్షవానరసంఘాతినే 50
చిత్రకూట సమాశ్రయాయ
జయంత త్రాణ వరదాయ
సుమిత్రాపుత్ర సేవితాయ
సర్వ దేవాది దేవాయ
మృత వానర జీవనాయ
మాయా మారీచ హంత్రే
మహాదేవాయ
మహాభుజాయ
సర్వ దేవస్తుతాయ
సౌమ్యాయ 60
బ్రహ్మణ్యాయ
మునిసంస్తుతాయ
మహాయోగినే
మహోదరాయ
సుగ్రీవేప్సితరాజ్యదాయ
సర్వపుణ్యాధికఫలాయ
స్మృతస్సర్వాఘనాశనాయ
ఆదిపురుషాయ
పరమ పురుషాయ
మహా పురుషాయ 70
పుణ్యోదయాయ
దయాసారాయ
పురాణాయ
పురుషోత్తమాయ
స్మితవక్త్రాయ
మితభాషిణే
పూర్వ భాషిణే
రాఘవాయ

ఓం అనంత గుణగంభీరాయ నమః
ధీరోదాత్త గుణోత్త మాయ 80
మాయా మానుష చారిత్రాయ
మహాదేవాది పూజితాయ
సేతుకృతే
జిత వారాశయే
సర్వతీర్థ మయాయ
హరయే
శ్యామాంగాయ
సుందరాయ
శూరాయ
పీతవాససే 90
ధనుర్ధరాయ
సర్వయజ్ఞాధిపాయ
యజ్వనే
జరామరణ వర్జితాయ
శివలింగ ప్రతిష్ఠాత్రే
సర్వావగుణ వర్జితాయ
పరమాత్మనే
పరస్మై బ్రహ్మణే
సచ్చిదానంద విగ్రహాయ
పరస్మై జ్యోతిషే 100
పరస్మైధామ్నే
పరాకాశాయ
పరాత్పరాయ
పరేశాయ
పారగాయ
పారాయ
సర్వ దేవాత్మకాయ
పరస్మైనమః 108

ఓం ఇతి శ్రీ రామాష్టోత్తర శతనామావలి స్సమాప్తా



# శ్రీ గుర్వష్టోత్తర శతనామావళి

(ప్రతి నామమునకు ముందు ఓం అని చివర నమః అనియు చెప్పుకోవలెను)

శ్లో ॥ ఓం బ్రహ్మానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిం ।
ద్వంద్వాతీతం గగన సదృశం తత్త్వ మస్యాదిలక్ష్యం ।
ఏకం నిత్యం విమలమచలం సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుంతం నమామి ॥

ఓం శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః
ఆనందవపుషే నమః
ఆచార్యాయ
ఆదిమధ్యాంత రహితాయ
దయానిధయే
సత్యజ్ఞానానంద రూపాయ
సదాచారాయ
యోగయోనయే
ప్రజ్ఞానఘనాయ
పంచకోశవిలక్షణాయ 10
కోటికందర్ప సుందరాయ
కృపావీక్షణాయ
అతనవే
ఆనందాయ
అజయాయ
ఇచ్ఛానిచ్ఛ ప్రహితాయ
అభోక్త్రే
అద్వంద్వాయ
అచింత్యాయ
గుణత్రయ వివర్జితాయ 20
గుహాశయాయ
జ్ఞాతృజ్ఞాన జ్ఞేయసాక్షిణే
నిరంజనాయ
నిత్య బుద్ధాయ

ఓం అగ్రగణ్యాయ నమః
అక్షరాయ
ఉదాసీనాయ
ఉపదేష్ట్రే
అమలాయ
జ్ఞానదేశికాయ 30
తత్త్వ మస్యాది వాక్యార్థ లక్ష్యాయ
నిష్కళాయ
తారకాయ
తత్త్వ బోధకాయ
నిత్య శుద్ధాయ
నిత్యముక్తాయ
జ్ఞానలింగాయ
స్వయం ప్రకాశాయ
జన్మ జరామృత్యు నివారకాయ
నిర్లేపాయ 40
అద్భుత చారిత్రాయ
అద్వేష్ట్రే
ఊర్ధ్వ రేతసే
సద సద్రహితాత్మనే
సాధుగమ్యాయ
సర్వాత్మనే
శాంతాయ
అనంతశక్తయే

ఓం నిష్ప్రపంచాయ నమః
ఈశ్వరాణా మధీశాయ 50
వేదాంతవేద్యాయ
సద్గురవే
షడూర్మివర్జితాయ
షడ్భావరహితాయ
అమృతాయ
అంతర్యామినే
అపరిచ్ఛేద్యాయ
క్షమిణే
కూటస్థాయ
కళాతీతాయ 60
అవస్థాత్రయ సాక్షిణే
అప్రమేయాయ
అద్వయాయ
అవ్యక్తాయ
కూటాయ
గంధిత్రయ విమోక్షణాయ
చిన్మాత్రాయ
జ్ఞానగమ్యాయ
బ్రహ్మానందాయ
భవాబ్ధితారణాయ 70
పరాత్పరాయ
తత్పరాయ
దుష్టదూరాయ
దురాచారనాశకాయ
భాస్వరాయ
విధివిష్ణు శివాకృతయే
అజహల్లక్షణ విలక్షణాయ
అజరాయ

ఓం అపారసంసార విఘట్టనాయ నమః
అమన్యవే 80
అమోఘవైభవాయ
అభయంకరాయ
వరదాయ
ముక్తిరూపాయ
శాశ్వతాయ
అఖండ మహిమాంభోదాయ
అఖండబోధాయ
మనోవాచామ గోచరాయ
పరిపూర్ణాత్మనే
బాహ్యాంతర స్థితాయ 90
భక్తిశ్రద్ధాధ్యాన గమ్యాయ
నిరహంకృతయే
నిర్వికారాయ
నిర్వైరాయ
లక్ష్యాలక్ష్య వర్జితాయ
నిర్వికల్పాయ
అవ్యయాయ
అనంత రూపాయ
అనుత్తమాయ
దక్షిణాభిముఖాయ 100
అద్భుతాయ
అలింగాయ
నిస్సంగాయ
నిర్వాణ సుఖదాయ
నిత్యాయ
ధర్మావతారాయ
నిగమాతీతాయ 108

ఓం ఇతి శ్రీ గుర్వష్టోత్తర శతనామావళి స్సమాప్తా



# శ్రీ దక్షిణామూర్త్యష్టోత్తర శతనామావళి

(ప్రతి నామమునకు ముందు ఓం అని చివర నమః అనియు చెప్పుకోవలెను)

శ్లో ॥ ఓం గురవే సర్వ లోకానాం భిషజే భవరోగిణాం ।
నిధయే సర్వ విద్యానాం దక్షిణామూర్తయే నమః ॥

ఓం శ్రీ దక్షిణామూర్తయే నమః
విద్యారూపాయ
మహాయోగినే
శుద్ధ జ్ఞానినే
పినాకధృతాయ
రత్నమాలాధరాయ
జటాధరాయ
గంగాధరాయ
అచలాయ
మహా జ్ఞానినే 10
సమాధికృతే
అప్రమేయాయ
యోగనిధయే
తారకాయ
భక్తవత్సలాయ
బ్రహ్మరూపాయ
జగద్రూపాయ
విష్ణుమూర్తయే
పురాంతకాయ
వృషభవాహాయ 20
వాససే
పీతాంబర విభూషణాయ
మోక్షదాయినే
మోక్ష నిధయే
దానహరయే
జగత్పతయే

ఓం విద్యాధరాయ నమః
శుక్తతనయే
విద్యాదాయినే
గణాధిపాయ 30
పాదపాయ

శశిమౌళినే
మహాస్వనాయ
సామ ప్రియాయ
అవ్యయాయ
సాధవే
సర్వ దేవైర లంకృతాయ
హస్తే వహ్నిధరాయ
శ్రీమతే 40
పురారయే
శివ శంకరాయ
యజ్ఞ నాథాయ
క్రతుధ్వంసినే
యజ్ఞ భోక్త్రే
యమాంతకాయ
భక్తానుగ్రహమూర్తయే
భక్తసేవ్యాయ
వృషధ్వజాయ
భస్మోద్ధూలిత విగ్రహాయ 50
అక్షమాలాధరాయ
హరయే

ఓం త్రిమూర్తయే నమః
పరబ్రహ్మణే
నాగరాజైరలంకృతాయ
శాంతరూపాయ
మహాయోగినే
సర్వలోక విభూషణాయ
అర్ధనారీశ్వరాయ
దేవాయ 60
మునిసేవ్యాయ
సురోత్తమాయ
వ్యాఖ్యాన దేవాయ
భగవతే
అగ్ని చంద్రార్కలోచనాయ
జగత్కర్త్రే
జగద్గోప్త్రే
త్రిలోచనాయ
జగద్గురవే
మహా దేవాయ 70
మహానంద పరాయ
మహావీరాయ
జ్ఞానముద్రోపదేశకాయ
వ్యోమగంగాజల స్నాతాయ
సిద్ధగంగ సమర్చితాయ
తత్త్వమూర్తయే
మహాబుద్ధాయ
మహాసారస్వతప్రదాయ
ఓం పరమూర్తయే నమః
చిత్స్వ రూపాయ 80
తేజోమయాయ
అనామయాయ

ఓం వేదవేద్యాయ నమః
తత్త్వజ్ఞానినే
చతుష్షష్టికళాన్వితాయ
భవరోగవినాశకాయ
నీలగ్రీవాయ
లలాటాక్షాయ
గజచర్మధరాయ
అరోగాయ 90
కామదాయినే
తపస్వినే
విష్ణువల్లభాయ
బ్రహ్మచారిణే
సన్న్యాసరూపిణే
గృహస్థాశ్రమకారణాయ
శాంతాయ
శియకతాంశ్రేష్ఠాయ
సత్వరూపాయ
దయానిధయే 100
యోగపట్టాభి రామాయ
వీణామండల శోభితాయ
మతిప్రజ్ఞాసుధా కుంభమాలా-
పుస్తక ధారిణే
బేతాళాది పిశాచౌఘ రాక్షసాది-
వినాశ కాయ
శ్రీ మేధాదక్షిణామూర్తయే
భక్తాను గ్రహతత్పరాయ
బ్రహ్మజ్ఞానప్రదా నోత్సుకాయ
వైరాగ్య ప్రదాయినే
అఖిలచరాచరాత్మస్త జ్ఞాన-
జ్యోతిషే 108

ఓంతత్సత్ ఇతిశ్రీ దక్షిణామూర్తిఅష్టోత్తర శతనామావలి స్సమాప్తా



# శ్రీ శంకరాచార్యాష్టోత్తర శతనామావళి

(ప్రతి నామమునకు ముందు ఓం అని చివర నమః అనియు చెప్పుకోవలెను)

ఓం హరలీలావతారాయ శంకరాయ పరౌజసే
కైవల్య కలనాకల్పతరవే గురవే నమః।

ఓం శ్రీ శంకరాచార్యవర్యాయ నమః
బ్రహ్మానంద ప్రదాయకాయ
అజ్ఞానతిమిరాదిత్యాయ
సుజ్ఞానాంబుధి చంద్రమసే
వర్ణాశ్రమ ప్రతిష్ఠాత్రే
శ్రీమతే
ముక్తి ప్రదాయకాయ
శిష్యోపదేశ నిరతాయ
భక్తాభీష్ట ప్రదాయకాయ
సూక్ష్మతత్త్వరహస్యజ్ఞాయ 10
కార్యాకార్యప్రభోధకాయ
జ్ఞానముద్రాంచితకరాయ
శిష్యహృత్తాపహారకాయ
పారివ్రాజ్యాశ్రమోద్ధర్త్రే
సర్వతంత్రస్వతంత్రధియే
అద్వైతస్థాపనాచార్యాయ
సాక్షాచ్ఛంకరూపభృతే
షణ్మత స్థాపనాచార్యాయ
త్రయీమార్గ ప్రకాశకాయ
వేదవేదాంత తత్త్వజ్ఞాయ 20
దుర్వాది మతఖండనాయ
వైరాగ్యనిరతాయ
శాంతాయ
సంసారార్ణవతారకాయ
ప్రసన్నవదనాంభోజాయ
పరమార్థప్రకాశకాయ
పురాణ శృతిసారజ్ఞాయ

ఓం నిత్యతృప్తాయ నమః
మహతే
మునయే 30
నిత్యనందాయ
నిరాంతకాయ
నిస్సంగాయ
నిర్మలాత్మకాయ
నిర్మమాయ
నిరహంకారాయ
విశ్వవంద్యపదాంబుజాయ
సత్త్వప్రధానాయ
సంఖ్యాతీతగుణోజ్వలాయ
అనఘాయ 40
సారహృదయాయ
సుధియే
సారస్వతప్రదాయ
సత్యాత్మనే
పుణ్యశీలాయ
సాంఖ్యయోగవిచక్షణాయ
తపోరాశయే
మహాతేజసే
గుణత్రయ విభాగవిదే
కలిఘ్నాయ 50
కాలకర్మజ్ఞాయ
తమోగుణ నివారకాయ
భగవతే
భారతీ జేత్రే

ఓం శారదాహ్వాన పండితాయ నమః
ధర్మాధర్మవిభాగజ్ఞాయ
లక్ష్యభేద ప్రదర్శకాయ
నాదబిందుకలాభిజ్ఞాయ
యోగిహృత్పద్మభాస్కరాయ
అతీంద్రియ జ్ఞాననిధయే 60
నిత్యానిత్యవివేకవతే
చిదానందాయ
చిన్మయాత్మనే
పరకాయ ప్రవేశకృతే
అమానుష చరిత్రాయ
క్షేమదాయినే
క్షమాకరాయ
భవ్యాయ
భద్రకరాయ
భూరిమహిమ్నే 70
స్వప్రకాశాయ
విశ్వరంజకాయ
సుబోధాయ
విశాలకీర్తయే
వాగీశాయ
సర్వలోకహితోత్సుకాయ
కైలాసయాత్రా సంప్రాప్త –
చంద్రమౌళి ప్రపూజకాయ
కాంచ్యాంశ్రీచక్రరాజాఖ్య–
యంత్రస్థాపన దీక్షితాయ
శ్రీచక్రాత్మక తాటంకతోషి–
తాంబమనో రథాయ
శ్రీ బ్రహ్మసూత్రోపనిషద్భాష్యాది–
గ్రంథకల్పకాయ 80
చతుర్దిక్చతురామ్నాయప్రతిష్ఠాత్రే

ఓం మహామతే నమః
ద్విసప్తతిమతోచ్ఛేత్రే
సర్వదిగ్విజయ ప్రభవే
కాషాయవసనోపేతాయ
భస్మోద్ధూళిత విగ్రహాయ
జ్ఞానాత్మకైకదండాఢ్యాయ
కమండలులసత్కరాయ
గురుభూమండలాచార్యాయ
భగవత్పాద సంజ్ఞకాయ 90
వ్యాససందర్శనప్రీతాయ
ఋష్యశృంగపురేశ్వరాయ
సౌందర్యలహరీ ముఖ్యబహు–
స్తోత్ర విధాయకాయ
చతుష్షష్టికళాభిజ్ఞాయ
బ్రహ్మరాక్షసతోషకాయ
శ్రీ మన్మండన మిశ్రాఖ్య
స్వయంభూజయసన్నుతాయ
తోటకాచార్యసంపూజ్యాయ
పద్మపాదార్చితాంఘ్రికాయ
హస్తామలక యోగీంద్ర బ్రహ్మ–
జ్ఞాన ప్రదాయకాయ
సురేశ్వరాఖ్యసచ్ఛిష్య సన్న్యా–
సాశ్రమదాయకాయ 100
వ్యాఖ్యాసింహాసనాధీశాయ
జగత్పూజ్యాయ
నృసింహభక్తాయ
సద్రత్నగర్భ హేరంబ పూజకాయ
అఖండ ప్రజ్ఞాయ.
మాతృప్రియాయ
ఈశ్వర రూపాయ
జగద్గురవే 108

**ఓం తత్సత్ ఇతి శ్రీ శంకరాచార్యాష్టోత్తర శతనామావళి స్సమాప్తా**

# శ్రీ మలయాళ సద్గురు అష్టోత్తర శతనామావళి

(ప్రతి నామమునకు ముందు 'ఓం' అని చివర 'నమః' అనియు చెప్పుకొనవలయును)

## ధ్యానమ్

ఓం బ్రహ్మానన్దం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వన్ద్వాతీతం గగనసదృసం తత్త్వమస్యాదిలక్ష్యమ్।
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి॥

ఓం శ్రీ సద్గురవే నమః
దివ్యరూపాయ
నిస్పృజ్ఞాయ
విజితేన్ద్రియాయ
శివలిజ్గ (గురు) కృపాపాత్రాయ
అసజ్గానన్దనామకాయ
కేరళావని సఞ్జాతాయ
నిర్మోహాయ
భవనాశకాయ
నిర్మమాయ
నిరహజ్కారాయ
మితాహారిణే
సంయమినే
నిత్యానిత్యపరిజ్ఞాత్రే
అమనస్కాయ
సదాశ్రితాయ
అధ్యాత్మతత్త్వనిపుణాయ
బ్రహ్మవాదినే
దృఢవ్రతాయ
కృతభూపాద సంచారిణే 20
నిత్యతుష్టాయ
నిరామయాయ

ఓం శేషాచల చిరావాసాయ నమః
ధ్యానారూఢాయ
శుచివ్రతాయ
గోగర్భతీర్థసంసేవినే

బ్రహ్మనిష్ఠాపరాయ
మౌనినే
సమాధిష్ఠాయ 30
దయాపరాయ
ద్వాదశాబ్దతపస్తప్తాయ
ద్వన్ద్వాతీతాయ
విమత్సరాయ
శ్రీవేంకటకృపాపాత్రాయ
అణిమాద్యనపేక్ష కాయ
ఆన్ధ్రమాతృతపః ప్రాప్తాయ
బ్రహ్మచారిణే
నైష్ఠికాయ
ధ్యానయోగపరాయ 40
ధీమతే
ఆన్ధ్రాన్ధస్సంవిదారకాయ
వ్యాసాశ్రమప్రతిష్ఠాత్రే
సర్వేష్టార్థ ప్రదాయకాయ

ఓం భుక్తిముక్తిప్రదాత్రే నమః
తపోవిగత కల్మషాయ
ఆత్మవిదే
ద్వేషరహితాయ
సత్యవాచే
అపరిగ్రహాయ 50
భూతభావిపరిజ్ఞాత్రే
దృఢాచార విశుద్ధధియే
స్త్రీశూద్రాదితారకాయ
ధీరాయ
సమదృష్టయే
భవోడుపాయ
జాతిద్వేషవినిర్ముక్తాయ
గుణకర్మానుమోదకాయ
అధ్యాత్మబోధచతురాయ
సత్యజ్ఞానమయాయ 60
శివాయ
చరాచరసుఖాకాఙ్క్షిణే
విమలాయ
కరుణాకరాయ
అనన్తగుణగంభీరాయ
స్వార్థత్యాగినే
ప్రజాప్రియాయ
తపస్త్రితయసంసేవినే
నిరాడమ్బరజీవనాయ
కర్మయోగినే 70
క్రియామోదినే
ద్యానావస్థిత మానసాయ
బహ్వాశ్రమ ప్రతిష్ఠాత్రే
నిర్గ్రన్థయే
సత్త్వసంస్థితాయ
జగద్గురవే

ఓం జగద్వన్ద్యాయ నమః
బహుశిష్యసమన్వితాయ
ధర్మప్రియాయ
ధర్మాత్మనే
క్షమావతే
నిర్గుణాయ
పరాయ
అనేక గ్రన్థనిర్మాత్రే
శాస్త్రజ్ఞాయ
శాస్త్రసమ్మతాయ
శుష్కవాదతమోభానవే
నిజబోధసుధాకరాయ
ధర్మసేతవే
గుణాతీతాయ 90
లోకోద్ధరణతత్పరాయ
సాంఖ్యయోగినే
సన్న్యాసినే
సాధువాచే
సాధుదర్శనాయ
వక్త్రే
శ్రోతృజనాకర్షిణే
సదృష్టాన్తప్రబోధకాయ
జ్ఞానసూర్యాయ
స్వయంజ్యోతిషే 100
తేజస్వినే
నియతాత్మవతే
జగద్ధితవిధాత్రే
శ్రీకృష్ణచరణార్చితాయ
సద్గురవే
మద్గురవే
వన్ద్యాయ
సర్వాభీష్టఫలప్రదాయ

ఇతి శ్రీమలయాళ సద్గురు అష్టోత్తర శతనామావళిస్సమాప్తా!



# శ్రీ వేదవ్యాసాష్టోత్తర శతనామావళి

(ప్రతి నామమునకు ముందు ఓం అని చివర నమః అనియు చెప్పుకోవలెను)

శ్లో॥ ఓం కృష్ణద్వైపాయనం వ్యాసం సర్వలోహితే రతం।
వేదాబ్జభాస్కరం వందే శమాది నిలయం మునిమ్॥

ఓం వ్యాసాయనమః
ద్వైపాయనాయ
శ్రేష్ఠాయ
సత్యాత్మనే
బాదరాయణాయ
మునయే
సత్యవతీ పుత్రాయ
శుకతాతాయ
తపోనిధయే
వసిష్ఠనప్త్రే 10
సర్వజ్ఞాయ
విష్ణురూపాయ
దయానిధయే
పరాశరాత్మజాయ
శాంతాయ
శక్తిపౌత్రాయ
గుణాంబుధయే
కృష్ణాయ
వేదవిభక్త్రే
బ్రహ్మసూత్రకృతే 20
అవ్యయాయ
మహాయోగీశ్వరాయ
సౌమ్యాయ
ధన్యాయ
పింగజటాధరాయ
చీరాజనధరాయ

ఓం శ్రీమతే నమః
అష్టాదశపురాణకృతే
దండినే
కమండలధరాయ 30
కురువంశప్రవర్ధకాయ
నిర్మమాయ
నిరహంకారాయ
నిష్కళంకాయ
నిరంజనాయ
జితేంద్రియాయ
జితక్రోధాయ
స్మృతికర్త్రే
మహాకవయే
తత్త్వజ్ఞానినే 40
తత్త్వబోధకర్త్రే
కాశీనివాసభువే
మహాభారతకర్త్రే
చిరంజీవినే
మహామతయే
సజ్జనానుగ్రహపరాయ
సత్యవాదినే
దృఢవ్రతాయ
బదర్యాశ్రమసంచారిణే
కోటిసూర్య సమప్రభాయ 50
త్రిపుండ్రవిలసత్ఫాలాయ
అష్టావింశతిరూపభృతే

ఓం రవీందుమితశిష్యాఢ్యాయ నమః
సుశీలాయ
యతిపూజితాయ
వైయ్యాఘ్రచర్మవసనాయ
చిన్ముద్రావిలసత్కరాయ
రుద్రాక్షమాలాభూషాఢ్యాయ
కలిపాపనివారకాయ
ధర్మాశ్వమేధసందేష్ట్రే 60
సంజయ జ్ఞానదృష్టిదాయ
ధృతరాష్ట్రపుత్ర దర్శినే
విదురాదిప్రపూజితాయ
పుత్రమోహవ్యాకులాత్మనే
జనకజ్ఞానదాయకాయ
కర్మతాయ

దర్భాసీనాయ
వరప్రదాయ
యమునాద్వీపజననాయ 70
మోక్షోపాయ ప్రదర్శకాయ
ఋషిపూజ్యాయ
బ్రహ్మనిధయే
శిఖావతే
జటిలాయ
పరాయ
అష్టాంగ యోగనిరతాయ
గాంధారీ గర్భసంరక్షాయ
పాండవ ప్రీతిసంయుతాయ
వసుభూపాలదౌహిత్రాయ 80
వ్యాసకాశీసదావాసాయ
నరనారాయణార్చకాయ
నిత్యోపవాససంతుష్టాయ
పరహింసాపరాఙ్మఖాయ
శివపూజైక నిరతాయ
సురాసురసుపూజితాయ
సర్వక్షేత్ర నివాసినే
సర్వతీర్థావగాహనాయ
యుధిష్ఠిరాభిషేక్త్రే 90
స్మృతి మాత్రాప్త సన్నిధియే
త్రికాలజ్ఞాయ
విశుద్ధాత్మనే
నిర్వికారాయ
నిరామయాయ
ఊర్ధ్వరేతసే
మాతృభక్తాయ
నిశ్చింతాయ
నిర్మలాశయాయ
రూపాంతరచరాయ 100
పూజ్యాయ
సదాశిష్య సమావృతాయ
భిక్షేశ్వర ప్రతిష్ఠాత్రే
నిరవద్యాయ
నిరంకుశాయ
సర్వభూత హృదావాసాయ
సర్వేష్టార్థ ప్రదాయకాయ 108

**ఓం తత్సత్ ఇతిశ్రీ వ్యాసాష్టోత్తర శతనామావళి స్సమాప్తా**



# శ్రీ మద్భగవద్గీతాష్టోత్తరశతనామావళి

(ప్రతి నామమునకు ముందు ఓం అని చివర నమః అనియు చెప్పుకోవలెను)

ఓంపార్థాయ ప్రతి బోధితాం భగవతా నారాయణేనస్వయం।
వ్యాసేన గ్రథితాం పురాణమునినామధ్యే మహాభారతమ్।
అద్వైతామృత వర్షిణీం భగవతీ మష్టా దశాధ్యాయినీం।
అంబ! త్వామను సందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్॥

ఓం గీతా దేవ్యై నమః
విమలాయై
సుఖదాయై
మునిసంస్తుతాయై

పూజ్యాయై
శ్రీకృష్ణముఖ విస్సృతాయై
పాపఘ్న్యై
పుణ్యదాయై
10
నిష్ప్రత్యూహచిదాత్మికాయై
శోకమోహాపహన్త్యై
మోక్షదాయై
బ్రహ్మబోధిన్యై
బ్రహ్మవిద్యాయై
చిదానన్దాయై
భవఘ్న్యై
భయనాశిన్యై
వేదత్రయాత్మికాయై
అనన్తాయై
తత్త్వార్థజ్ఞానమఞ్జర్యై 20
వ్యాస సంగ్రథితాయై
పూతాయై
సంసారమలమోచన్యై
సర్వశాస్త్రమయ్యై
మాత్రే
సర్వతీర్థమయ్యై
తత్త్వమస్యాదివాక్యోత్థ-
బ్రహ్మతత్త్వావగాహిన్యై
శాన్తిప్రదాయై 30
పరానన్దాయై
బోధామృత తరంగిణ్యై
విశ్వసంస్కృత సమ్భూతయే
విశ్వధర్మ ప్రచారిణ్యై
విశ్వైకరచనాయై
రమ్యాయై
రమణీయార్థ భాసితాయై
విశ్వమానవ సంపూజ్యాయై
విశ్వమంగళ కారిణ్యై
విశ్వ సిద్ధాన్త సమ్మాన్యాయై 40
విశ్వ సమ్మోహనాశిన్యై
విశ్వ స్వరూపిణ్యై
వన్ద్యాయై
విశ్వతత్త్వ ప్రకాశిన్యై

గ్రంధి
లోకోత్తర గుణోపేతాయై
లోకోచితమతాన్వితాయై
లోకోద్ధరణ సంశీలాయై
లోకామోద ప్రవర్ధికాయై 50
నిహితాఖిల శాస్త్రార్థాయై
శుభోజఃపద గుమ్ఫితాయై
అనిర్వాచ్యాయై
గంభీరాయై

ఓం నిత్యాయై నమః
నిత్య సుఖప్రదాయై
నైకవ్యాఖ్యాన సంభిన్నాయై
నానాచార్య సమాదృతాయై
స్వస్వానుకూల భావార్థశోభితాయై
శాన్తిదాన్తి దాయై 60
నిత్య నూతన భావార్థ దామిన్యై
లోక కామదాయై
ప్రాచ్యపాశ్చాత్య ఖణ్డాన్తర్నివాసి-
జనమోదదాయై
అక్షరాయై నమః
అ
సర్వకాలధర్మ ప్రబోధిన్యై
దైవీ సంపత్సుసంపన్నాయై
అసుర భావాది వర్జితాయై
అష్టాదశ మహా యోగభూషితాయై
భ్రష్ట తారిణ్యై
స్త్రీ శూద్రాది సముద్ధ 70
సమ భావ విశోభిన్యై
ఈర్ష్యాప్రసూతజాత్యాది-
దురహంకార ఘాతిన్యై
చండాల ద్విజ శూద్రాది
సర్వోద్ధరణ తత్పరాయై
మాయాపనోదిన్యై
సత్యాయై
ద్వన్ద్వ భేద వినాశిన్యై
అభేద భావపీయూష వర్షిణ్యై
జ్ఞాన భాసిన్యై
త్యాగరూపాయై 80
అనవద్యాయై
విముక్తి ఫలశా

ఓం యథాధికారి నిష్కామకర్మ-
ధ్యానాది బోధిన్యై నమః
భవమగ్న ప్రజానౌకాయై
బన్ధ చ్ఛేద విచక్షణాయై
భగవద్భావనసమ్పూర్ణాయై
భవవారధితారిణ్యై
ఆధ్యాత్మిక మహా కాశలసత్సౌ-
దామినీ సమాయై
నిష్కళాయై
నిర్మలాయై 90
శాన్తాయై
స
శుభాయై
తమోవిమూఢలోకాన్ధ-
కారనోదనచన్ద్రికాయై
శ్రుత్యన్తగత తత్త్వార్థ బోధిన్యై
బోధ భాసురాయై
బోధామృత మయశ్శుక్లాయై
పార్థవత్సతరాన్వితాయై
దోగ్ధ్రృకృష్ణాయై
గోరూపాయై 100
కామధేనవే
శుగన్తికాయై
క్లిన్నపార్థతమోహన్త్ర్యై
క్షాత్రధర్మప్రవర్తికాయై
కర్తవ్యచ్యుతధీ మూఢ జన-
సత్పథదర్శికాయై
సర్వసన్న్యాససంలక్ష్యాయై
పూర్ణ బ్రహ్మ ప్రబోధిన్యై
కలి సన్త్రస్త సమ్మూఢలోకత్రాణ-
చరణాయై
పరాయై 108

ఓం తత్సత్ ఇతిశ్రీ మద్భగవద్గీతాష్టోత్తర శతనామావలి స్సమాప్తా

# శ్రీ బుద్ధాష్టోత్తరశతనామావళి



(ప్రతి నామమునకు ముందు ఓం అని చివర నమః అనియు చెప్పుకోవలెను)

ఓం మైత్ర ధర్మి నిఖిలేశ సూదన సర్వ సత్త్వ కరుణాయ ఉద్గత ।
మోదప్రాప్త పరమ ఉపేక్షక బ్రహ్మ భూత సుగతో నమోస్తుతే ॥

ఓం శ్రీ బుద్ధాయ నమః
సర్వజ్ఞాయ
సుగతాయ
ధర్మరాజాయ
తథాగతాయ
సమన్త భద్రాయ
భగవతే
మారజితే
లోకజితే
జినాయ 10
షడభిజ్ఞాయ
దశబలాయ
నిర్వాణనిలయాయ
నిర్వాణ ప్రదాయినే
విశ్వ కుటుమ్బినే
కల్పితకుల గోత్ర విధ్వంసినే
బన్ధచ్ఛిదే
దుఃఖిత జనబాన్ధవాయ
కరుణాసాగరాయ
అజ్ఞానతమో భాస్కరాయ 20
విజ్ఞాన నిలయాయ
అహింసావ్రత పరాయణాయ
సత్యవ్రతాయ
సమ్యగ్జ్ఞాన విభూషితాయ
అజ్ఞానాటవీజాతవేదసే
జిత క్రోధాయ
ఓం శాన్తాయ నమః
దాన్తాయ
మహామతయే
మహా ప్రభవే 30
మహా ప్రవక్త్రే
మంజుల భాషిణే
స్వామినే
స్వరూపానుసన్ధాన నిరతాయ
బ్రహ్మానన్ద పర్జన్యాయ
తాపసాయ
తారకాయ
సర్వజనమనోరంజనాయ
ఆ కర్ణాంత విశాల లోచనాయ
యతి రూపాయ 40
ఆత్మ యాజినే
దుర్గుణ దూరాయ
సదా చారాయ
వేద వేదాన్త తత్త్వ జ్ఞాయ
వేదాత్మనే
సర్వజనబన్ధ విచ్ఛేదనదక్షాయ
ఆత్మ బంధ వినాశకాయ
క్షత్రియ వంశ మహోదధి-
ముక్తాఫలాయ
సిద్ధాసన సంస్థితాయ
ఋషయే 50

ఓం ఋషిపూజ్యాయ నమః
సిద్ధాయ
సిద్ధ సంసేవితా దేశాయ
దేవగణార్చితాయ
హరిదంబరధరాయ
పాత్రిణే
పరమ పావనాయ
పారాయ
లోకగురవే
శివాయ 60
శివ ప్రదాయ
యోగేశ్వరాయ
సౌమ్యాయ
భక్త జన సేవ్యాయ
ముణ్డినే
జగదుద్ధారకాయ
తత్త్వజ్ఞాయ
తత్త్వ ప్రబోధకాయ
స్మృతికర్త్రే
స్మరణ మాత్రాఘనాశనాయ 70
హింసా యజ్ఞ నివారకాయ
నిర్వికల్ప సమాధిస్థాయ
ఊర్ధ్వ రేతసే
నిర్మలాశయాయ
పూజ్యపాదాయ
అనన్త శిష్యబృందవందితాయ
నిరఙ్కుశాయ నమః
నిరాధారాయ
నిరఞ్జనాయ

ఓం ప్రేమ స్వరూపాయ నమః 80
ప్రశోభిత చరణ కమలాయ
సున్దర విగ్రహాయ
ఆత్మారామాయ
న్యాయ విదే
దుర్మత ఖణ్డనపణ్డితాయ
విష్ణవే
శాన్తిదాత్రే
నవమావతారాయ
సత్యార్థ ప్రబోధకాయ
సత్యవాదినే 90
శాన్తిప్రియాయ
త్యాగనిధయే
విశుద్ధ బోధ స్వరూపాయ
బోధి సత్వాయ
బుద్ధ దేవాయ
అద్వయవాదినే నమః
వినాయకాయ నమః
మునీన్ద్రాయ
శ్రీఘనాయ
శాస్త్రయే
మునయే 100
శాక్యమునయే
సర్వార్థ సిద్ధిదాయ
శుద్ధోదనయే
గౌతమాయ
అర్క బంధవే
మాయా దేవి సుతాయ
నిర్వాణ నిలయాయ 108

ఓం తత్సత్ ఇతి శ్రీ బుద్ధాష్టోత్తర శతనామావళి సమాప్తా



# శ్రీ లక్ష్మ్యష్టోత్తరశతనామావళిః

(ప్రతి నామమునకు ముందు ఓం అని చివర నమః అనియు చెప్పుకోవలెను)

ఓం నమస్తేఽస్తు మహా మాయే! శ్రీ పీఠే! సురపూజితే!
శంఖ చక్ర గదా హస్తే! మహా లక్ష్మి! నమోఽస్తుతే!

ఓం ప్రకృత్యై నమః

విద్యాయై
సర్వ భూతహితప్రదాయై
శ్రద్ధాయై
విభూత్యై
సురభ్యై
పరమాత్మికాయై
వాచే
పద్మాలయాయై 10
పద్మాయై
శుచయే
ఓం స్వాహాయై నమః
స్వధాయై
సుధాయై
ధన్యాయై
హిరణ్మయై
లక్ష్మ్యై
నిత్య పుష్టాయై
విభావర్యై 20
ఆ

దీప్తాయై
వసుధాయై
వసుధారిణ్యై

ఓం కమలాయై నమః
కాన్తాయై
కామాక్ష్యై
క్రోధ సమ్భవాయై
అనుగ్రహ ప్రదాయై 30
బుద్ధయే
అనఘాయై
హరివల్లభాయై
అశోకాయై
అమృతాయై
దీప్తాయై
లోక శోక వినాశిన్యై
ధర్మ నిలయాయై
కరుణాయై
లోకమాత్రే 40
పద్మ ప్రియాయై
పద్మ హస్తాయై
పద్మాక్ష్యై
పద్మ సుందర్యై
పద్మోద్భవాయై
పద్మముఖ్యై
పద్మనాభప్రియాయై
రమాయై
పద్మమాలాధరాయై
50

ఓం పద్మిన్యై నమః
పద్మ గన్ధిన్యై
పుణ్య గన్ధాయై
సుప్రసన్నాయై
ప్రసాధాభిముఖ్యై
ప్రభాయై
చన్ద్ర వదనాయై
చన్ద్రాయై
చన్ద్ర సహోదర్యై
చతుర్భుజాయై 60
చన్ద్ర రూపాయై
ఇన్దిరాయై
ఇన్దు శీతలాయై
ఆహ్లోదజనన్యై
పుష్ట్యై
శివాయై
శివకర్యై
సత్యై
విమలాయై
విశ్వ జనన్యై 70
తుష్టయే
దారిద్ర్య నాశిన్యై
ప్రీతి పుష్కరిణ్యై
శాన్తాయై
శుక్ల మాల్యామ్బరాయై
శ్రియై
భాస్కర్యై
బిల్వనిలయాయై
వరారోహాయె
యశస్విన్యై 80
వసున్ధరాయై
ఉదారాఙ్గయై
హరిణ్యై
హేమమాలిన్యై
ధనధాన్యకర్యై
సిద్ధయే
స్త్రైణసౌమ్యాయై
శుభప్రదాయై
నృపవేశ్మగతానన్దాయై
వరలక్ష్మ్యై 90
వసుప్రదాయై
శుభాయై
హిరణ్య ప్రాకారాయై
సముద్రతనయాయై
జయాయై
మఙ్గళాయై దేవ్యై
విష్ణువక్ష స్థలస్థితాయై

ప్రసన్నాక్ష్యై
నారాయణ సమాశ్రితాయై 100
దారిద్ర్య ధ్వంసిన్యై

సర్వోపద్రవవా
నవదుర్గాయై
మహాకాళ్యై
బ్రహ్మ విష్ణు శివాత్మికాయై
త్రికాల జ్ఞాన సంపన్నాయై
భువనేశ్వర్యై 108

ఓం తత్సత్ ఇతిశ్రీ లక్ష్మ్యష్టోత్తర శతనామావళి స్సమాప్తా

# శ్రీ లలితాష్టోత్తరశతనామావళిః



(ప్రతి నామమునకు ముందు ‘ఓం–ఐం–హ్రీం–శ్రీం’ ను చివర ‘నమః’ చేర్చవలయును)

ఓం రజతాచలశృంగాగ్రమధ్యస్థాయై నమః
హిమాచల మహావంశ పావనాయై
శంకరార్ధాంగ సౌందర్య శరీరాయై
లసన్మరకతస్వచ్ఛ విగ్రహాయై
మహాతిశయసౌందర్యలావణ్యాయై
శశాంకశేఖర ప్రాణవల్లభాయై
సదాపంచదశాత్మైక్యస్వరూపాయై
వజ్రమాణిక్యకటకకిరీటాయై
కస్తూరీతిలకోల్లాసనిటలాయై
భస్మరేఖాంకితలసన్మస్తకాయై 10
వికచాంభోరుహదళలోచనాయై
ఓం శరచ్చాంపేయ పుష్పాభ నాసికాయై నమః
లసత్కాంచనతాటంక యుగళాయై
మణిదర్పణసంకాశకపోలాయై
తాంబూలపూరిత స్మేరవదనాయై
సుపక్వదాడిమీ బీజరదనాయై
కంబుపూగసమచ్ఛాయ కంధరాయై
స్థూలముక్తాఫలోదారసుహారాయై
గిరీశ బద్ధమాంగల్య మంగళాయై
పద్మపాశాంకుశలసత్క రాబ్జాయై 20
పద్మకైరవమందారసుమాలిన్యై
సువర్ణకుంభ యుగ్మాభసుకుచాయై
రమణీయచతుర్బాహు సంయుక్తాయై
కనకాంగదకేయూరభూషితాయై
బృహత్సౌవర్ణ సౌందర్యవసనాయై
బృహన్నితంబవిలసజ్జఘనాయై

ఓం సౌభాగ్య జాతశృంగారమధ్యమాయై నమః
దివ్యభూషణ సందోహరం జితాయై
పారిజాత గుణాధిక్య పదాబ్జాయై
సుపద్మరాగసంకాశ చరణాయై 30
కామకోటి మహాపద్మపీఠస్థాయై
శ్రీ కంఠనేత్రకుముద చంద్రికాయై
సచామరరమావాణీ విరాజితాయై
భక్తరక్షణ దాక్షిణ్యకటాక్షాయై
భూతేశాలింగనోద్భూత పులకాంగ్యై
అనంగజనకాపాంగ వీక్షణాయై
బ్రహ్మోపేంద్రశిరోరత్న రంజితాయై
శచీముఖ్యామవధూసేవితాయై
లీలాకల్పిత బ్రహ్మాండ మండలాయై
అమృతాదిమహాశక్తిసంవృతాయై 40
ఏకాతపత్రసామ్రాజ్యదాయికాయై
సనకాదిసమారాధ్యపాదుకాయై
దేవర్షిభిస్స్తూయమానవైభవాయై
కలశోద్భవదూర్వాసపూజితాయై
మత్తేభవక్త్రషడ్వక్త్రవత్సలాయై
చక్రరాజమహాయంత్రమధ్యవర్తిన్యై
చిదగ్నికుండసంభూత సుదేహాయై
శశాంక ఖండసంయుక్తమకుటాయై
మత్తహంసవధూమందగమనాయై 50
వందారుజనసందోహవందితాయై
అంతర్ముఖజనానందఫలదాయై

అవా.

నితాంతసచ్చిదానందసంయుక్తాయై
సహస్రసూర్యసంయుక్తప్రకాశాయై

ఓం రత్నచింతామణిగృహమధ్యస్థాయై నమః
హానివృద్ధిగుణాధిక్యరహితాయై
మహాపద్మాటవీమధ్యనివాసాయై
జా
మహాపాపౌఘపాపానాం వినాశిన్యై 60
దుష్టభీతిమహాభీతిభంజనాయై
సమస్తదేవదనుజ ప్రేరకాయై
సమస్తహృదయాంభోజనిలయాయై
అనాహతమహాపద్మమందిరాయై
సహస్రారసరోజాతవాసితాయై
పునరావృత్తిరహితపురస్థాయై
వాణీగాయత్రీసావిత్రీ సన్నుతాయై
రమాభూమిసుతారాధ్యపదాబ్జాయై
లోపాముద్రార్చిత శ్రీ మచ్చరణాయై
సహస్రరతిసౌందర్య శరీరాయై
భావనామాత్ర సంతుష్ట హృదయాయై 70
సత్య సంపూర్ణ విజ్ఞానసిద్ధిదాయై
శ్రీ లోచనకృతోల్లాసఫలదాయై
శ్రీ సుధాబ్ధిమణిద్వీపమధ్యగాయై
దక్షాధ్వరవినిర్భేదసాధనాయై
ితాయై
చం
స
నామపారాయణాభీష్టఫలదాయై
సృష్టిస్థితి తిరోధాన సంకల్పాయై 80
శ్రీ షోడశాక్షరీమంత్రమధ్యగాయై
అనాద్యంతస్వయంభూత దివ్యమూర్త్యై
భక్తహంసపరీముఖ్య వియోగాయై
మాతృ మండలసంయుక్త లలితాయై

ఓం భండదైత్యమహాసత్త్వ నాశనాయై
క్రూరభండశిరచ్ఛేదనిపుణాయై
ధాత్రీచ్యుతసురాధీశసుఖదాయై
చండముండనిశుంభాదిఖండనాయై
రక్తాక్షర క్తజిహ్వాదిశిక్షణాయై
మహిషాసురదోర్వీర్యనిగ్రహాయై 90
అభ్రకేశమహోత్సాహకారణాయై
మహేశయుక్తనటనతత్పరాయై
నిజభర్తృముఖాంభోజచింతనాయై
వృషభధ్వజవిజ్ఞానభావనాయై
జన్మమృత్యుజరారోగభంజనాయై
విధేయముక్తివిజ్ఞానసిద్ధిదాయై
కామక్రోధాదిషడ్వర్గనాశనాయై
రాజరాజార్చితపదసరోజాయై
సర్వవేదాంతసంసిద్ధసుతత్త్వాయై
శ్రీ వీరభక్తవిజ్ఞాననిధానాయై 100
అశేషదుష్టదనుజసూదనాయై
సాక్షాచ్ఛ్రీదక్షిణామూర్తిమనోజ్ఞాయై
హయమేధాగ్ర సంపూజ్యమహిమ్నే

సుమబాణేక్షుకోదండమండితాయై
నిత్య యౌవనమాంగల్యమంగళాయై
మహాదేవసమాయుక్తశరీరాయై
మహాదేవరత్యౌత్సుక మహాదేవ్యై
ఓం చతుర్వింశతంత్ర్యైకరూపాయై 108



# శ్రీ దుర్గాష్టోత్తరశతనామావళిః

( ప్రతి నామమునకు ముందు 'ఓం' ను చివర 'నమః' చేర్చవలయును)

ఓం దుర్గాయై నమః
శివాయై
మహాలక్ష్మ్యై
మహాగౌర్యై
చండికాయై
సర్వజ్ఞాయై
సర్వలోకేశాయై
సర్వకర్మఫలప్రదాయై
సర్వతీర్థమయాయై
పుణ్యాయై 10
దేవయోనయే
అయోనిజాయై
భూమిజాయై
నిర్గుణాయై
ఆధారశక్త్యై
అనీశ్వర్యై
నిర్గుణాయై
నిరహంకారాయై
సర్వగర్వవిమర్దిన్యై
సర్వలోక ప్రియాయై 20
వాణ్యై
సర్వవిద్యాదిదేవతాయై
పార్వత్యై
దేవమాత్రే
వనీశాయై
వింధ్యవాసిన్యై

ఓం మహామాత్రే నమః
కోటిసూర్యసమప్రభాయై
దేవతాయై 30
వహ్నిరూపాయై
సతేజసే
వర్ణరూపిణ్యై
గుణాశ్రయాయై
గుణమధ్యాయై
గుణత్రయవివర్జితాయై
కర్మజ్ఞానప్రదాయై
కాంతాయై
సర్వసంహారకారిణ్యై
ధర్మజ్ఞానాయై 40
ధర్మనిష్ఠాయై
సర్వకర్మవివర్జితాయై
కామాక్ష్యై
కామాసంహంత్ర్యై
కామక్రోధవివర్జితాయై
శాం
శాం
శాంతాయై
చంద్రసూర్యాగ్నిలోచనాయై
సుజయాయై 50
జయాయై
భూమిష్ఠాయై
జాహ్నవ్యై
జనపూజితాయై

ఓం శాస్త్రాయై నమః
శాస్త్రమయాయై
నిత్యాయై
శుభాయై
చంద్రార్ధమస్తకాయై
భారత్యై 60
భ్రామర్యై
కల్పాయై
కరాళ్యై
కృష్ణపింగళాయై
బ్రాహ్మై
నారాయణ్యై
రౌద్ర్యై
చంద్రామృతపరిస్రుతాయై
జ్యేష్ఠాయై
ఇందిరాయై 70
మహామాయాయై

బ్రహ్మాండకోటిసంస్థానాయై
కామిన్యై
కమలాలయాయై
కాత్యాయన్యై
కలాతీతాయై
కాలసంహారకారిణ్యై

యోగిగమ్యాయై 80
తపస్విన్యై

ఓం జ్ఞానరూపాయై నమః
నిరాకారాయై
భక్తాభీష్టఫలప్రదాయై
భూతాత్మికాయై
భూతమాత్రే
భూతేశాయై

స్వధానారీమధ్యగతాయై
షడాధారాధివర్ధిన్యై 90
మోహితాయై
శుభాయై
శుభ్రాయై
సూక్ష్మాయై
మాత్రాయై
నిరాలసాయై
నిమగ్నాయై
నీలసంకాశాయై
నిత్యానందాయై 100
హరాయై
పరాయై
సర్వజ్ఞాన ప్రదాయై
ఆనందాయై
సత్యాయై

సరస్వత్యై
సర్వగతాయై 108
సరా

ఓం తత్సత్ ఇతిశ్రీ దుర్గాష్టోత్తర శతనామావళి స్సమాప్తా



# శ్రీ గౌరీ అష్టోత్తరశతనామావళిః

(ప్రతి నామమునకు ముందు 'ఓం' ను చివర 'నమః' చేర్చవలయును)

ఓం సర్వమంగళ మాంగల్యే శివే సర్వార్థ సాధకే ।
శరణ్యే త్ర్యంబకే దేవీ నారాయణి నమోస్తుతే ॥

ఓం గౌర్యై నమః
గణేశజనన్యై
గుహాంబికాయై
జగన్మాత్రే
గిరితనూభవాయై
వీరభద్రప్రసవే
విశ్వవ్యాపిన్యై
విశ్వరూపిణ్యై
అష్టమూర్త్యాత్మికాయై
అష్టదారిద్ర్యశమన్యై
శివాయై 10
శాం
శాం
బాలాయై
భవాన్యై
హైమవత్యై
పార్వత్యై
పాపనాశిన్యై
నారాయణాంశజాయై
నిత్యాయై 20
నిర్మలాయై
అంబికాయై
హిమాద్రిజాయై
వేదాంతలక్షణాయై
కర్మ బ్రహ్మమయ్యై
గంగాధరకుటుంబిన్యై

ఓం మృడాన్యై నమః
మునిసంసేవ్యాయై
మాలిన్యై
మేనకాత్మజాయై 30
కుమార్యై
కన్యకాయై
దుర్గాయై
కాత్యాయన్యై
భద్రదాయిన్యై
మాంగల్యదాయిన్యై
సర్వమంగళాయై
మంజుభాషిణ్యై
మహేశ్వర్యై 40
మహామాయాయై
మంత్రారాధ్యాయై
మహాబలాయై
సర్వమయ్యై
సౌభాగ్యదాయై
కామకలనాయై
కాంక్షితార్థప్రదాయై
చంద్రార్కాయుత
తాటంకాయై
50
శ్రీచక్రవాసిన్యై

## శ్రీ గౌరీష్టోత్తర శతనామావళిః

ఓం దేవ్యై నమః
కామేశ్వరపత్న్యై
కమలాయై

పుత్రపౌత్రవరప్రదాయై
పుణ్యాయై
కృపాపూర్ణాయై
కల్యాణ్యై
కమలాయై 60
అచింత్యాయై
త్రిపురాయై
త్రిగుణాంబికాయై
పురుషార్థ ప్రదాయై
సత్య ధర్మరతాయై
సర్వరక్షిణ్యై
శశాంకరూపిణ్యై
సరస్వత్యై
విరజాయై
స్వాహాయై 70
స్వధాయై
ప్రత్యంగిరాంబికాయై
ఆర్యాయై
దాక్షాయిణ్యై
దీక్షాయై
సర్వవస్తూత్తమోత్తమాయై
శివాభినామధేయాయై
శ్రీ విద్యాయై
ప్రణవార్థస్వరూపిణ్యై
హ్రీంకార్యై 80

ఓం నాదరూపాయై నమః
సుందర్యై
షోడశాక్షరదేవతాయై
మహాగౌర్యై
శ్యామలాయై
చండ్యై
భగమాలిన్యై
భగళాయై
మాతృకాయై
శూలిన్యై 90
అమలాయై
అన్నపూర్ణాయై
అఖిలాగమసంస్తుతాయై
అంబాయై
భానుకోటిసముద్యతాయై
పరాయై
శీతాంశుకృతశేఖరాయై
సర్వకాలసుమంగళ్యై
సోమశేఖర్యై
అమరసంసేవ్యాయై 100
అమృతేశ్వర్యై
సుఖసచ్చిత్సుధారసాయై
బాల్యారాధితభూతదాయై
హిరణ్యాయై
సూక్ష్మాయై
హరిద్రాకుంకుమారాధ్యాయై
సర్వభోగప్రదాయై
మార్కండేయవరప్రదాయై 108



# శ్రీ సరస్వత్యష్టోత్తరశతనామావళిః

(ప్రతి నామమునకు ముందు 'ఓం' ను చివర 'నమః' చేర్చవలయును)

ఓంనమస్తే శారదా దేవి జ్ఞానైశ్వర్య ప్రదాయని ।
నిత్యా నన్దమయీ వాణీ పాహిమాం భక్తరక్షణి ।

ఓం సరస్వత్యై నమః
మహాభద్రాయై
మహామాయాయై
వరప్రదాయై
శ్రీ ప్రదాయై
పద్మనిలయాయై
పద్మాక్ష్యై
పద్మవక్త్రాయై
శివానుజాయై
పుస్తకధృతే 10
జ్ఞానముద్రాయై
రమాయై
పరాయై
కామరూపాయై
మహావిద్యాయై
మహాపాతకనాశిన్యై
మహాశ్రయాయై
మాలిన్యై
మహాభోగాయై
మహాభుజాయై 20
మహాభాగ్యాయై
మహోత్సాయై
దివ్యాంగాయై
సురవందితాయై
మహాకాళ్యై
మహాపాశాయై
ఓం మహాకారాయై నమః
మహాంకుశాయై
సీతాయై
విమలాయై 30
విశ్వాయై
విద్యున్మాలాయై
వైష్ణవ్యై
చంద్రికాయ్యై
చంద్రవదనాయై
చంద్రలేఖావిభూషితాయై
సావిత్ర్యై
సురసాయై
దేవ్యై 40
దివ్యాలంకారభూషితాయై
వాగ్దేవ్యై
వసుధాయై
తీవ్రాయై
మహాభద్రాయై
మహాబలాయై
భోగదాయై
భారత్యై
భామాయై
గోవిందాయై
గోమత్యై 50
శివాయై
జటిలాయై

శ్వేత వరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన... నామసంవత్సరే... అయనే... ఋతౌ... మాసే... పక్షే... తిథౌ... వాసరే శుభ నక్షత్రే శుభయోగే శుభ కరణే ఏవంగుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్... గోత్రః... నామధేయః ధర్మపత్నీ సమేతోஉహం శ్రీమతః... గోత్రస్య... నామధేయస్య ధర్మపత్నీసమేతస్య మమ సకుటుంబస్యక్షేమ స్థైర్య విజయాభయాయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం ధర్మార్థకామమోక్ష చతుర్విధ పురుషార్థ ఫలావాప్త్యర్థం చింతితమ నోరథ సిద్ధ్యర్థం శ్రీ సత్యనారాయణ ముద్దిశ్య శ్రీ సత్యనారాయణ ప్రీత్యర్థం పురుషసూక్తవిధానేన ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే. ఆదౌ నిర్విఘ్నపరిసమాప్త్యర్థం గణాధిపతిపూజాం కరిష్యే. తదంగకలశారాధనం కరిష్యే. చెప్పిన తరువాత కలశపూజ, గణపతి పూజ, నవగ్రహ, అష్టదిక్పాలక పూజ, శ్రీ సత్యనారాయణస్వామి వారికి ధ్యానావాహనాది షోడశోపచార పూజ చేసి కథ ప్రారంభించవలెను.

**గమనిక :** ఈ పుస్తకములో మొదటిలో గణపతి పూజ, నవగ్రహ అష్టదిక్పాలక పూజ, పురుషసూక్త విధాన పూజ మరియు మంత్ర పుష్పము మొదలైనవి ఉన్నవి. అందుచే ప్రత్యేకముగా వ్రాయలేదు. అచ్చట చూచి చేసుకొనవలెను.

**గమనిక :** కథ అనంతరం ధూప దీప నైవేద్యము, మంగళహారతి, మంత్ర పుష్పము, ప్రదక్షిణ నమస్కారము, పునఃపూజ, పురోహితునికి దక్షిణ తాంబూలము ఇచ్చి అనంతరము తీర్థ ప్రసాదములు అందరికీ పంచవలెను.



# సత్యనారాయణ వ్రత కథా ప్రారంభః

శ్లో॥ ఏదా నై మిశారణ్యే ఋషయ శౌనకాదయః।
పప్రచ్ఛు మునయస్సర్వే సూతం పౌరాణికం ఖలు॥

**తా॥** ఒకానొక సమయమందు శౌనకాది మహామునులు నైమిశారణ్యంబు ప్రవేశించి యందుండెడి వ్యాసశిష్యుడును, పురాణ ప్రవక్తయు నగు సూత పౌరాణికుల నొకానొక ప్రశ్న వేసిరి.

ఓ సూతపౌరాణికుడా! పురుషునిచే గోరంబడు ఐహిక పుత్ర పశ్వాది ఫలంబులు, స్వర్గాద్యాముష్మికఫలంబులు ఇవి ఏ వ్రతాదులచే లేక (చాంద్రాయణాది) ఏ తపో విశేషంబులచే సిద్ధించును? వానిని వినగోరుచున్నాము గాన వచింపుము.

ఓ సౌనకాదిమహామునులారా! మీరు చేసిన ప్రశ్నవలెనే నారద మహాముని విష్ణుమూర్తి నడుగగా భగవంతుడగు శ్రీ విష్ణుమూర్తి నారద మహామునికి వచించిన చందంబును నేను మీకు వచించెద. సమాహితచిత్తులై వినుడు.

ఓ శౌనకాదిమహామునులారా! ఒకానొక కాలమందు యోగీశ్వరుడగు నారదమహాముని లోకానుగ్రహమును గోరినవాడై సకలలోకములందును సంచరించుచు క్రమముగ మనుష్యలోకమున కేతెంచి యీ మర్త్య లోకమునందు నానా యోనులయందు జనించుచు నానాక్లేశముల ననుభవించుచు జన్మాంతర పాపకర్మములచే బాధపడుచునుండెడి జనుల నాలోకించి ఇట్టి కష్టములనుభవించుచుండెడి జనులకు ఏ యుపాయముచే నిట్టి దుఃఖములు తొలగునని యోచించి, ఆ నారద మహాముని విష్ణులోకమున కేగి ఆ విష్ణులోకమునందు నిర్మల స్ఫటిక వర్ణము గలిగిన నాలుగు భుజములయందు శంఖ చక్రగదాపద్మయుక్తుడై వనమాలచే నలంకృతుడై ప్రకాశించుచుండెడి శ్రీ మహావిష్ణువును వీక్షించి పరమానందభరితుడై ప్రార్థన చేయుట కారంభించెను.

నారాయణమూర్తీ! నీవు మనోవాక్కులకు అతీతమైన రూపముగలవాడవు. అపరిమితమైన శక్తి గలవాడవు. మరియు అనంత కల్యాణగుణములకు ఆధార భూతుడవు. సకల ప్రపంచమునకు నాదిభూతుడవు. భక్తులయొక్క దుఃఖమును నశింపచేయువాడవు అని నారద మహాముని చేయుచున్న ప్రార్థనలను శ్రీమన్నారాయణమూర్తి ఆకర్ణించి నారదమునికి సవిస్తరముగ నిట్లు చెప్పం దొడంగెను.

ఓ నారదమహామునీ! ఇచ్చటి కేల ఏతెంచితివి? నీ మనంబునందే యభిప్రాయమున్నదో ఆ భావమునంతయు చెప్పుము. దానికి ప్రత్యుత్తరమునే జెప్పెదను.

ఇటుల వచించెడి నారాయణమూర్తి యొక్క వాక్కును నారదముని విని ఓ భగవంతుడా! మానవ లోకమునందు సకల జనులు నానా క్లేశముల ననుభవించుచు .నానా యోనులయందు సంచరించుచు పాపకర్మములచే బాధపడు చున్నారు. కావున అట్టి బాధ లా మానవులకు ఏ ప్రకార ముపశమించునో అట్టి యుపాయమును వచింపుము. దానిని నే వినగోరి యున్నాడను. ఓ భగవంతుడా! నీకు నా యందు కృపగలదేని దీనిని చెప్పుము.

ఇటుల నారదుడు ప్రార్థింపగా శ్రీమన్నారాయణమూర్తి ఓ నారద మహామునీంద్రా! లోకానుగ్రహమునందు మిగుల కాంక్ష గలవాడవై యోగ్యమగు ప్రశ్న చేసితివి. మానవ లోకమందుండెడి జనులకు ఏ యుపాయముచే క్లేశములు శాంతిజెందునో అట్టి సులభోపాయమును నేను వినిపించెద వినుము. ఓ మునీంద్రా! మహాపుణ్యకరమై మర్త్య లోకమందును స్వర్గలోకమందును దుర్లభమైనట్టి సత్యనారాయణ వ్రతమని పేర్కొనంబడు ఒక వ్రతము గలదు. ఆ వ్రతమును యథావిధిగా ఆచరించినచో సకల దుఃఖములను పారదోలి ఇహలోకమునందు సకల సుఖముల ననుభవించి పిదప మోక్షమును పొందుదురు.

ఇట్లు నారాయణమూర్తిచే జెప్పబడిన వాక్యము నారదమహాముని విని మరల నిట్లు ప్రశ్న చేసినవాడయ్యె.

ఓ భగవంతుడా! ఇపుడు నీ చే చెప్పంబడిన వ్రతఫల మెట్టిది? దాని విధాన మెట్టిది? ఈ వ్రతంబు పూర్వమెవరిచే జేయబడినది మరియు నీ వ్రతంబు నేకాలమందు చేయవలయును? వీని నన్నిటిని సవిస్తరంబుగ జెప్పుమని ప్రార్థింపగా, శ్రీమన్నారాయణమూర్తి ఆ వ్రతంబును సవిస్తరంబుగ జెప్పనారంభించెను.

ఓ నారదమునీంద్రా! ఇప్పుడు నాచే జెప్పంబడిన వ్రతము దుఃఖోపశాంతి ధనధాన్యవృద్ధి సౌభాగ్య సంతతి సర్వత్ర జయము గలుగజేయును. కావున నీ వ్రతంబునకు నిది ఫలంబని ఎరుంగవలయు.

మరియు నొకానొక మాసంబున నొకానొక దివసమునందు మానవుడు భక్తిశ్రద్ధలుగలవాడై ప్రదోషకాలంబున ఈ వ్రతంబును ప్రారంభింపవలయును. మరియు బ్రాహ్మణులును బంధుజనులును మొదలగువారితో గూడినవారై భక్ష్యంబులు కదళీఫలములు ఘృతక్షీరములు గోధుమ పిష్టము శర్కర గుడము – వీనిచే మిళితమగు నైవేద్యంబులు భక్తిచే నివేదించిన పిదప బ్రాహ్మణులకు దక్షిణ తాంబూల ఫలముల నొసంగి స్వజనులతో గూడి సత్యనారాయణ వ్రత కథా శ్రవణంబు చేసి పిదప బంధుజనులతో సహా బ్రాహ్మణులకు అన్నదాన మొసంగుటయే గాక నివేదిత భక్ష్య భోజ్యాదులతో పాదాంశంబు తాను భుజియించి సత్యనారాయణ స్మరణపూర్వకంబుగ నృత్యగీతాది వాద్యంబులతో గృహంబును ప్రవేశింపవలయును.

ఇటుల మానవులు చేసిరేని ఇష్టసిద్ధి గలుగు, భగవంతుండగు శ్రీమన్నారాయణమూర్తి నారదమహామునికి నెరింగించెనని సూతపౌరాణికుడు సౌనకాది మహామునులకు జెప్పెను.

ప్రథమాధ్యాయము సమాప్తము

## ద్వితీయోధ్యాయః

### సూతఉవాచ

శ్లో॥ అతాన్య త్సంప్రవక్ష్యామి కృతంయేనపురా ద్విజః
కశ్చి త్కాశీపురే రమ్యే ఆశీ ద్విప్రో உతి నిర్ధనః
క్షుత్తృడ్భ్యాం వ్యాకులోభూత్వా నిత్యం భ్రామ భూతలే.

తా॥ ఓ ఋషులారా ఈ వ్రతము పూర్వము ఎవరిచే నాచరింపబడినదో దానిని జెప్పుచున్నాను వినుడు. రమ్యమగు కాశీపట్టణమందు విశేష దరిద్రుడగు నొక బ్రాహ్మణుడు గలడు. అతడు ఆకలి దప్పులచే మిగుల వ్యాకులుడై నిత్యము భూమియందు సంచరించుచుండెను.

దుఃఖితుడగు ఆ బ్రాహ్మణుని వీక్షించి శ్రీమన్నారాయణమూర్తి బ్రాహ్మణుల యందు వాత్సల్యము గలవాడు గాన వృద్ధ బ్రాహ్మణ రూపమును స్వీకరించి ఆ బ్రాహ్మణునకు ప్రత్యక్షమై ఓయీ బ్రాహ్మణుడా! విశేష దుఃఖము గలవాడవై ఎందుకొఱకు భూమియందు సంచరించుచున్నావో దానినంతయు వినగోరుచున్నాను. చెప్పుమా అని ఆదరణచే అడిగెను.

ఇటుల భగవంతుడగు నారాయణమూర్తి యొక్క వాక్కును విని నేను అతి దరిద్రుడను. భిక్షార్థము ఈ భూమియందు తిరుగుచున్నాను. మీకు ఏదైన ఉపాయము తెలిసిన కృపచే నానతీయవలయునని బ్రాహ్మణుండు వంచించెను.

ఓ బ్రాహ్మణుడా! నీ వడిగిన ప్రశ్నకు ఉత్తరమును చెప్పుచున్నానని వృద్ధ బ్రాహ్మణ రూపుడైన నారాయణమూర్తి యిట్లు చెప్పదొడంగెను.

సత్యనారాయణుడను పేరుగల విష్ణువు వాంఛితార్థములను ఇచ్చువాడు. కావున మనుష్యుడు ఏ వ్రతమును ఆచరించిన దుఃఖములచే విడువబడునో అట్టి సత్యనారాయణ వ్రతము నీవు చేయుమా అని, ఆ వ్రతము యొక్క ఆచరణ

విధానము నంతయును బ్రాహ్మణునికి వచించెను. పిదప సత్యనారాయణ రూపుడగు వృద్ధ బ్రాహ్మణుడు అచ్చటనే అంతర్ధానమును జెందెను.

పిదప ఆ బ్రాహ్మణుడు వృద్ధ బ్రాహ్మణ రూపుడగు నారాయణునిచే జెప్పబడిన వ్రతము నాచరించుటకు యత్నించి యా రాత్రి నిదురను వదలి యేకాగ్రచిత్తుడై ప్రాతఃకాలమున లేచి సత్యనారాయణ వ్రతము జేయ నుపక్రమించి ఆ వ్రతము పరిపూర్ణముగ నడచుటకై ధనార్జనమునందాసక్తి గలవాడై సంచరింపగా నా దినమునందే విశేష ద్రవ్యము నార్జించి బంధువులును దానునేకమై సత్యనారాయణ వ్రతంబును చేసి, ఆ వ్రత మహత్త్వమువలన సర్వ దుఃఖములును పోగొట్టుకొనినవాడై సర్వసంపదలును గలవాడాయెను.

అది మొదలు ఆ బ్రాహ్మణుడు ప్రతిమాసమందును సత్యనారాయణ వ్రతమును చేసి సర్వపాప నివృత్తిగలవాడై దుర్లభమగు మోక్షమును పొందెను.

కావున భూమియందు ఏ మనుజుడు ఎప్పుడీ వ్రతమును ఆచరించునో అప్పుడే సర్వదుఃఖములును నశించును. ఇట్లని నారాయణమూర్తి నారద మహామునికి వచించెను. ఇటుల నారాయణునిచే జెప్పబడిన దానిని శౌనకాది మహామునులారా! మీకు నే వచించితిని. ఇంక నేమి యడుగ గోరెదరు?

ఇటుల సూతుండు వచించిన పిదప శౌనకాది మహామునులు ఓ సూత పౌరాణికుడా! ఆ బ్రాహ్మణుని వలన వినబడి ఈ వ్రతము భూమి యందెవరిచే నాచరింపబడినదో దాని క్రమమంతయు శ్రద్ధతో వినగోరుచున్నాము. గాన జెప్పవలయునని ఋషులడిగిరి.

ఓ మునులారా! భూమియందు ఈ వ్రతము ఎవరిచే చేయంబడెనో ఆ బ్రాహ్మణుడు విభవానుసారముగా బంధువులతో, స్వజనులతో గూడి వ్రతమును జేయనుద్యుక్తుడైన వాడాయెను.

అట్టి కాలమందే ఒకానొక కట్టెలమ్మువాడు ఆ బ్రాహ్మణుని గృహమునకు వెలుపల కట్టెల మోపును విడిచి దప్పిచే బాధింపబడుచు బ్రాహ్మణుని గృహములోని కరిగి యా బ్రాహ్మణుని జూచి నమస్కరించి ఓ స్వామీ! నీచే జేయంబడు

వ్రతమెట్టిది? దీనిఁజేసిన నేమి ఫలము గల్గును? దీనిని సవిస్తరముగ జెప్పుమా యని అడిగెను.

కాష్ఠముల విక్రయించువాడా! ఈ వ్రతము సత్యనారాయణ వ్రతమనం బడును. ఇది సర్వాభీష్టముల నొసంగును. ఈ వ్రతానుష్ఠానముచే నాకు సమస్తమగు ధనధాన్య సంపత్తు కలిగినదని బ్రాహ్మణుడు చెప్పగా, నా బ్రహ్మణుని వలన నీ వ్రతమహిమను కట్టెలనమ్మువాడు విని తెలిసికొని మిక్కిలి సంతోషము గలవాడయి నీరు గ్రోలి ప్రసాదంబును భుజించి తన నగరంబునకు వెళ్ళి సత్యనారాయణస్వామిని మనసార ధ్యానించుచు కాష్ఠ విక్రయమువలన నెంత ధనము లభ్యమగునో ఆ ధనముచే సత్యనారాయణ వ్రతము చేయుదునని సంకల్పించి మనస్సునందాలోచించినవాడై కాష్ఠభారమును శిరస్సునందుంచుకొని పట్టణమునందు ఎక్కడ ధనికులుందురో అక్కడికి వెళ్ళి ఆ కాష్ఠభారమును విక్రయింపగా ద్విగుణీకృత ధనమును జెందినవాడాయెను.

నిర్మలమగు మనస్సుకలవాడై బాగుగా పండిన అరటిపండ్లు శర్కర నెయ్యి పాలు గోధుమ పిండి వీని నన్నిటిని సంపాదించుకొని తన గృహమున ప్రవేశించి బంధుజనులతో గూడుకొనినవాడై యథావిధిగా వ్రతము నాచరించెరిను. ఆ వ్రత మాహాత్మ్యముచే ధనము పుత్రులు–వీనితో గూడితినవాడై యిహలోకమునందు సుఖము ననుభవించి అంతమందు సత్యలోకమునకు వెళ్ళినవాడాయెను.

*ద్వితీయోధ్యాయ స్సమాప్తః.*

## తృతీయోధ్యాయః

### సూత ఉవాచ

శ్లో॥ పునరగ్రే ప్రవక్ష్యామి శృణుధ్వం మునిసత్తమాః।
పురాచోల్కాముఖోనామ నృపశ్చాసీ న్మహీపతిః॥

శౌనకాది మహామునులారా! మరల వచించెద వినుడని సూతుడు చెప్ప దొడంగెను. పూర్వము జితేంద్రియుడు సత్యవాక్కు గలవాడునగు ఉల్కా ముఖుడను పేరు గల యొక రాజు గలడు. అతడు ప్రతిదినము దేవాలయమున

కేగుచు, బ్రాహ్మణులకు ధన మొసంగుచు విశేష ముగ్ధగను, కమలముల వంటి ముఖము గలదిగను నుండునట్టి భార్యతోగూడి నదీతీరమునందు సత్యవ్రతము నాచరించుచుండెను.

పిదప ఆ వ్రతము నాచరించు కాలమునందు సాధువగు నొకవైశ్యుడు వర్తకము నిమిత్తము విశేష ధనముతో గూడుకొనినవాడై వచ్చి ఆ నదీ తీరమునందు ఓడనుంచి రాజు సమీపమున కేగి వినయపూర్వకముగ ఇట్లు ప్రశ్నించెను.

ఓ రాజా! నీవు భక్తియుక్తమగు చిత్తముతో జేయుచున్న వ్రతము ఎట్టిదిస దానినంతయు వచింపుము. వినగోరుచున్నానని పలికెను.

ఇట్లు వైశ్యునిచే ప్రార్థింపబడినవాడై రాజు ఓ సాధువా! నేను సంతానమును గోరినవాడనై అనంత తేజస్సుగల విష్ణుమూర్తి పూజయును, వ్రతమును సర్వజన యుక్తుడనై యీ వ్రతము నాచరించుచున్నానని వచించిన రాజు వాక్యము నాలకించి సాధువగు వైశ్యుడు ఆసక్తితో ఓ రాజా! ఈ వ్రతమునంతయు నుపదేశింపుము. నేనును ఆ వ్రతము నాచరించెదను. నాకును సంతానము లేదు.

ఈ

బడిన ఈ వైశ్యుడు బేరమును త్యజించి సంతోషము గలవాడై గృహమున కేగి భార్యతో ఈ సత్యనారాయణ వ్రతమును జేసిన సంతానకరమని చెప్పి ఎప్పుడు నాకు సంతానము గలుగునో అపుడు ఈ వ్రతము చేయుచున్నానని భార్యయగు లీలావతితో చెప్పినవాడాయెను.

ఒకానొక దినమందు ఆ సాధువు భార్యయగు లీలావతి భర్తతో ఆనందచిత్తురాలుగను, ధర్మమందాసక్తి గలదిగను కూడి యుండగా, సత్యనారాయణానుగ్రహము వలన గర్భవతియై పదియవ మాసమందు లీలావతి అను కన్యారత్నమును ప్రసవించెను

ఆ కన్యక దినదినమును శుక్లపక్ష చంద్రునివలె వృద్ధి పొందెను. పిదప ఆ కన్యకకు కళావతి అని నామకరణము చేసెను.

అనంతరమందు లీలావతి భర్తయగుసాధువును గూర్చి యో స్వామీ! పూర్వమందు సంకల్పించుకొనిన వ్రతమును ఎందు నిమిత్తము చేయరు అని యడిగెను.

ఓ ప్రియులారా! ఈ వ్రత మా చిన్నదాని వివాహకాలమందే చేయుదమని భార్య నూరడించి పట్టణంబునకు వెళ్ళెను. అనంతరమందు కళావతి యను కన్య తండ్రి యొక్క గృహమందు వృద్ధి పొందుచుండగా ఆ కన్యను తండ్రి చూచి పట్నమునందుండు స్నేహితులతో గూడి నాలోచించినవాడై కన్యా వివాహార్థము బుద్ధిమంతుని విచారింపుమా అని ఒకానొక దూతను శీఘ్రంబున బంపెను.

ఆయనచే నాజ్ఞాతుడగు దూత కాంచన నగరంబునకు వెళ్ళి ఆ పట్టణము నుండి వైశ్య కుమారుని బిలుచుకొని వచ్చినవాడాయెను. అటువచ్చిన సుందరుడును బాలుడును మంచి గుణము కలవాడునైన వైశ్యకుమారుని చూచి జ్ఞాతులతోడను బంధువులతోడను గూడి సంతోషముగ నా సాధువు ఆ కుమారునికి కన్య నిచ్చి యథావిధిగా పాణిగ్రహణము చేయించెను.

అటు వెనుక ఆ భాగ్యము వలన ఆ కన్యయొక్క వివాహ సమయమందు వ్రతంబును మఱచినవాడాయెను. దానిచే నారాయణమూర్తి కోపించిన వాడాయెను.

పిదప కొంతకాలము జరిగిన వెనుక నిజకర్మ వశంబుచే బేరము నిమిత్తము శీఘ్రముగ నల్లునితో గూడి చంద్రకేతు రాజకుమారుని నివాసమగు రత్నసాను పురమునకు జని సముద్రతీరస్థుండు ధనికుడు నగు నల్లునితో కూడ నా సాధువు బేరమును జేయుచుండెను. అట్టి కాలమందు సత్యనారాయణస్వామి భ్రష్ఠ ప్రతిజ్ఞుడగు సాధువుని చూచి దారుణమును కఠినము నగు గొప్ప దుఃఖము గలుగునని సాధువగు వైశ్యునికి శాప మిడినవాడాయెను.

పిదప నా దినమునందే ఒకానొక చోరుడు రాజుయొక్క ధనమును తీసికొని ఎక్కడ వైశ్యులుండిరో అక్కడికి వచ్చి తన వెంటవచ్చు భటులను జూచి భయపడి ఆ వైశ్యుడుండుచోట ధనముంచి ఆ చోరుడు కనబడక దాగినవాడాయెను. అటు

వెనుక ఎక్కడ సజ్జనుడగు కోమటి యుండెనో అచ్చటికి భటులు వచ్చి వానిని బంధించి పిదప సంతోషంతో రాజు నొద్దకు జని, రాజును వీక్షించి ఓ రాజా! యిద్దరు దొంగలను తీసికొని వచ్చితిమి. వీరిని చూచి ఆజ్ఞ యివ్వవలయునని వేడిరి.

పిదప రాజుచే నాజ్ఞాపితులై ఆ ఇరువురిని దృఢముగ బంధించి మిక్కిలి భయంకరమగు కారాగృహమందు నిలిపినవారైరి. అటుపిమ్మట చంద్రకేతు మహారాజు ఆ వైశ్యుల ధనమంతయు తీసికొనిన వాడాయెను.

పిదప ఆ సత్యనారాయణస్వామి శాపమువలన గృహమందు భార్యయు నతి దుఃఖితురాలాయెను. మరియు చోరులచే ఇంటి యందుండు ధనము అపహరింప బడెను. ఆ వైశ్యుని భార్య మనోవ్యథచేతను వ్యాధులతోను బాధితురాలుగను, ఆకలిదప్పి వీనిచే అతి దుఃఖితురాలుగను అన్నము లేక చింతతో కూడినదై ప్రతి గృహమునకు దిరుగుచుండుటయే గాక కళావతియను కూతురును నా తీరుననే తిరుగుచునుండెను.

పిదప నొక దినమునందు ఆకలిచే బాధితురాలై తన మందిరము నుండి బయలు వెడలిరాగా నొక స్థలమందు ఒక యువతి సత్యనారాయణ వ్రతము జేయుచుండ నా వ్రతమును చూచి యా కథను విని వరములు గోరి ప్రసాదమును భక్షించి రాత్రి యింటికి వెళ్ళెను.

ఇటుల వచ్చిన కళావతిని తల్లి చూచి ప్రేమచే ఓ కూతురా! రాత్రి ఎచ్చట నుంటివి? నీ మనస్సెందుండినది ఏమి? అని అడుగగా అమ్మా! ఒకానొక బ్రాహ్మణ గృహమందు కోరిన కోరికల నిచ్చు సత్యనారాయణ వ్రతము చేయుచుండగా నది చూచుచుంటినని పలికెను. ఆ వాక్యమును తల్లియైన లీలావతి విని సంతోషముతో సత్యనారాయణ వ్రతమును చేయ నుద్యుక్తురాలై బంధువులు స్వజనులు వీరలతో గూడి వ్రతముచేసి యో స్వామీ! నా భర్తయును నల్లుడును శీఘ్రముగ ఇంటికి రావలయును. నా భర్త యొక్క అపరాధమును అల్లుని యొక్క అపరాధమును క్షమింపవలయునని స్తోత్రము చేసెను.

శ్రీ సత్యనారాయణమూర్తి ఆ వ్రతముచే సంతోషించి చంద్రకేతు మహారాజునకు స్వప్నమందు దర్శనమిచ్చి యో చంద్రకేతూ! కారాగృహమునందుంచబడిన వైశ్యులను విడుదల చేయుము. నీచే గ్రహింపబడిన వారి ధనమునిమ్ము. అటుల నివ్వకున్న నీ రాజ్యమును ధనమును పుత్రులను నిన్నును నశింపచేయుచున్నానని శ్రీ నారాయణమూర్తి నుడివి మాయమయ్యెను.

అటువెనుక ప్రాతఃకాలమందు రాజు సర్వజనులతోడి సభా మధ్యమందు గూర్చున్న సమయమునందు తనకు కలిగిన స్వప్నమును జెప్పి బంధింపబడియుండు మహాత్ములగు నా వైశ్యపుత్రులను శ్రీఘ్రముగ విడిపింపుడని చెప్పెను.

రాజు వాక్యమును భటులాలకించి మహాపురుషులగు వైశ్యులను విడిపించి విశేషవినయముతో కూడినవారయి వైశ్యులకు వేయబడిన సంకిళ్ళను వదలించి రాజునెదుట నిలిపిరి.

అనంతరము మహాజనులగు వైశ్యులు చంద్రకేతు మహారాజునకు నమస్కరించి పూర్వ వృత్తాంతమును దలచుచు భీతిచే నేమియు బలుకని వారైరి.

రాజును వారలను జూచి శాంతమును వహించి దైవవశమువలన ఈ దుఃఖము సంభవించినది. ఇపుడు మీకేమియు భయములేదని యూరడించి, క్షౌరకర్మము జేయించి, వస్త్రాలంకారములను ఇచ్చి సంతోషింపజేసి వైశ్యులకు దనచే గ్రహింపబడిన ధనమును ద్విగుణముగ నిచ్చి ఓ సాధూ! నీ యాశ్రమమునకు వెళ్ళుము అని సెలవిచ్చిన నా రాజునకు నమస్కరించి మీ యనుగ్రహమువలన పోయివత్తుమని సెలవు పొందిన వారైరి.

మూడవ అధ్యాయము సమాప్తము.

# చతుర్థోధ్యాయః

## సూత ఉవాచ

శ్లో॥ యాత్రాం కృత్వా తతస్సాధుర్మంగళాచార పూర్వకమ్
బ్రాహ్మణేభ్యో ధనం దత్వా యయౌ స్వనగరం ప్రతి.

తా॥ ఇటుల సాధువగు వైశ్యుడు రాజుయొక్క ఆజ్ఞను పొందినవాడై మంగళాయతన పూర్వకంబుగ బ్రాహ్మణులకు ధనమొసంగి తన ఆశ్రమమునకు బోవుచుండెను.

సత్యనారాయణస్వామి త్రిదండిసన్న్యాసి వేషధారియై ఓ సాధూ! ఏల చింత చేయుచున్నారు. నీ ఓడయందు ఏమి యున్నదని యడిగెను. అపుడు మహాజనులగు వైశ్యులు మదించినవారయి విలాసముగా పరిహసించి ఓ తండ్రీ! యేమి యడుగుచున్నావు. నా యందుండు ధనమును నపహరించుటకే యత్నించు చుంటివా. అట్టిదేమియును లేదు. మా ఓడయందు ఆకులలములు మొదలయినవి యున్నవేగాని మరియొకటి ఏదియును లేదు అని పలుకగా ఆ వాక్యమును వినినవాడయి ఆ సన్న్యాసి ఓ సాధూ! నీవు చెప్పిన వాక్యము సత్యము అవుగాక అని పలికి యాదండి శీఘ్రముగ కొంతదూరముపోయి సముద్రతీరమందు వసించిన వాడాయెను.

ఈ ప్రకారము దండి వెళ్ళిన పిమ్మట సాధువు నిత్యకృత్యముల తీర్చుకొనిన వాడై లేచి యోడయందుండు లతాదికమును జూచి మూర్ఛితుడై బూమియందు పడిన కొంతసేపటికి తెలివిని పొంది పిమ్మట దుఃఖమును పొందెను.

అప్పుడు అల్లుండొక వాక్యమును పలికెను. ఓ మామా! ఎందుకు దుఃఖించుట? దండిచే శాప మివ్వబడినది. ఆ దండి సమస్తమును జేయ శక్తి గలవాడు. ఆ విషయమై సందేహములేదు. కావున అతనిని శరణు వేడుము కోరిన కార్యములు కాగలవని చెప్పెను.

అల్లుని మాటలు విని యీ సాధువు ఆ దండి సమీపమునకు పోయి ఆ దండిని చూచి వినయముతో నాదరణ పూర్వకముగ నమస్కరించి ఓ స్వామీ! మీ సన్నిధియందు ఏ దుర్మార్గము పలుకబడినదో యా యపరాధమును క్షమింపుమా యని మాటిమాటికి నమస్కారమును జేసినవాడయి గొప్ప శోకముచే వ్యాకులుడై విలపించుచుండెను.

ఆ వైశ్యుని జూచి దుఃఖింపకుము, నా మాటను వినుము, నా యొక్క పూజా విముఖుడవైతివి గాన దుర్బుద్ధి గలవాడా, నా యొక్క ఆజ్ఞచే మాటిమాటికి దుఃఖమును కలుగుచున్నదని చెప్పుచున్న భగవంతుని మాటలను విని వైశ్యుడు ఇట్లు స్తోత్రముచేయ నుపక్రమించెను.

ఓ నారాయణమూర్తీ! బ్రహ్మ మొదలైన సమస్త దేవతలు మీ మాయచే మోహితులై మీ యొక్క గుణములను రూపములను గురుతెఱుంగరు గాన మూఢుడనగు నేను మీ మాయచే మోహితుడనై మీ స్వరూపమును ఎటుల తెలిసికొనగలవాడనగుదును. కాన ప్రసన్నుడవు గమ్ము. నా విభవానుసారముగ పూజ చేయుచున్నాను. కావున పూర్వపు ధనము నిచ్చి శరణాగతుడనైన నన్ను రక్షింపుమా యని ప్రార్థించెను.

ఆ సాధువుయొక్క మాటలను నారాయణమూర్తి వినినవాడై కోరిన వరమిచ్చి అచ్చటనే మాయమయ్యెను.

అటు వెనుక ద్రవ్యముచే నిండియుండు ఓడను ఎక్కి సత్యనారాయణుని కరుణచే నా యొక్క కోరిక సఫలమైనది యని చెప్పుచు జనులతో గూడ యథావిధిగా పూజించి సత్యనారాయణస్వామి యొక్క అనుగ్రహమువలన మిక్కిలి సంతోషముగలవాడయి ప్రయత్నముచే ఓడను కదిలించి స్వదేశమునకు ప్రయాణమయిన వాడాయెను.

అటు వెనుక సాధువు అల్లుని చూచి అల్లుడా! మనయొక్క రత్నపురమును జూడుమా యని తన ధనరక్షకుడగు భటుని పిలిపించినవాడాయెను. ఆ భటుడు పట్టణమునకు బోయి సాధువు యొక్క భార్యను జూచి ఇష్టమగు మాటలను

పలికి నమస్కరించి అంజలిబద్ధుడై యీ పట్టణముయొక్క సమీపమందు సాధువు అల్లునితో కూడ వచ్చి బంధువులు, స్వజనులు వీరలతో గూడియున్నాడని చెప్పెను.

ఆ భటుని మాటలను విని మిక్కిలి సంతోషముగలదై ఆమె సత్యనారాయణ పూజ చేసి ఓ కూతురా! సాధువు యొక్క దర్శనమునకు పోవుదము రమ్మని కొమార్తెను పిలిచెను. ఇటుల పిలుచుచున్న తల్లి మాటలను విని తానును ఆ సత్యనారాయణ పూజను చేసి సమాప్తి జెందించి ప్రసాదమును భుజింపకయే తల్లితో గూడ ఆ కళావతియను కన్య భర్తను గూడి వెళ్ళినదాయెను.

అందుచే సత్యనారాయణుండు కోపించినవాడయి ఆమె భర్తను ఓడను ధనముతోగూడ నీటియందు ముంచినవాడాయెను. అటు వెనుక కన్యయగు కళావతి తన పతిని కాననిదై మిక్కిలి దుఃఖముచే రోదనము చేయుచు భూమియందు బడెను.

ఆ కన్యకను ఓడను చూచి సాధువు భయయుక్తమైన మనసుచే నిదియేమి ఆశ్చర్యమని వచించినవాడాయెను. అచ్చట నుండిన తీర్థవాసులు విశేష చింతగలవారైరి. అటువెనుక లీలావతి దుఃఖపరవశురాలై విశేష దుఃఖముచే విలపించుచున్న భర్తను గూర్చి యిట్లు పలికెను.

ఓ స్వామీ! ఇప్పుడు మీ యల్లుడు, ఓడతో కూడ కనబడకపోయెను. ఏ దేవుని విలాసముచే ఓడ అహరింపబడెనో తెలియదు. సత్యనారాయణుని యొక్క మాయను తెలిసికొన శక్తులెవరు అని విలపించెను.

దానిని జూచి తల్లియగు లీలావతియును బంధుజనులును నేకమై యా కన్యను కౌగలించుకొని విశేషముగ రోదనము చేసినవారైరి. పిదప కళావతి యను కన్యక తన పతి నశించుటచే మిగుల దుఃఖముకలదై పెనిమిటి యొక్క పాదుకలను గ్రహించి సహగమనము చేయ నుద్యుక్తురాలాయెను.

ఇటుల నుండు కన్యయొక్క చరిత్రమును చూచి ఆ సాధువు భార్యతో కూడ అధికసోకముచే సంతప్తుడై ఈ మాయ సత్యదేవునిదా లేక సత్యదేవుని యొక్క మాయచే నేను భ్రమించితినా యని చింతించుచు నిట్లని పలికెను.

అయినను మనము సత్యదేవుని పూజను మనయొక్క శక్తికొలది చేయుదమని యందరిని బిలిచి తన కోరిక నందరికి తెలియజేసి సత్యదేవునికి మాటిమాటికి సాష్టాంగ నమస్కారము చేసినవాడాయెను.

ఇటుల ప్రార్థించుచుండ సత్యదేవుడు వైశ్యునియొక్క భర్త విధేయతలను గాంచి, భక్తులయందు వాత్సల్యము గలవాడై సాధువును గూర్చి యీ మాటలు చెప్పదొడంగెను. ఓ సాధూ! నీ కన్య నా ప్రసాదమును త్యజించి నాథుని జూచుటకు వచ్చెను గాన ఆ కాంతయొక్క భర్త కనిపించకపోయెను.

పిదప నా కన్య గృహమునకు వెళ్ళి ప్రసాదమును భక్షించి మరల జని భర్తను జూచినదాయెను. కళావతి తన తండ్రిని సమీపించి శ్రీఘ్రముగ ఇంటికి వెళ్లుదము ఆలస్యము ఎందుకని చెప్పెను.

ఆ కన్యమాట విని సంతుష్టుడై సత్యదేవుని యొక్క పూజను యథావిధిగ జేసి బంధువులతో గూడి నిజగృహమునకు పోయి ఆ మరణాంతము పూర్ణిమ యందును. సంక్రాంతియందును సత్యనారాయణపూజను చేసి ఇహలోకమందు సకల సంపదలు అనుభవించి, చివర సత్యపురమునకు వెళ్ళినవాడాయెను.

*నాల్గవ అధ్యాయము సమాప్తము.*

## పంచమోధ్యాయః

శ్లో॥ అథాన్యత్సం ప్రవక్ష్యామి శృణుధ్వం మునిసత్తమాః॥

మునిశ్రేష్ఠులారా! వేరొక కథను జెప్పుచున్నాను వినుడు.

తా॥ ప్రజలను పాలించుటయందాసక్తిగల తుంగధ్వజుండను రాజొకండు గలడు. అతడు ఒకానొక సమయమందు వనమునకు పోయి అనేక విధముల వన్యమృగములను చంపి మిక్కిలి అలసి యచట నొక వటవృక్షమూలమున నిల్చి దాని మూలమందు సంతుష్టులగు గోపకులు భక్తియుక్తులై బంధువులతో

కూడినవారై సత్యపూజ చేయుచుండగా నా రాజు వారిని చూచి యచట కరుగు క గర్వముచే నమస్కారమును గూడ చేయని వాడాయెను.

పిదప గోపకులు ప్రసాదము రాజసన్నిధి యందుంచి మరల వచ్చినవారై యథేష్టముగ భుజించిరి. రాజు ప్రసాదమును త్యజించుటచే దుఃఖమును పొందినవాడాయెను. ఇటుల నా రాజుయొక్క పుత్రశతమున్ను ధనధాన్యము మొదలగునవియును నశించెను.

పిదప రాజు సత్యదేవుని మాహాత్మ్యముచే నా యొక్క పుత్రపౌత్ర ధనాదులు నశించినవి అని నిశ్చయించి, గోపాలుర సన్నిధికేగి గోపాలకులతో గూడ భక్తి శ్రద్ధలు గలవాడై యథావిధిగ సత్యదేవుని బూజించి అతని యనుగ్రహముచే ధనమును పుత్రులను బడిసి ఇహలోకమందు సుఖము ననుభవించి అంత్యమందు సత్యపురమునకు వెళ్ళినవాడాయెను.

ఎవరు మిక్కిలి దుర్లభమగు సత్యపూజ చేయుచున్నారో వారు సత్యదేవుని కృపచే ధనధాన్యాధికమును బొందుదురు. దరిద్రుడీ వ్రతము చేసిన ధనధాన్య పుత్రపౌత్రాది సంపత్తులను జెందును. బద్ధుడు బంధనమువలన ముక్తుడగును. భీతుడు భయమువలన విడువంబడి కోరిన ఫలమును అనుభవించినవాడై అంత్యమందు సత్యపురమునకేగును.

శౌనకాది మహామునులారా! ఏ వ్రతముచే మనుష్యుడు దుఃఖ విముక్తి గలవాడగునో అట్టి సత్యనారాయణ వ్రతమును జెప్పితిని. విశేషముగ కలియుగమందు సత్యపూజ ఫలప్రదముగ నుండును. కొందరు సత్యదేవుని సత్యేశ్వరుడని, కొందరు సత్యనారాయణుడని, కొందరు సత్యదేవుడని చెప్పుదురు. సత్యదేవుడు నానా రూపముల ధరించి సమస్త జనులకు గోరిన కోరికల నిచ్చువాడై సత్యరూపుడు కాగలడు. కావున ఓ మునిశ్రేష్ఠులారా! యీ వ్రతమును నిత్యము ఎవరు పఠింతురో ఎవరు వినుదురో వారి పాపములు సత్యదేవుని కృపచే నశించుచున్నవని సూతుడు శౌనకాది మహామునులకు జెప్పెను.

ఇట్లు శ్రీ స్కాందపురాణమందలి రెండవ ఖండమందుండు

సత్యనారాయణ వ్రత కథ సమాప్తము.





# శ్రీ వరలక్ష్మీ వ్రతకల్పము



ఓం శ్రీ వరలక్ష్మీదేవ్యైనమః ఆచమ్య ఓం కేశవాయస్వాహా, ఓం నారాయణాయ స్వాహా, ఓం మాధవాయస్వాహా (అని మూడు పర్యాయములు జలమును తీసుకొన వలెను.) ప్రాణాయామం (ముక్కు పట్టుకొని ఈక్రింది మంత్రము చెప్పవలెను) ఓం భూః ఓం భువః ఓం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యం ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనఃప్రచోదయాత్ ఓం ఆపోజ్యోతీరసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్.

(పుష్పాక్షతలు పట్టుకొని ఈక్రింది సంకల్పమును చెప్పవలెను )

మమ ఉపాత్త దురితక్షయద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం అద్యబ్రహ్మణః ద్వితీయ పరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమ పాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన ... సంవత్సరే .... ఋతౌ ..... మాసే ...... పక్షే ....... తిథౌ ...... వాసరే, శుభనక్షత్రే శుభయోగే శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ .... గోత్రం గోత్రవత్యాః నామధేయాయాః (పేరు) సభర్తృకాయాః అస్మాకం సహకుటుంబానాం క్షేమస్థైర్య విజయాయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం ధర్మార్థకామమోక్ష చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థం సత్సంతాన సౌభాగ్య ఫలావాప్త్యర్థం చింతిత మనోరథ సిద్ధ్యర్థం, సర్వకామనా సఫలీకృతార్థం శ్రీవరలక్ష్మీ ప్రీత్యర్థం, శ్రీవరలక్ష్మీ ముద్దిశ్య కల్పోక్త విధానేన యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజామహం కరిష్యే. తదంగ శ్రీమహాగణపతి పూజామహంకరిష్యే. (అని చెప్పి చేతిలో ఉన్న పుష్పములు అక్షతలు అమ్మవారిపై వేయవలెను.) తదంగ కలశపూజాం కరిష్యే. ( కలశమునకు గంధము కుంకుమబొట్టుపెట్టి కలశముపై కుడిచేతిని ఉంచి ఈక్రింది మంత్రమును చెప్పవలెను.)

శ్లో॥ కలశస్య ముఖేవిష్ణుః కంఠే రుద్రస్సమాశ్రితః ।
మూలే తత్రస్థితో బ్రహ్మ మధ్యే మాతృ గణాస్స్మృతాః ॥

కుక్షౌతు సాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా ।
ఋగ్వేదోఽథ యజుర్వేదః సామవేదో హ్యథర్వణః ॥

అంగైశ్చసహితాః సర్వే కలశాంబు సమాశ్రితాః ।
ఆయాన్తు శ్రీ వరలక్ష్మీ పూజార్థం దురితక్షయకారకాః ॥

గంగేచ యమునేకృష్ణే గోదావరి సరస్వతీ ।
నర్మదే సింధుకావేర్యా జలేఽస్మిన్ సన్నిధిం కురు ॥

అని చెప్పి పుష్పముతో కలశములోని జలమును పూజావస్తువులపై, దేవునిపై తనపై చల్లుకొనవలెను.

**గమనిక :-** మంటపము మాదిరిగా తయారుచేసి అందులో వరలక్ష్మీ ఫోటో పెట్టి అలంకరణ చేసి, పటము ముందు ఒక నూతన తెలుపు తుండు పరచి దానిపై బియ్యం పోసి దానిపై తమలపాకులు ఉంచి, కలశమును గంధకుంకుమలతో అలంకరించి, ఆ కలశములో చిల్లర రూపాయలు3, బంగారము, పసుపు, సుగంధ ద్రవ్యములు, జలము, పన్నీరు వేసి కలశముపై మామిడి మండలు, కొబ్బరికాయ, ఎరుపురవికె, పుష్పమాల ఉంచి మండపముపై పెట్టవలెను.

( కలశముపై తమలపాకును ఉంచి ఈక్రింది మంత్రము చెప్పవలెను.)

## ప్రాణ ప్రతిష్ఠా

అసునీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణమిహనో ధేహిభోగం । జ్యోక్పశ్యేమ సూర్య ముచ్చరన్త మనుమతే మృడయాన స్వస్తి. అమృతంవై ప్రాణా అమృతమాపః ప్రాణానేవ యథాస్థాన ముపహ్వాయతే॥ (అని చేతులు తీసివేయవలెను) హేస్వామినీ, సర్వజగన్నాయికే యావత్పూజావసానకం తావత్త్వం ప్రీతిభావేన కలశేఽస్మిన్ చిత్రేఽస్మిన్ సన్నిధింకురు. ఆవాహితోభవ, స్థాపితోభవ, సుప్రసన్నోభవ, వరదోభవ, అవకుంఠితోభవ, స్థిరాసనంకురు ప్రసీద, ప్రసీద, ప్రసీద (అని పుష్పాక్షతలు కలశముపై చిత్రముపై వేయవలెను.)

## అథధ్యానమ్

శ్లో॥ పద్మాసనే పద్మకరే సర్వలోకైక పూజితే ।
నారాయణప్రియే దేవి సుప్రీతా భవ సర్వదా ॥
క్షీరోదార్ణవ సంభూతే కమలే కమలాలయే
సుస్థిరా భవమే గేహే సురాసుర నమస్కృతే ॥
శ్రీ వరలక్ష్మీదేవ్యైనమః ధ్యానం సమర్పయామి

శ్లో॥
ఆవాహయామి దేవీ త్వాం సుప్రీతా భవ సర్వదా ॥
శ్రీ వరలక్ష్మీ దేవ్యైనమః మావాహయామి

శ్లో॥ సూర్యాయుత నిభస్ఫూర్తే స్ఫురద్రత్న విభూషితే ।
సింహాసనమిదం దేవీ గృహ్యతాం సమర్పయామి ॥
శ్రీ వరలక్ష్మీదేవ్యైనమః రత్నసింహాసనం సమర్పయామి

శుద్ధోదకంచ పాత్రస్థం గంధపుష్పాది మిశ్రితం ।
అర్ఘ్యం దాస్యామి తే దేవి గృహ్యతాం హరివల్లభే ॥
శ్రీ వరలక్ష్మీ దేవ్యైనమః అర్ఘ్యం సమర్పయామి.

సువాసితజలం రమ్యం సర్వతీర్థం సముద్భవం।
పాద్యం గృహాణ దేవి త్వం సర్వదేవ నమస్కృతే ॥
శ్రీవరలక్ష్మీ దేవ్యైనమః పాద్యం సమర్పయామి.

శ్లో॥ సువర్ణకలశానీతం చందనాగరు సంయుతం ।
గృహాణాచమనం దేవి మయాదత్తం శుభప్రదే ॥
శ్రీ వరలక్ష్మీ దేవ్యైనమః ఆచమనీయం సమర్పయామి.

శ్లో॥ పయోదధి ఘృతోపేతం శర్కరా మధుసంయుతం ।
పంచామృత స్నానమిదం గృహాణ కమలాలయే ॥
శ్రీ వరలక్ష్మీ దేవ్యైనమః పంచామృతస్నానం సమర్పయామి.

గంగాజలం మయాఽనీతం మహాదేవ శిరస్థితం ।
శుద్ధోదక స్నానమిదం గృహాణ పరమేశ్వరి ॥
శ్రీవర .... శుద్ధోదకస్నానం సమర్పయామి.

శో॥ సురార్చితాంఘ్రి యుగళేదుకూల వసనప్రియే ।
వస్త్రయుగ్మం ప్రదాస్యామి గృహాణ సురపూజితే ॥
శ్రీవర ...వస్త్రయుగ్మం సమర్పయామి.

శ్లో॥ కేయూరకంకణాదేవి హార నూపుర మేఖలాః ।
విభూషణాన్య మూల్యాని గృహాణ ఋషిపూజితే ॥
శ్రీ వర ... ఆభరణాన్ సమర్పయామి.

శ్లో॥ తప్త హేమకృతం దేవి మాంగళ్యం మంగళప్రదం
మయాసమర్పితం దేవి గృహాణ త్వం శుభప్రదే ॥
శ్రీవర ... మాంగళ్యం సమర్పయామి.

శ్లో॥ కర్పూరాగరు కస్తూరీ రోచనాది సుసంయుతం ।
గంధం దాస్యామి తే దేవి స్వీకురుష్వ శుభప్రదే ॥
శ్రీవర ... గంధం సమర్పయామి.

శ్లో॥ అక్షతాన్ ధవళాన్ దివ్యాన్ శాలీయాన్ తండులాన్ శుభాన్ ।
హరిద్రాకుంకుమోపేతాన్ స్వీకురుష్వాబ్ధిపుత్రికే ॥
శ్రీ వర ... అక్షతాన్ సమర్పయామి.

శ్లో॥ మల్లికా జాజికుసుమై శ్చంపకై ర్వకుళైరపి।
శతపత్రైశ్చ కల్హారైః పూజయామి హరిప్రియే ॥
శ్రీ వర... పుష్పాణి సమర్పయామి.

ఇచ్చట లక్ష్మీ అష్టోత్తర శతనామములతో అర్చన చేయవలెను. 65 పే॥లో చూడుము

శ్లో॥ దశాంగం గుగ్గులోపేతం సుగంధంచ మనోహరం ।
లక్ష్మి ధూపం దాస్యామి దేవేశి గృహాణ కమలప్రియే ॥
శ్రీ వరలక్ష్మి దేవ్యైనమః ధూపమాఘ్రాపయామి.

శ్లో॥ ఘృతవర్తి సమాయుక్తం అంధకార వినాశకం ।
దీపం దాస్యామి తే దేవీ గృహాణ ముదితా భవ ॥
శ్రీ వర... దీపం దర్శయామి.

శ్లో॥ నైవేద్యం షడ్రసోపేతం దధిమాధ్వాజ్య సంయుతం ।
నానాభక్ష్య ఫలోపేతం గృహాణ హరివల్లభే ॥
శ్రీ వర... నై వేద్యం సమర్పయామి.

శ్లో॥ పూగీఫల సమాయుక్తం నాగవల్లీ దలైర్యుతం ।
కర్పూరచూర్ణసంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం॥
శ్రీ వర... తాంబూలం సమర్పయామి.

శ్లో॥ నీరాజనం సమానీతం కర్పూరేణ సమన్వితం ।
తుభ్యం దాస్యామ్యహం దేవీ గృహ్యతాం విష్ణువల్లభే ॥
శ్రీ వర ... నీరాజనం సమర్పయామి.

శ్లో॥ పద్మాసనే పద్మకరే సర్వలోకైక పూజితే ।
నారాయణప్రియే దేవీ సుప్రీతా భవ సర్వదా॥

(మంత్ర పుష్పమును విశేషముగా చెప్పదలచినవారు 20 పేజీలో చూడుము.)

శ్రీవర ... మంత్రపుష్పం సమర్పయామి.

శ్లో॥ యానికాని చ పాపాని జన్మాంతర కృతాని చ ।
తాని తాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే॥
పాపోஉహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవ ।
త్రాహి మాం కృపయా దేవి శరణాగతవత్సలా ॥
అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ ।
తస్మాత్కారుణ్యభావేన రక్ష రక్ష జనార్దన ॥

శ్రీ వర ... నమస్కారాన్ సమర్పయామి.

తోరపూజ:- (తోరమును అమ్మవారివద్దవుంచి అక్షతలతో యీక్రింది విధముగా పూజింపవలెను)

కమలాయై నమః ప్రథమగ్రంథిం పూజయామి. రమాయై నమః ద్వితీయ గ్రంథిం పూజయామి, లోకమాత్రే నమః తృతీయ గ్రంథిం పూజయామి, విశ్వజనన్యై నమః చతుర్థ గ్రంథిం పూజయామి, వరలక్ష్మై నమః పంచమ గ్రంథి పూజయామి. క్షీరాబ్ధి తన యాయ నమః షష్ట గ్రంథిం పూజయామి. విశ్వసాక్షిణ్యైనమః సప్తమ గ్రంథిం పూజయామి, చన్ద్రసోదర్యైనమః అష్టమ గ్రంథిం పూజయామి. వరలక్ష్మైనమః నవమ గ్రంథిం పూజయామి.

ఈ క్రింది శ్లోకము చదువుచూ తోరము కుడిచేతికి కట్టుకొనవలెను.

శ్లో॥ బధ్నామి దక్షిణేహస్తే నవసూత్రం శుభప్రదం ।
పుత్ర పౌత్రాభి వృద్ధిం చ సౌభాగ్యం దేహి మే రమే ॥

వాయన దానము :- వాయన మిచ్చినపుడు ఈక్రింది శ్లోకమును చదువుచూ నివ్వవలెను. వాయనమనగా:- ముత్తైదువులకు పసుపు కుంకుమ, రవికె, పండ్లు, దక్షిణ, పుస్తకము పళ్లెంలో పెట్టి దానము చేయుట.

శ్లో॥ ఇందిరా ప్రతిగృహ్ణాతు ఇందిరా వై దదాతి చ ।
ఇందిరా తారకోభాభ్యాం ఇందిరాయై నమోనమః ॥

(అని వాయన మిచ్చి అక్షతలు పుచ్చుకొని వ్రతకథను చదువుకొనవలయును.)

పూజావిధానము సమాప్తము.

# కథాప్రారంభము

సూతపౌరాణికుండు, శౌనకుడు మొదలగు మహర్షులను జూచి యిట్లనియె "మునివర్యులారా! స్త్రీలకు సర్వసౌభాగ్యములు కలుగునట్టి యొక వ్రతరాజంబును పరమేశ్వరుడు పార్వతీదేవికి జెప్పె. దానిని జెప్పెద వినుడు. కైలాస పర్వతమున వజ్రవిద్రుమ వైఢూర్యాది మణిగణ ఖచితంబగు సింహాసనంబునందు పరమేశ్వరుండు కూర్చుండియుండ, పార్వతీదేవి పరమేశ్వరునకు నమస్కరించి, దేవా! లోకంబున స్త్రీలు ఏ వ్రతం బొనర్చిన సర్వసౌభాగ్యంబును పుత్రపౌత్రాదులు గలిగి సుఖంబుగ నుందురో, అట్టి వ్రతంబు నా కానతీయవలయును. స్త్రీలకు పుత్రపౌత్రాది సంపత్తులు గలుగ జేసెడి వరలక్ష్మీ వ్రతంబను నొక వ్రతంబు గలదు. ఆ వ్రతంబును శ్రావణమాస శుక్లపక్ష పూర్ణిమకు ముందుగ వచ్చెడి శుక్రవారమునాడు చేయవలయు" ననిన పార్వతీదేవి యిట్లనియె. ఓ లోకారాధ్యా! నీ వానతిచ్చిన వరలక్ష్మీ వ్రతంబును ఎట్లు చేయవలయును? ఆ వ్రతంబునకు విధియేమి? ఏ దేవతను పూజింప వలయును. పూర్వం బెవరిచే నీవ్రతం బాచరింపబడియె? వీనినెల్ల వివరంబుగా వచియింపవలయునని ప్రార్థించిన పరమేశ్వరుండు పార్వతీదేవిని గాంచి, "ఓ కాత్యాయనీ! వరలక్ష్మీ వ్రతము సవిస్తరంబును జెప్పెద వినుము. మగధ దేశంబున కుండినంబను నొక పట్టణము గలదు. అ ప్పట్టణము బంగారు ప్రాకారంబుల తోడను, బంగారు గోడలు గల యిండ్లతోడను కూడియుండు నట్టి పట్టణమునందు చారుమతి యను నొక

బ్రహ్మణ స్త్రీ గలదు. ఆ వనితామణి పెనిమిటిని దేవునితో సమానునిగా దలంచి ప్రతి దినంబును నుదయంబున మేల్కొంచి స్నానంబుచేసి పుష్పంబులచే పెనిమిటిని పూజచేసి పిదప నత్తమామలకు అనేక విధంబులైన యుపచారంబులను జేసి యింటి పనులను జేసికొని గయ్యాళిగాక మితముగాను ప్రియముగాను భావించుచు నుండెను.

ఇట్లుండ అమ్మహా పతివ్రతయును మహాలక్ష్మికి యనుగ్రహము గలిగి యొకనాడు స్వప్నంబున ప్రసన్నయై ఓ చారుమతీ! నేను వరలక్ష్మీదేవిని, నీయందు నాకు అనుగ్రహము గలిగి ప్రత్యక్షమైతిని. శ్రావణ శుక్ల పూర్ణిమకు ముందుగా వచ్చెడు శుక్రవారమునాడు నన్ను పూజించిన నీవు కోరిన వరంబుల నిచ్చెదనని వచించిన, చారుమతీదేవి స్వప్నంబులోనే వరలక్ష్మీదేవికి ప్రదక్షిణ నమస్కారములు చేసి "నమస్తే సర్వలోకానాం జనన్యై పుణ్యమూర్తయే. శరణ్యే త్రిజగద్వంద్యే విష్ణువక్ష స్థలాలయే" అని యనేక విధంబుల స్తోత్రము చేసి, ఓజగజ్జననీ! నీకటాక్షంబు గలిగెనేని జనులు ధన్యులుగను, విద్వాంసులుగను, సకల సంపన్నులుగను నయ్యెదరు. నేను జన్మాంతరంబున జేసిన పుణ్య విశేషములను మీ పాదదర్శంబు నాకు గలిగెనని చెప్పిన మహాలక్ష్మి సంతోషంబు జెంది చారుమతికి ననేక వరంబులిచ్చి యంతర్ధానంబునొందె. చారుమతి తక్షణంబున నిదుర మేల్కొని యింటికి నాలుగు ప్రక్కలం జూచి వరలక్ష్మీదేవిని గానక, ఓహో! మనము కలగంటిమని యీ స్వప్న వృత్తాంతమును పెనిమిటికి మామగార్కి మొదలయిన వాండ్రతో జెప్ప. వారు ఈ స్వప్నము మిగుల నుత్తమైనది. శ్రావణ మాసంబు వచ్చినతోడనే వరలక్ష్మీవ్రతం బవశ్యంబుగ జేయవలసినదని చెప్పిరి. పిమ్మట చారుమతియును, స్వప్నంబు విన్న స్త్రీలును శ్రావణమాస మెప్పుడు వచ్చునాయని యెదురుచూచుచుండిరి. ఇట్లుండగా వీరి భాగ్యోదయంబువలన శ్రావణమాస పూర్ణిమకు ముందుగ వచ్చెడి శుక్రవారము వచ్చెను. అంత చారుమతి మొదలగు స్త్రీ లందరును ఈ దినంబేగదా వరలక్ష్మీదేవి చెప్పిన దినంబని. యుదయంబుననే మేల్కొంచి స్నానము జేసి చిత్రవస్త్రంబులం గట్టుకొని, చారుమతీదేవి గృహంబున నొక ప్రదేశమునందు గోమయంబుచే నలికి మంటపం బేర్పఱచి, అందొక ఆసనంబు వైచి దానిపై క్రొత్త బియ్యము పోసి మఱ్ఱి చిగుళ్ళు మొదలగు పంచవల్ల వంబులచే కలశం బేర్పఱచి యందు వరలక్ష్మీదేవిని ఆవాహనము చేసి, చారుమతి మొదలగు స్త్రీలందరు మిగుల భక్తియుక్తులై సాయంకాలంబు "పద్మాసనే పద్మకరే

సర్వలోకైక పూజితే. నారాయణప్రియే దేవీ సుప్రీతా భవసర్వదా” అను నీ శ్లోకంబుచే ధ్యానావాహనాది షోడశోపచార పూజలం జేసి, తొమ్మిది సూత్రంబులు గల తోరంబును దక్షిన హస్తంబున గట్టుకొని వరలక్ష్మీదేవికి నానావిధ భక్ష్య భోజ్యంబులను నివేదనముచేసి ప్రదక్షిణంబు చేసిరి. ఇట్లొక ప్రదక్షిణము చేయగానే ఆ స్త్రీల కందటికి కాళ్ళయందు ఘల్లుఘల్లుమను నొక శబ్దంబు గలిగె. అంత కాళ్ళం జూచికొనిన గజ్జెలు మొదలగు నాభరణములు గలిగియుండగ చారుమతి మొదలగు స్త్రీలందరును ఓహో! వరలక్ష్మీదేవి కటాక్షమువలన గలిగినవని పరమానందంబు నొంది మఱియొక ప్రదక్షిణంబు చేయ హస్తములందు ధగద్ధగాయమానంబుగ పొలయుచుండు నవతర్న ఖచితంబులైన కంకరణములు మొదలగు నాభరణము లుండుటం గనిరి. ఇంక చెప్పలేక! మూడవ ప్రదక్షిణంబు గావించిన తోడనే యా స్త్రీలందరు సర్వభూషణాలం కృతులైరి. చారుమతి మొదలగు నా స్త్రీల గృహంబులెల్ల స్వర్ణ మయంబులై రథగజతురగ వాహనంబులతోడ నిండియుండెను. అంత నా స్త్రీలం దోడ్కొని గృహంబులకు తరువాత లేదు. బోవుటకు వారివారి యిండ్ల నుండి గుఱ్ఱములు, ఏనుగులు, రథములు, బండ్లును నా స్త్రీలు వరలక్ష్మీదేవిని పూజించు స్థలంబునకు వచ్చి నిండి యుండెను. పిదప చారుమతి మొదలగు స్త్రీలందరు తమకు కల్పోక్త ప్రకారముగ పూజజేయించిన బ్రాహ్మణోత్తముని గంధపుష్పాక్షతలచే బూజించి పండ్రెండు కుడుములు వాయనదానం బిచ్చి దక్షిణ తాంబూలంబు లొసంగి నమస్కారము చేసి, యాబ్రాహ్మణోత్తమునిచే నాశీర్వాదంబు నొంది వరలక్ష్మీదేవికి నివేదనము చేసిన భక్ష్యాదులను బంధువులతోడ నెల్లరును భుజించి తమకొఱకు వచ్చి కాచుకొనియుండెడు గుఱ్ఱములు ఏనుగులు మొదలగు వాహనముల నెక్కి తమ తమ యిండ్లకు బోవుచు ఒకరితో నొకరు ఓహో! చారుమతీదేవి భాగ్యంబేమని చెప్పవచ్చును. వరలక్ష్మీదేవి తనంతటనే స్వప్నములో వచ్చి ప్రత్యక్షం బాయెను. ఆ చారుమతీదేవిని మిక్కిలి పొగుడుచు తమ తమ యిండ్లకు బోయిరి. పిదప చారుమతి మొదలగు స్త్రీలందరును ప్రతి సంవత్సరము నీ వ్రతంబుసేయుచు పుత్రపౌత్రాభివృద్ధి గలిగి ధన కనక వస్తు వాహనంబుల తోడం గూడుకొని సుఖంబుగ నుండిరి. కావున ఓ పార్వతీ! ఈ యుత్తమమైన వ్రతమును బ్రాహ్మణాది నాలుగు జాతులవారును జేయవచ్చును. అట్లొనర్చిన సర్వ సౌభాగ్యంబులను గలిగి సుఖంబుగ నుందురు. ఈ కథను వినువారలకును

చదువువారలకును వరలక్ష్మీ ప్రసాదమువలన కార్యంబులు సిద్ధించును.

పునః పూజచేసి, తీర్థ ప్రసాదములు తీసుకొని, ఉద్వాసన చెప్పవలెను.

వరలక్ష్మీ వ్రతకల్పము సమాప్తము

# శ్రీ అష్టలక్ష్మి స్తోత్రమ్

## ఆదిలక్ష్మి

సుమనసవందిత సుందరి మాధవి * చంద్రసహోదరి హేమమయే
మునిగణమండిత మోక్ష ప్రదాయిని * మంజుల భాషిణి వేదనుతే
పంకజవాసిని దేవ సుపూజిత * సద్గుణ వర్షిణి శాంతియుతే
జయ జయ హేమధుసూదన కామిని ఆదిలక్ష్మీ సదా పాలయమామ్ ॥

## ధాన్యలక్ష్మి

అయికలి కల్మష నాశిని కామిని * వైదిక రూపిణి వేదమయే
క్షీర సముద్భవ మంగళ రూపిణి * మంత్రనివాసిని మంత్రనుతే
మంగళదాయిని అంబుజవాసిని * దేవగణాశ్రిత పాదయుతే
జయ జయ హే మధుసూదన కామిని ధాన్యలక్ష్మీ సదాపాలయమామ్ ॥

## ధైర్యలక్ష్మి

జయవరవర్ణిని వైష్ణవి భార్గవి * మంత్ర స్వరూపిణి మంత్రమయే
సురగణ పూజిత శీఘ్రఫలప్రద * జ్ఞానవికాసిని శాస్త్రమతే
భవభయహారిణి పాపవిమోచని * సాధు జనాశ్రిత పాదయుతే
జయ జయ హేమధుసూదన కామిని ధైర్యలక్ష్మి సదాపాలయమామ్ ॥

## గజలక్ష్మి

జయ జయ దుర్గతినాశిని కామిని * సర్వఫలప్రద శాస్త్రమయే
రథగజ తురగపదాది సమావృత * పరిజన మండిత లోకమతే
హరిహర బ్రహ్మ సుపూజిత సేవిత * తాప నివారిణి పాదయుతే
జయ జయ హేమధుసూదన కామిని గజలక్ష్మీసదా పాలయమామ్ ॥

## సంతానలక్ష్మి

అయి ఖగవాహిని మోహిని చక్రిణి * రాగవివర్ధిని జ్ఞానమయే
గుణగణవారధి లోకహితైషిణి * స్వరసప్త భూషిత గానసుతే
సకల సురాసుర దేవమునీశ్వర * మానవ వందిత పాదయుతే
జయ జయ హేమధుసూదన కామిని సంతానలక్ష్మి పాలయమామ్ ॥

## విజయలక్ష్మి

జయ కమలాసని సద్గతిదాయిని * జ్ఞాన వికాసిని గానమయే
అనుదిన మర్చిత కుంకుమధూసర * భూషిత వాసిత వాద్యనుతే
కనకధరాస్తుతి వైభవ వందిత * శంకర దేశిక మాన్యపదే
జయ జయ హేమధుసూదన కామిని విజయలక్ష్మి సదాపాలయమామ్ ॥

## విద్యాలక్ష్మి

ప్రణత సురేశ్వరి భారతి భార్గవి * శోకవినాశిని రత్నమయే
మణిమయ భూషిత కర్ణ విభూషణ శాంతి సమావృత హాస్యముఖే
నవనిధి దాయిని కలిమలహారిణి * కామిత ఫలప్రద హస్తయుతే
జయజయ హేమధుసూదన కామిని విద్యాలక్ష్మి సదాపాలయమామ్ ॥

## ధనలక్ష్మి

ధిమిధిమి ధింధిమి ధింధిమి * దుందుభినాద సంపూర్ణమయే
ఘుమఘుమ ఘుంఘుమ ఘుంఘుమ శంఖనినాద సువాద్యనుతే
వేదపురాణేతిహాస సుపూజిత * వైదికమార్గ ప్రదర్శయుతే
జయజయ హేమధుసూదన కామిని ధనలక్ష్మి రూపేణ పాలయమామ్ ॥

## ఫలశ్రుతి

శ్రీ మహాలక్ష్మి మంత్రము అష్టలక్ష్మి స్తోత్రమునందిమిడియున్నది. గనుక దీనిని ప్రతి దినము పఠించు వారలకు అష్టైశ్వర్యములు, సకల ఆయురారోగ్యములు కలుగును. ఆదిలక్ష్మి, ధాన్యలక్ష్మి, ధైర్యలక్ష్మి, గజలక్ష్మి, సంతానలక్ష్మి, విజయలక్ష్మి, విద్యాలక్ష్మి, ధనలక్ష్మి స్వరూపిణియైన శ్రీ మహాలక్ష్మీదేవిని ఈ స్తోత్రముచే పారాయణ.చేయువారు దేవీ కృపకు పాత్రులగుదురు.



# వినాయక వ్రతకల్పము



శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే.

ఓం కేశవాయస్వాహా, నారాయణాయస్వాహా, మాధవాయస్వాహా, (అని మూడుసార్లు జలమును పుచ్చుకొని), గోవిందాయనమః (అని చేయకడగవలెను.)

ప్రాణాయామ్ ముక్కు పట్టుకొని ఈక్రింది మంత్రము చెప్పవలెను.

ఓం భూః ఓం భువః ఓం సువః ఓం మహః ఓం జనః ఓంతపః ఓగ్ం సత్యం, ఓం తత్సవితుర్వరేణ్యంభర్గో దేవస్యధీమహి। ధియోయోనః ప్రచోదయాత్। ఓం ఆపోజ్యోతీరసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్ ॥

(పుష్పాక్షతలు చేతిలోపట్టుకొని ఈ క్రింది సంకల్పము చెప్పవలెను.)

శుభే శోభనముహూర్తే సంకల్పం అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేత వరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే అస్మిన్ వర్తమానే వ్యావహారిక ప్రభవాది షష్ఠిసంవత్సరాణాం మధ్యే ... సంవత్సరే దక్షిణాయనే వర్ష ఋతౌ భాద్రపదమాసే శుక్లపక్షే చతుర్థ్యాం ... వాసరయుక్తాయాం ... శుభనక్షత్ర .... శుభయోగ ... శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం అస్యాం శుభతిథౌ శ్రీమాన్ శ్రీమతః గోత్రస్య - గోత్రవత్యాః నామధేయస్య - నామధేయాయాః (అని మీగ్రోతం పేరు చెప్పవలెను) మమ ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫల పురుషార్థ సిధ్యర్థం, పుత్రపౌత్రాభివృద్ధ్యర్థం, సర్వాభీష్ట సిధ్యర్థం సమస్త మంగళావాప్త్యర్థం వర్షే వర్షే ప్రయుక్త వరసిద్ధివినాయక దేవతాముద్దిశ్య సిద్ధివినాయక ప్రీత్యర్థం కల్పోక్త ప్రకారేణ యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజామహం కరిష్యే.

## అథ షోడశోపచార పూజా

భవసంచిత పాపౌఘ విధ్వంసన విచక్షణం।
విఘ్నాంధకారభాస్వంతం విఘ్నరాజ మహం భజే ॥
ఏకదంతం శూర్పకర్ణం గజవక్త్రం చతుర్భుజమ్ ।
పాశాంకుశ ధరం దేవం ధ్యాయే త్సిద్ధివినాయకమ్ ॥

శ్రీ మహాగణాధిపతయే నమః ధ్యాయామి. అని నమస్కారము చేయవలెను.

అత్రాగచ్ఛ జగద్వంద్య సురరాజార్చి తేశ్వర ।
అనాథనాథ సర్వజ్ఞ గౌరీగర్భసముద్భవ॥

శ్రీ మహాగణాధిపతయే నమః ఆవాహయామి అని పుష్పాక్షతలు వేయవలెను.

మౌక్తికైః పుష్యరాగైశ్చ నానారత్నైర్విరాజితం ।
రత్నసింహాసనం చారు ప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం ॥

శ్రీ మహాగణాధిపతయే నమః ఆసనం సమర్పయామి అని అక్షతలు వేయవలెను.

గౌరీపుత్ర నమస్తేస్తు శంకరప్రియనందన।
గృహాణార్ఘ్యం మయాదత్తం గంధపుష్పాక్షతైర్యుతం॥

శ్రీ మహాగణాధిపతయే నమః అర్ఘ్యం సమర్పయామి. అని జలము చల్లవలెను

గజవక్త్ర నమస్తేఽస్తు సర్వాభీష్ట ప్రదాయక ।
భక్త్యా పాద్యం మయాదత్తం గృహాణ ద్విరదానన ॥

శ్రీ మహాగణాధిపతయే నమః పాద్యం సమర్పయామి. (అని జలమును వేయవలెను.)

అనాథనాథ సర్వజ్ఞ గీర్వాణపరిపూజిత ।
గృహాణాచమనం దేవ తుభ్యం దత్తం మయా ప్రభో ॥

శ్రీ మహాగణాధిపతయే నమః ఆచమనీయం సమర్పయామి, (అని జలమును వేయవలెను.)

దధిక్షీరసమాయుక్తం మధ్వాజ్యేన సమన్వితం ।
మధుపర్కం గృహాణేదం గజవక్త్ర నమోస్తుతే ॥
శ్రీ మహాగణాధిపతయే నమః పంచామృతస్నానం సమర్పయామి.

(విగ్రమున్నచో అభిషేకము చేయవలెను.)

గంగాదిసర్వతీర్థేభ్య ఆహృతై రమలై ర్జలైః ।
స్నానం కరిష్యే భగవ న్నుమాపుత్ర నమోఽస్తుతే ॥

శ్రీ మహాగణాధిపతయే నమః శుద్ధోదకస్నానం సమర్పయామి. అని

స్నానము చేయవలెను.

రక్తవస్త్రద్వయం చారు దేవయోగ్యం చ మంగళం ।
శుభప్రదం గృహాణ త్వం లంబోదర హరాత్మజ ॥

శ్రీ మహాగణాధి పత యే నమః వస్త్రయుగ్మం సమర్పయామి. అని వస్త్రము దేవునిపై ఉంచవలెను.

రాజితం బ్రహ్మసూత్రం కాంచనం చోత్తరీయకం ।
గృహాణ సర్వధర్మజ్ఞ భక్తానా మిష్టదాయక ॥

శ్రీ మహాగణాధిపతయే నమః యజ్ఞోపవీతం సమర్పయామి. అని దేవునిపై ఉంచవలెను.

చందానాగరుకర్పూర కస్తూరీ కుంకుమాన్వితం ।
విలేపనం సురశ్రేష్ఠ ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్ ॥

శ్రీ మహాగణాధిపతయే నమః గంధం సమర్పయామి. గంధము బొట్టు పెట్టవలెను.

అక్షతాన్ ధవళాన్ దివ్యాన్ శాలీయాం స్తండులాన్ శుభాన్ ।
గృహాణ పరమానంద శమ్భుపుత్ర నమోస్తుతే ॥

శ్రీ మహాగణాధిపతయేనమః అక్షతాన్ సమర్పయామి. అని అక్షతలు వేయవలెను.

సుగంధాని సుపుష్పాణి జాజీకుందముఖానిచ ।
ఏకవింశతిపత్రాణి సంగృహాణ నమోస్తుతే ॥

శ్రీ మహాగణాధిపతయే నమః పుష్పైః పూజయామి.

(ఈక్రింది నామాలు చెప్పినప్పుడు పుష్పాలు అక్షతలు వేయవలెను.)

## అథ అంగపూజ

| | | |
|---|---|---|
| గణేశాయ నమః | పాదౌ | పూజయామి |
| ఏకదంతాయ నమః | జానునీ | " |
| విఘ్నరాజాయ నమః | జంఘే | " |
| ఆఖువాహనాయ నమః | ఊరూ | " |

| | | |
|---|---|---|
| హేరంబాయ నమః | కటిం | " |
| లంబోదరాయ నమః | ఉదరం | " |
| గణనాథాయ నమః | నాభిం | " |
| గణేశాయ నమః | హృదయం | " |
| స్థూలకంఠాయ నమః | కంఠం | " |
| స్కంధాగ్రజాయ నమః | స్కంధౌ | " |
| పాశహస్తాయ నమః | హస్తౌ | " |
| గజవక్త్రాయ నమః | వక్త్రం | " |
| విఘ్నహంత్రే నమః | నేత్రం | " |
| శూర్పకర్ణాయ నమః | కర్ణౌ | " |
| ఫాలచంద్రాయ నమః | లలాటం | " |
| సర్వేశ్వరాయ నమః | శిరః | " |
| విఘ్నరాజాయ నమః | సర్వాణ్యంగాని పూజయామి. | |

## అథ ఏకవింశతి (21) పత్ర పూజా

| | | |
|---|---|---|
| సుముఖాయ నమః | మాచీపత్రం | పూజయామి |
| గణాధిపాయ నమః | బృహతీపత్రం | " |
| ఉమాపుత్రాయ నమః | బిల్వపత్రం | " |
| గజాననాయ నమః | దూర్వాయుగ్మం | " |
| హరసూనవే నమః | దుత్తూరపత్రం | " |
| లంబోదరాయ నమః | బదరీపత్రం | " |
| గుహాగ్రజాయ నమః | అపామార్గపత్రం | " |
| గజకర్ణాయ నమః | తులసీపత్రం | " |
| ఏకదంతాయ నమః | చూతపత్రం | " |
| వికటాయ నమః | కరవీరపత్రం | " |
| భిన్నదంతాయ నమః | విష్ణుక్రాంతపత్రం | " |
| వటవే నమః | దాడిమీపత్రం | " |
| సర్వేశ్వరాయ నమః | దేవదారుపత్రం | " |

| | | |
|---|---|---|
| ఫాలచంద్రాయ నమః | మరువకపత్రం | " |
| హేరంబాయ నమః | సింధువారపత్రం | " |
| శూర్పకర్ణాయ నమః | జాజీపత్రం | " |
| శూర్పాగ్రజాయ నమః | గండకీపత్రం | " |
| ఇభవక్త్రాయ నమః | శమీపత్రం | " |
| వినాయకాయ నమః | అశ్వత్థపత్రం | " |
| సురసేవితాయ నమః | అర్జునపత్రం | " |
| కపిలాయ నమః | అర్కపత్రం | " |

(ఇచ్చట గణపతి అష్టోత్తర శతనామములతో అర్చన చేయవలెను. 45 పేజీ చూడుము.)

దశాంగం గుగ్గులోపేతం సుగంధం సుమనోహరం।
ఉమాసుతం నమస్తుభ్యం గృహాణ వరదో భవ॥
ధూప మాఘ్రాపయామి. (అగరుబత్తీలు వెలిగించి స్వామికి చూపవలెను.)

పాద్యంత్రివర్తిసంయుక్తం వహ్నినా ద్యోతితం మయా।
గృహాణ మంగళం దీప మీశపుత్ర నమోస్తుతే॥
దీపం దర్శయామి. (నెయ్యి వత్తిదీపం వెలిగించవలెను.)

సుగన్ధాన్ సుకృతాంశ్చైవ మోదకాన్ ఘృతపాచితాన్।
నై వేద్యం గృహ్యతాం దేవ చణముద్గైః ప్రకల్పితాన్॥

భక్ష్యం భోజ్యంచ లేహ్యంచ చోష్యం పానీయ మేవచ।
ఇదం గృహాణ నైవేద్యం మయాదత్తం వినాయక॥
శ్రీమహా గణాధిపతియేనమః నైవేద్యం సమర్పయామి.

పూగీఫల సమాయుక్తం నాగవల్లీ దళై ర్యుతం।
కర్పూరచూర్ణ సంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం॥
శ్రీమహా గణాధిపతియేనమః తాంబూలం సమర్పయామి.

సమఘృతవర్తి సహస్రైశ్చ కర్పూరశకలై స్తథా।
నీరాజనం మయాదత్తం గృహాణ వరదో భవ॥
నీరాజనం సమర్పయామి. (కర్పూరము వెలిగించి చూపవలెను.)

ఏకదంతాయ విద్మహే వక్రతుండాయధీమహి।
తన్నోదంతిః ప్రచోదయాత్ ॥
మంత్రపుష్పం సమర్పయామి (అని భగవంతునిపై పుష్పములు వేయవలెను)

యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ ।
తాని తాని వినశ్యంతి ప్రదక్షిణ పదే పదే ॥
శ్రీమహాగణాధిపతయేనమః ప్రదక్షి నమస్కారాన్ సమర్పయామి.

## వినాయక వ్రతకథ

సూతమహాముని శౌనకాది మునులకు విఘ్నేశ్వరోత్పత్తియు, చంద్రదర్శ దోష కారణంబును తన్ని వారణమును చెప్పసాగెను.

పూర్వము గజరూపముగల రాక్షసుడు శివునిగూర్చి ఘోరతపము చేసెను. అతని తపస్సునకు మెచ్చి పరమశివుడు ప్రత్యక్షమై ఏదేని వరము కోరుకొమ్మనెను. గజాసురుడంత పరమేశ్వరుని స్తుతించి "స్వామీ! నీవు ఎల్లప్పుడు నాయుదరము నందే నివసించి యుండుమని కోరెను. భక్తసులబుండగు పరమశివుడు అతని కోర్కెతీర్చుటకై యాతని యుదరమున ప్రవేశించి సుఖముగ నుండెను.

కైలాసమునందు పార్వతీదేవి పతిజాడ తెలియక పలుతెఱుగుల అన్వేషించి కొంతకాలమునకు తన పతి గజాసుర గర్భస్థుడగుట తెలిసికొని విష్ణుమూర్తిని స్తుతించి తన పతి వృత్తాంతమును తెలిపి "ఓ మహానుభావా! పూర్వము నా పతిని భస్మాసురుని బారినుండి రక్షించి నా కొసంగినటులనే యిపుడు కూడా ఏదేని యుపాయంబుచే రక్షింపు" మని వేడుకొనెను. శ్రీహరి పార్వతి నూరడించి పంపివైచెను. పిదప శ్రీహరి బ్రహ్మాదులను పిలిపించి గజాసుర సంహారమునకై గంగిరెద్దుల మేళమే సరియగునట్టి మార్గమని నిశ్చయించి నందిని గంగిరెద్దుగ నలంకరించి, బ్రహ్మాది దేవత లందరిచే తలకొక వాద్యమును ధరింపజేసి తాను చిరుగంటలు, సన్నాయియు దాల్చి గజాసురపురనమున కేగి మనోహరముగా నాడించసాగెను. అంత గజాసురుడు అది విని వారిని పిలిపించి తన భవనమునందు ఆడించ నియమించెను. బ్రహ్మాది దేవతలు వాద్య విశేష ములను వాయింపగ జగన్నాటక సూత్రధారియగు శ్రీహరి గంగిరెద్దును చిత్ర విచిత్రముగ నాడించసాగెను. గజాసురుడు అది చూసి పరమ సంతుష్టుడై మీకేమి కావలయునో

కోరుకొనుడు. ఇచ్చెద ననెను. శ్రీహరి అంత "ఇది పరమశివుని వాహనమగు నంది, శివుని కనుగొనుటకై వచ్చె గావున శివునొసంగు మనెను. గజాసురుడా మాటకు నివ్వెరపడి అతనిని రాక్షసాంతకుడగు శ్రీహరి యని ఎఱింగి తనకు మరణమే నిశ్చయమని తలంచి తన గర్భస్థుండగు శివుని తలంచి'నా శిరమును త్రిలోక పూజ్యమొనరించి నాచర్మమును నీవే ధరింపుమనెను" అని ప్రార్థించి, హరికి తన యంగీకారమును తెలెపెను. అంత విష్ణుమూర్తి నందిని ప్రేరేపించెను. నంది తన శృంగములచే గజాసురుని చీల్చి సంహరించ మహేశ్వరుడు గజాసుర గర్భమునుండి బహిర్గతుడై విష్ణుమూర్తిని స్తుతించెను. విష్ణువు దుష్టాత్ముల కిట్టి వరములీయవలదు. ఇచ్చినచో పాముకు పాలుపోసి నటులయగును. అని యుపదేశించి బ్రహ్మాది దేవతలను వీడ్కొలిపి తాను వైకుంఠమున కరిగెను. అంత పరమేశ్వరుడు గూడ నంది వాహనుడై త్వరిత గతిని కైలాసమునకు జనెను.

## వినాయకోత్పత్తి

కైలాసమున పార్వతీదేవి దేవాదులవలన భర్త రాకను విని సంతోషమున అభ్యంగన స్నానమాచరించుచు నలుగుబిండితో నొక బాలునిచేసి ప్రాణమును పోసి సింహద్వారమున కాపుంచెను. స్నానానంతరము పార్వతీ దేవి సర్వాభరణ భూషితురాలై పత్యాగమనమునకై నిరీక్షించుచుండెను. అంత పరమశివుడు వచ్చి, నంది నారోహించి లోనికి పోబోవ సింహద్వారము నందున్న బాలకు డడ్డగింప రోషావేశమున ఆ బాలుని తన త్రిశూలముచే కంఠము దునిమిలోని కేతెంచెను.

అంత పార్వతీ దేవి భర్తనుగాంచి యెదురేగి అర్ఘ్యపాద్యాదులతో పూజించెను. వారిరువురు పరమానందమున ప్రియభాషణముల ముచ్చటించుచుండ ద్వారమందలి బాలుని ప్రసంగము వచ్చెను. అంత మహేశ్వరుడు తానొనరించిన పనికి చింతించి తానుతెచ్చిన గజాసుర శిరంబు నాబాలుని కతికించి ప్రాణంబొసంగి "గజాననుం" డని నామం బొసంగెను. అతనిని పుత్రప్రేమంబున ఉమామహేశ్వరులు పెంచుకొను చుండిరి. గజాననుండు తల్లిదండ్రులను పరమ భక్తితో సేవించుచుండెను. ఇతండు సులభముగా ఎక్కి తిరుగుటకు అనింద్యుడను నొక మూషికమును వాహనముగా చేసికొనెను.

కొంతకాలమునకు పార్వతీపరమేశ్వరులకు కుమారస్వామి జనియించెను.

అతడు మహా బలిశాలి. అతని వాహనము నెమలి. అతడు దేవతల సేనానాయకుండై ప్రఖ్యాతి గాంచెను.

## విఘ్నేశ్వరాధిపత్యము

ఒకనాడు దేవతలు, మునులు పరమేశ్వరుని సేవించి తమకు విఘ్నముల కధిపతిని యిమ్మని కోరిరి. గజాననుడు తాను జ్యేష్ఠుడనుకాన తన కాధిపత్యము నొసంగుమని, గజాననుడు మరుగుజ్జు, అనర్హుడు, అసమర్థుడు గాన ఆధిపత్యమును తనకొసంగు మని కుమారస్వామియు తండ్రిని వేడుకొనిరి.

అంత మహేశ్వరుడు కుమారుల నుద్దేశించి మీలో ఎవరు ముల్లోకముల యందలి పుణ్యతీర్థములయందు స్నాన మాచరించి ముందు నన్ను చెరుదురో వారికి యాధిపత్యము నిత్తునని నెను. అంతకుమారస్వామి తన నెమలి వాహనము నధిరోహించి వాయువేగమున బయలు వెడలెను. దానించూచి గజాననుడు ఖిన్న వదనుడై తండ్రిని సమీపించి ప్రణమిల్లి "అయ్యా! తమరు నా అసమర్థత నెరింగియుండి కూడ నిట్లు ఆనతీయు తగునా! నీ పాదసేవకుడను. నాయందనుగ్రహించి తగు నుపాయము తెల్పి రక్షించండి" అని ప్రార్థించెను. అంత మహేశ్వరుడు దయాళుడై "సకృన్నారాయనేత్యుక్త్వాపుమాన్కల్ప శత త్రయం! గంగాది సర్వతీర్థేషు స్నాతో భవతి పుత్రక! "కుమారా! ఒకసారి నారాయణ మంత్రమును జపించిన మాత్రమున మూడువందల కల్పంబుల పుణ్యనదులలో స్నానమాచరించిన వాడగును." అని సక్రమముగా నారాయణ మంత్రమును ఉపదేశించెను. దానిని గజాననుడు అత్యంత భక్తితో జపించుచు కైలాసము నందే వసించెను.

ఆ మహామంత్ర ప్రభావమున, అంతకు పూర్వము గంగానదికి స్నానమాడ నేగిన కుమారస్వామికి గజాననుడు నదియందు స్నానమాచరించి ఎదురుగ వచ్చుచున్నట్లు కన్పింప అతడు మూడుకోట్ల ఏబదిలక్షల నదులలోను కూడ నిటులనే చూచి ఆశ్చర్యపడుచు కైలాసమునకేగి తండ్రికి నమస్కరించి అచట గజాననుని గాంచి తన బలమును నిందించుకొని "తండ్రీ! అన్నగారి మహిమ తెలియక అటులంటిని. నన్ను క్షమింపుము. ఈ యాదిపత్యము నా అన్నగారికే యిమ్మని ప్రార్థించెను.

మహేశ్వరుడు అంత భాద్రపద శుద్ధ చవితి తిథియందు గజాననకు విఘ్నాధి పత్యము నొసంగెను. ఆ దినమున సర్వదేశీయులు విఘ్నేశ్వరునకు తమ శక్తికొలది కుడుములు, అపూపములు మున్నగు పిండివంటలు, టెంకాయలు, పాలు, తేనె, అరటిపండ్లు, పానకము వడపప్పు మున్నగునవి సమర్పించి పూజింప విఘ్నేశ్వరుడు, సంతుష్టితో వానిని తానారగించి, కొన్ని వాహనముకిచ్చి, మరికొన్ని చేతధరించి మెల్లగ సూర్యాస్తమయ సమయమునకు కైలాసమునకేగి తల్లిదండ్రులకు ప్రణమిల్లిబోవ ఉదరము భూమికాని చేతులు అందవయ్యె. బలవంతముగ చేతులానింప చరణము లాకాశము జూచె. ఇట్లు దండప్రణామము చేయ గడుంగడు శ్రమ చెందుచుండ పరమ శివుని శిరమునందలి చంద్రుడుజూచి వికటముగా నవ్వెను. అంత రాజదృష్టి సోకిన రాల్లుగూడ నుగ్గుగునను సామెత విఘ్నేశ్వరుని ఉదరము పగిలి అందలి కుడుములు అచట ఎల్లెడలను ద్రొల్లెను. అతడు మృత్యుడయ్యెను.

అంత పార్వతీదేవి శోకించుచు చంద్రునిచూచి "పాపాత్మా! నీ దృష్టి తగిలి నా కుమారుడు మరణించెను. గాన నిన్ను చూచిన వారు పాపుత్ములై నీలాపనిందలు పొందుదురుగాక" యని శపించెను.

## ఋషిపత్నులకు నీలాపనింద కలుగుట

ఆ సమయమున సప్తమహర్షులు యజ్ఞము చేయుచు తమ భార్యలతో అగ్నికి ప్రదక్షిణము చేయుచుండిరి. అగ్నిదేవుడు ఋషి పత్నులను మోహించి శాప భయమున అశక్తతతో క్షీణించుచుండ నయ్యది అగ్ని భార్యయగు స్వాహాదేవి గ్రహించి అరుంధతి రూపము దక్కమిగిలిన ఋషిపత్నుల రూపముల తానే దాల్చిపతికి ప్రియముచేసెను. దానిని చూచిన మహర్షులు అగ్నిదేవునితో నున్నవారు తమ భార్యలే యని శంకించి వారిని పరిత్యజించిరి. పార్వతీ శాపానంతరము ఋషిపత్నులు చంద్రుని చూచుటవలననే వారికిట్టి నీలాపనింద గల్గినది.

మునులు, దేవతలు, ఋషిపత్నుల యాపదలను పరమేష్టికిం తెల్ప నాతండు సర్వజ్ఞుడగుటం జేసి అగ్నిహోత్రుని భార్య స్వాహాదేవియే ఋషి పత్నుల రూపములు ధరించుటను తెల్పి సప్తఋషుల సమాధాన పరచి వారితో గూడి బ్రహ్మ కైలాసమున కేతెంచెను. ఉమామహేశ్వరులను సేవించి మృతుడై యున్న

విఘ్నేశ్వరుని బ్రతికించెను. అంతదేవాదులు "పార్వతీదేవీ! నీ విచ్చిన శాపవశమున లోకములకెల్ల కీడు వాటిల్లెను. కావున దాని నుపసంహరింపుమని ప్రార్థించిరి. అంత పార్వతీదేవి సంతుష్టాంతరంగయైకుమార విఘ్నేశ్వరుని చేరదీసి ముద్దాడి " ఏ దినమున విఘ్నేశ్వరుని చూచి చంద్రుడు నవ్వెనో ఆ నాడు చంద్రుని చూడరాదు" యని శాపావకాశము నొసంగెను. బ్రహ్మాదులంత సంతసమున తమ గృహంబుల కేగి భాద్రపదశుద్ధ చవితి నాడు మాత్రము చంద్రుని చూడక జాగరూకతతో సుఖంబున యుండిరి. ఇట్లు కొంతకాలము గడచెను.

## శ్యమంతకోపాఖ్యానము

ద్వాపరయుగమున ద్వారకావాసి శ్రీకృష్ణపరమాత్ముని నారదుడు దర్శించి స్తుతించి ప్రియసంభాషణ జరుపుచు "స్వామీ! సాయంసమయమాయెను. ఈనాడు విఘ్నేశ్వర చతుర్థిగాన పార్వతీ శాపంబుచే చంద్రుని చూడరాదు. కాన నిజగృహమున కేగెద శలవిం"డని పూర్వవృత్తాంతమంతయు విని శ్రీకృష్ణుడు ఆనాటి రాత్రి చంద్రునెవ్వరు చూడరాదని ద్వారకయందు చాటింపించెను. నాటి రాత్రి క్షీరప్రియుడగుటం చేసి శ్రీకృష్ణుడు మింటికి చూడకనే గోష్ఠ మునకుబోయి పాలుపిదుకుచు పాలలో చంద్ర ప్రతిబింబమును గాంచి "ఆహా! ఇక నా కెట్టి యపనింద రానున్నదో యని సంశయమందెను. కొన్నాళ్ళకు సత్రాజిత్తు సూర్యవరమున శ్యమంతక మణిని సంపాదించి ద్వారకకు శ్రీకృష్ణదర్శనార్థము బోవ శ్రీకృష్ణుడు అతిథి సత్కారానంతరము ఆమణినిమ్మని యడిగెను. అంత సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనుడా శ్యమంతకమణిని కంఠమున ధరించి వేట కడవికి పోయెను. అట ఒక సింహము అతని కంఠమందలి యా మణిని మాంస ఖండమని భ్రమించి అతనిని జంపి ఆమణి గొనిపోవ దారి యందు ఒక భల్లూకమా సింహమును చంపి మణిని తీసికొనిపోయి తన కొండబిలమందు తొట్టియందు పరుండియున్న తన కుమార్తె జాంబవతికి ఆటవస్తువుగ నిచ్చెను. మరునాడు సత్రాజిత్తు తమ్ముని మరణ వార్తవిని "శ్రీకృష్ణుడు మణినీయనందులకు తన సోదరునిచంపి మణి నపహరించె"నని చాటెను. అది విని శ్రీకృష్ణుడు నాడు క్షీరమున చంద్రబింబ దర్శన దోష ఫలంబని తలంచి దానిని నివారించుకొనుటకు బంధుమిత్రాదులతో యరణ్యము చేరి వెతుకగా నొకచోట ప్రసేనుని కళేబరమును గాంచెను. ఆదారినిబట్టి పోనుపోను ఒకపర్వత గుహాద్వారమున ప్రవేశించి

పరివారము నటయుంచి ... కృష్ణుడా గృహాంతర్భాగము చేరెను. అచట బాలిక ఉయ్యాలపై కట్టబడియున్న శమంతకమణిని చూచి అచటనుంచి దానిని చేత పుచ్చుకొని వచ్చుచున్నంత ఉయ్యాలలోని బాలిక రోదించసాగెను. అంతదాది వింత మనిషియని కేకలు వేయసాగెను.

అంత జాంబవంతుడు కోపావేశము ప్రవేశించి శ్రీకృష్ణునిపై బడి అరచుచు నఖంబుల గ్రచ్చుచు క్రిందబడదోసి రాళ్ళచేత, వృక్షముల చేతను, ముష్టి ఘాతముల చేతను ఎడతెరపిలేని రాత్రింబవళ్ళు యిరువది ఎనిమిదిరోజులు యుద్ధము సాగించెను. జాంబవంతుడు క్షీణబలుడై భీతిచెందుచు తన బలమును హరింపచేసిన యితడు రావణ సంహారి శ్రీరామచంద్రునిగా భావించి, అంజలి ఘటించి "దేవాది దేవా! ఆర్తజన పోషా! భక్తజనరక్షా! నిన్ను త్రేతాయుగమున రావణాది దుష్టరాక్షస సంహరణార్థమై అవతరించి భక్తజనులను పాలించిన శ్రీరామ చంద్రునిగా ఎరింగితిని. అపుడు నాయందలి వాత్సల్యమున వరము కోరుమన నాబుద్ధిమాంద్యముచే మీతో ద్వంద్వయుద్ధంబు చేయగోరుకొంటిని. కాలాంతర మున అది జరుగునని సెలవిచ్చితిరి. నా శరీరము శిథిలంబయ్యె, నా అపరాధముల మన్నించి నన్ను కాపాడుము". అనుచు భీతిచే ప్రార్థించెను. శ్రీకృష్ణుడంత దయాళుడై జాంబవంతుని శరీర మంతయు తన హస్తముతో నిమిరి భయము బాపి యిట్లనెను. "భల్లూకేశ్వరా! శ్యమంతకమణి నపహరించి నటుల నాపై నారోపింపబడ్డ నింద బాపుకొనవచ్చితిని, మణి నిమ్ముపోయెద"నని తెల్ప జాంబవంతుడుమణితో తనకుమార్తె జాంబవతిని శ్రీకృష్ణునకు కానుకగా నిచ్చెను. అంత తన యాలస్యమునకు పరితపించి బంధుమిత్రులతోను, కన్యారత్నముతోను శ్రీకృష్ణుడు ద్వారకచేరి యావద్వృత్తాంతమును తెల్పి శ్యమంతకమణిని సంత్రాజిత్తున కిచ్చెను. అంత సత్రాజిత్తు యిదివిని అయ్యో లేనిపోని నిందను మోపినందులకు మణిని తన కుమార్తె సత్యభామతో కూడ కానుకగా శ్రీకృష్ణున కర్పించెను. శ్రీకృష్ణుడు సత్యభామను స్వీకరించి తిరిగి సత్రాజిత్తునకు యిచ్చివేసెను. ఒక శుభముహూర్తమున శ్రీకృష్ణుడు జాంబవతీ, సత్యభామల పరిణయమాడెను. అచటికి వచ్చిన మునులు, దేవాదులు స్తుతించిరి. "మీరు సమర్థులు గాన నీలాపనిందలు బాపుకుంటిరి. మాకేమిగతి?" అని ప్రార్థింప శ్రీకృష్ణుడు దయాళుడై" భాద్రపదశుద్ధ చవితినాడు ప్రమాదవశమున చంద్రదర్శన

మయినయెడల ఆనాడు గణపతిని యథావిధి పూజించి ఈశ్యమంతకమణి కథను విని అక్షతలు శిరముల దాల్చువారు నీలాపనింద నొందకుందురుగాక" యని ఆనతీయ దేవాదులు సంతసించి తమ నివాసములకు పోయి ప్రతివత్సరము దేవతలు మున్నగు వారు తమతమ శక్త్యను సారము భాద్రపద శుద్ధ చవితినాడు గణపతిని పూజించి అభీష్టసిద్ధిగాంచుచు సుఖముగానుండిరని శాపమోక్ష ప్రకారంబు శౌనకాది మునులకు వినిపించి వీడ్కొని నిజాశ్రమమున కరిగెను.

శ్రీ మహాగణధిపతయేనమః ఛంత్రం ధారయామి, చామరంవీజియామి, నృత్యం దర్శయామి, గీతం శ్రావయామి, వాద్యం ఘోషయామి, ఆందోళికామారోహ యామి, అశ్వానారాహయామి, గజానారోహమి, సమస్త రాజోపచార పూజాం సమర్పయామి అని పుష్పములను భగవంతునిపై వేసి నమస్కరించవలెను (అక్షతలు జలము తీసుకొని) అనయాధ్యానా వాహనాది షోడషోపచార పూజయా భగవాన్ శ్రీమహాగణాధిపతి సుప్రీతా, సుప్రసన్నావరదా భవతు (అని విడిచి పెట్టవలెను) పునః పూజచేసి,తీర్థ ప్రసాదము తీసుకొని, ఉద్వాసన చెప్పవలెను.







# కేదారేశ్వర వ్రతకల్పము



ఆచమనయు, ప్రాణాయామం చేసి, ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ అస్మాకం సహకుటుంబానాం క్షేమస్థైర్య ధైర్యవిజయాయురారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థం ఇష్టకామ్యార్థ సిద్ధ్యర్థం సత్సంతాన సౌభాగ్య శుభఫలావాప్త్యర్థం వర్షే వర్షే ప్రయుక్తం కేదారేశ్వర దేవతా ముద్దిశ్య కేదారేశ్వర దేవతా ధ్యానా వాహనాది షోడషోపచార పూజాం కరిష్యే. ఆదౌగణాధిపతి పూజాం, కలశ పూజాంచ కుర్యాత్ (గణపతి పూజ తర్వాత కలశపూజ చేసి పూజ ప్రారంభించవలెను.)

## ధ్యానమ్

శూలం డమరుకంచైవ దధానం హస్తయుగ్మకే।
కేదారదేవ మీశానం ధ్యాయే త్రిపురఘాతినం ॥

కేదారేశ్వరస్వామినేనమః ధ్యాయామి.

కైలాసశిఖరే రమ్యే పార్వత్యా స్సహిత ప్రభో ।
ఆగచ్ఛ దేవదేవేశ మద్భక్త్యా చంద్రశేఖర ॥

కేదారేశ్వరస్వామినేనమః ఆవాహయమి.

సురాసురశిరోరత్న ప్రదీపిత పదాంబుజ ।
కేదారదేవ మద్దత్త మానసం ప్రతిగృహ్యతామ్ ॥

కేదారేశ్వరస్వామినేనమః ఆసనం సమర్పయామి.

గంగాధర నమస్తే త్రిలోచన వృషధ్వజ ।
మౌక్తికాసన సంస్థాయ కేదారాయ నమోనమః॥

కేదారేశ్వరస్వామినేనమః పాద్యం సమర్పయామి.

అర్ఘ్యం గృహాణ భగవన్భక్త్యా దత్తం మహేశ్వరః ।
ప్రయచ్ఛమే మనస్తుష్టిం భక్తానామిష్టదాయకం ॥

కేదారేశ్వరస్వామినేనమః అర్ఘ్యం సమర్పయామి.

మునిభిర్నారద ప్రఖ్యైర్నిత్యమాఖ్యాతవైభవ।
కేదారదేవ భగవన్ గృహాణాచమనం విభో॥

కేదారేశ్వరస్వామినేనమః ఆచమనం సమర్పయామి.

స్నానం పంచామృతై ర్దేవ తశుద్ధోకైరపి।
గృహాణ గౌరీరమణ త్వద్భక్తేన మయార్పితమ్ ॥

కేదారేశ్వరస్వామినేనమః పంచామృత స్నానం సమర్పయామి.

నదీజలం సమాయుక్తం మయాదత్త మనుత్తమం ।
స్నానం స్వీకురు దేవేశ సదాశివ నమోస్తుతే ॥

కేదారేశ్వరస్వామినేనమః శుద్ధోదక స్నానం సమర్పయామి.

వస్త్రయుగ్మం సదాశుభ్ర మనోహర మిదం శుభం।
దదామి దేవదేవేశ భక్త్యేదం ప్రతిగృహ్యతామ్ ॥

కేదారేశ్వరస్వామినేనమః వస్త్రయుగ్మం సమర్పయామి

స్వర్ణయజ్ఞోపవీతంచ కాంచనం చోత్తరీయకం।
రుద్రాక్షమాలయా యుక్త దదామి స్వీకురు ప్రభో ॥

కేదారేశ్వరస్వామినేనమఃయజ్ఞోపవీతం సమర్పయామి.

సమస్తగంధ ద్రవ్యాణాం దేవత్వమసి జన్మభూః ।
భక్త్యా సమర్పితం ప్రీత్యా మయాగంధాది గృహ్యతాం ॥

కేదారేశ్వరస్వామినేనమః గంధాన్ సమర్పయామి.

అక్షతోఽసి స్వభావేన భక్తానా మక్షతం పదం ।
దదాసి నాథ మద్దత్తై రక్షతైః ప్రీయతాం భవాన్ ॥

కేదారేశ్వరస్వామినేనమః అక్షతాన్ సమర్పయామి.

కల్పవృక్షప్రసూనైస్త్వం పూర్వైరభ్యర్చితస్సురైః ।
కుంకుమైపార్థివై రేభి రిదానీ మర్చ్యతాం మయా ॥

కేదారేశ్వరస్వామినేనమః పుష్పాణి సమర్పయామి.

తతః ఇంద్రాది లోకపాలపూజాం కుర్యాత్,
శివస్య దక్షిణేభాగే బ్రహ్మణే నమః.

**అథ అంగపూజా**

| | | |
|---|---|---|
| ఓం మహేశ్వరాయ నమః | పాదౌ | పూజయామి |
| ఈశ్వరాయ నమః | జంఘే | " |
| కామరూపాయ నమః | జానునీ | " |
| హరాయనమః | ఊరూ | " |
| త్రిపురాంతకాయ నమః | గుహ్యం | " |
| భవాయ నమః | కటిం | " |
| గంగాధరాయ నమః | నాభిం | " |
| మహాదేవాయ నమః | హృదయం | " |
| పినాకినే నమః | హస్తాన్ | " |
| శివాయ నమః | భుజౌ | " |
| శితికంఠాయ నమః | కంఠం | " |
| విరూపాక్షాయ నమః | ముఖం | " |
| త్రినేత్రాయ నమః | నేత్రాన్ | " |
| రుద్రాయ నమః | లలాటం | " |
| శర్వాయ నమః | శిరః | " |
| చంద్రమౌళయే నమః | మౌళిం | " |

పశుపతయే నమః సర్వాణ్యాం గాని పూజయామి.

ఇచ్చట శివాష్టోత్తర శతనామములతో అర్చన చెయవలెను.

47 వ పేజీ చూడుము

శ్రీకేదారేశ్వరస్వామినే నమః నానావిధ పరిమళ పుష్పాణి పూజయామి.

అథసూత్ర గ్రంథి పూజయామి.

| | | |
|---|---|---|
| ఓం శివాయ నమః | ప్రథమగ్రంథిం | పూజయమి |

| | |
|---|---|
| శాంతాయ నమః | ద్వితీయ గ్రంథిం |
| మహాదేవాయ నమః | తృతీయ గ్రంథిం |
| వృషభధ్వజాయ నమః | చతుర్ధ గ్రంథిం |
| గౌరీశాయ నమః | పంచమ గ్రంథిం |
| రుద్రాయ నమః | ష ష్ట మ గ్రంథిం |
| పశుపతయే నమః | సప్తమ గ్రంథిం |
| భీమాయ నమః | అ ష్ట మ గ్రంథిం |
| త్ర్యంబకాయ నమః | నవమ గ్రంథిం |
| నీలలోహితాయ నమః | దశమ గ్రంథిం |
| హరాయ నమః | ఏకాదశ గ్రంథిం |
| స్మరహరాయ నమః | ద్వాదశ గ్రంథిం |
| భర్గాయ నమః | త్రయోదశ గ్రంథిం |
| శంభవే నమః | చతుర్దశ గ్రంథిం |
| శర్వాయ నమః | పంచదశ గ్రంథిం |
| సదాశివాయ నమః | షోడశ గ్రంథిం |
| ఈశ్వరాయ నమః | సప్తదశ గ్రంథిం |
| ఉగ్రాయ నమః | అష్టాదశ గ్రంథిం |
| శ్రీకంఠాయ నమః | వింశతి గ్రంథిం |
| నీలకంఠాయ నమః | ఏకోనవింశతి గ్రంథిం |
| కేదారేశ్వరాయ నమః | ఏకవింశతి గ్రంథిం |

సూత్ర గ్రంథి పూజాం సమర్పయామి

దశాంగ ధూపముఖ్యంచ హ్యంగార వినివేశితం ।
ధూపం సుగంధై రుత్పన్నం త్వాం ప్రీణయతు శంకర ॥

కేదారేశ్వరస్వామినేనమః ధూపమాఘ్రాపయామి.

యోగినాం హృదయే ష్వేవజ్ఞానదీపాం కురోహ్యసి ।
బాహ్యదీపో మయాదత్తః గృహ్యతాం భక్తగౌరవాత్ ॥

కేదారేశ్వరస్వామినేనమః దీపం దర్శయామి.

త్రైలోక్యమపి నైవేద్యం న తే తృప్తి స్తథా బహిః ।
నైవేద్యం భక్తవాత్సల్యాద్గృహ్యతాం త్ర్యంబకత్వయా ॥

కేదారేశ్వరస్వామినేనమః నైవేద్యం సమర్పయామి.

నిత్యానందస్వరూపస్త్వం యోగిహృత్కమలే స్థితః ।
గృహాణభక్త్యా మద్దత్తం తాంబూలం ప్రతిగృహ్యతాం ॥

కేదారేశ్వరస్వామినేనమః తాంబూలం సమర్పయామి.

అర్ఘ్యం గృహాణ భగవన్ భక్త్యాదత్తం మహేశ్వర ।
ప్రయచ్ఛ మే మనస్తుష్టిం భక్త్యానా మిష్టదాయకం ॥

కేదారేశ్వరస్వామినేనమః అర్ఘ్యం సమర్పయామి.

కర్పూరం చంద్రసంకాశం జ్యోతిస్సూర్యమి వోదితం ।
భక్త్యా దాస్యామి కర్పూర నీరాజన మిదం శివ ॥

కేదారేశ్వరస్వామినేనమః నీరాజనం సమర్పయామి

భూతేశ భువనాధీశ సర్వదేవాదిపూజిత ।
ప్రదక్షిణం కరోమి త్వాం వ్రతం మే సఫలం కురు ॥

కేదారేశ్వరస్వామినేనమః ప్రదక్షిణం సమర్పయామి

హరః శంభో మహాదేవ విశ్వేశామర వల్లభ,
శివ శంకర సర్వాత్మన్ నీలకంఠ నమోస్తుతే.

కేదారేశ్వరస్వామినేనమః నమస్కారాన్ సమర్పయామి.

కేదార దేవదేవేశ భగవన్నంబికాపతే,
ఏకవింశ ద్దినేతస్మిన్ సూత్రం గృహ్ణామ్యహం ప్రభో
సూత్ర గ్రహణం

ఆయుశ్చ విద్యాంచ తథా సుఖం చ
సౌభాగ్యవృద్ధిం కురు దేవదేవ ।
సంసార ఘోరాంబునిధౌ నిమగ్నం

మాం రక్ష కేదార నమో నమస్తే ॥

తోరబంధనం

కేదారప్రతిగృహ్ణాతు కేదారో వైదదాతి చ ।
కేదారస్తారకోభాభ్యాం కేదారాయ నమోనమః ॥

వాయనదానం

కేదారః ప్రతిమాం యస్మాద్రాజ్యం సౌభాగ్యవర్ధినీ,
తస్మాదస్యాః ప్రదానేన మమాస్తు శ్రీ రచంచలా.

ఇతి ప్రతిమాదానమంత్రః ఇతి పూజావిధానం సంపూర్ణమ్.

# కేదారేశ్వర వ్రత కథా ప్రారంభము

సూతపౌరాణికుండు శౌనకాది మహర్షులం గాంచి యిట్లనియె. ఋషి పుంగవులారా! మానవులకు సర్వ సౌభాగ్యముల గలుగంజేయునదియు, పార్వతీ దేవిచే సాంబశివుని శరీరార్థము పొందబడినదియునగు కేదారేశ్వర వ్రతము ఒకటిగలదు. ఆ వ్రతవిధానమును వివరించెద వినుండు. దీనిని బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రాదు లాచరింపవచ్చును. ఈ వ్రతమును ఇరువది యొక్క మారు లాచరించువారు సకల సంపద లనుభవించి పిదప శివసాయుజ్యము నొందుదురు.

ఓ మునిశ్రేష్ఠులారా! ఈ వ్రతమాహాత్మ్యమును వివరించెద వినుండు. భూలోకంబునం దీశాన్యభాగమున మెఱపు గుంపులతో గూడియున్న శరత్కాల మేఘములంబోలు నిఖిలమణివిచిత్రంబైన శిఖరములచేతను, పలుతెఱుంగులైన లతావిశేషములచేతను, బహు విధములగు పుష్ప ఫలాదులచేతను, నానావిధములైన పక్షులుచేతను మరియు ననేకములైన కొండకాలువలచేతను, వ్యాప్తంబయి సాలతమాలతిలకహింతాల వకుళాశోక చందన దేవదారు నారికేళామ్రపనస నాగపున్నాగ చంపకాది వృక్షములచేతను, నానాతరు విశేష ములచేతను భాసిల్లునట్టి యుద్యాన వనములచేత ప్రకాశించుచు నిఖిల కల్యాణ ప్రదంబై సర్వజన నమస్కృతంబై కైలాసమని పేర్కొనంబడిన ఒక పర్వత శ్రేష్ఠము గలదు.

అంత సూర్యాగ్నిపవనులు నక్షత్రయుక్తుండయిన నిశాకరుండును,

మరియు నింద్రాది దేవతలును, వసిష్ఠాది మహర్షులును, రంభ మొదలగు అప్సరసలును, బ్రాహ్మి మొదలగు సప్తమాతృకలును, సేనానియు, గణపతియును, తత్సారూప్యమును బొందియున్న నంది భృంగి మొదలగు ప్రమథ గణములు తన్ను పరివేష్ఠించి కొలుచుచుండ నట్టి భవానీవల్లభుని యత్యద్భుతంబగు సభ యందు నారదుడు మొదలగు దేవగాయకులు స్వామి అనుజ్ఞవడసి గానము చేసిరి. అట్టి రమణీయంబును శ్రావ్యంబునగు గానము ప్రవర్ధిల్లుచుండగా ఘృతాచీ మేనకాదులు వీణాది చతుర్విధ వాద్యములతో లయలతో కూడిన నృత్యమొనర్చిరి.

అప్పుడా సొగసుకత్తె యగు రంభ నిఖిల సురబృందములయొక్క యుల్లములు రంజిల్లునటుల వికటనాట్య మొనరించెను. ఆ సమయమున భృంగిఋషి యనెడి భక్త వరుండు ఆ స్వామి సన్నిధియందు దత్ప్రతీకారంబగు వికట నాట్యము చేయగా నా పార్వతి కైలాసపతి యొక్క పూర్వ భాగమున దుండెను. అప్పుడు సకల దేవతలకు మిక్కుటమైన హాస్యము నిండునటుల గొప్ప కలకల ధ్వని కలిగెను.

ఇట్లు హాస్యము విస్తరిల్లుచుండ సర్వేశ్వరుండగు శంకరుండు ఆ భృంగిఋషినిం జూచి నీచేత మిగుల హర్ష ప్రవర్ధనంబైన నాట్యము చేయబడెనని సెలవిచ్చి ముదంబంది యాభక్తుని అనుగ్రహించెను. అంతట నా భృంగిఋషికి శివానుగ్రహంబు గలుగుటంచేసి యతండు ప్రీతుండై సకల విబుధులచే గౌరవింపబడి సమాహితచిత్తుం వినయంబుతో గూడి యా పార్వతీ దేవిని వదలి ఈశ్వరునికి మాత్రము ప్రదక్షిణమొనరించెను. అప్పుడు పార్వతి చిరునగవుతో గూడినదై తన పతియగు న ప్పరమేశ్వరుని వీక్షించి ఓ స్వామీ! ఈ భృంగిఋషి నన్ను విడిచి మీకు మాత్రము ప్రదక్షిణము ఆచరించుటకు కారణమేమి! విన వేడుకగా నున్నది. ఆనతీయవే యని వేడగా నా శివుడు ఓ ప్రియురాలా! ఆ వివరము చెప్పెద వినుము. పరమార్థవిదులగు యోగులకు నీవలనం బ్రయోజ నంబు లేమింజేసి నాకే నమస్కరించెనని చెప్పెను.

పరమేశ్వరి ఆ మాటలకు మిగుల వ్రీడనుపొంది ఆ పతియందున్న తన శక్తి నాకర్షించగా నా స్వామి త్వగస్థి విశిష్ట మాత్రావయవుండాయె. అంత నాదేవియు నారోహనురాలై వికటురాలాయెను. పిదప నా దేవి కోపించి దేవతలచేత నూరడింప

బడినదైనను కైలాసమును వదలి తపం బొనరించుటకు బహువిధంబులగు సింహ శార్దూల గజమృగాదులచే సేవింపబడియు నిత్యవైరముడిగియున్న పన్నగ గరుడాది సకల జంతువులచే నిబిడంబగు నానావిధవృక్షలతా గుల్మాది భూయిష్టంబయి ఋషి శ్రేష్ఠ సేవితంబై సర్వాభీష్టప్రదంబై యొప్పుచున్న గౌతమాశ్రమమును ప్రవేశించెను.

అంత నాగౌతముండు వన్యంబులై హోమయోగ్యంబులగు సమిత్కుశ ఫలాదులను సంగ్రహించుకొని వనమునుండి వచ్చునెడ దన యాశ్రమ భాగమున వెలుగుచున్న ప్రకాశమును జూచి ఋష్యాశ్రమం బగుటవలన శోభిల్లుచున్నది అని విస్మయంబంది దత్కారణము చింతించుచు తన ఆశ్రమము ప్రవేశించి తామర రేకులవంటి కన్నులు గలిగి యలంకృతురాలైయున్న యా దేవింగని పూజ్యురాలవైన ఓ భగవతీ! నీ విచ్చటి కేతెంచుటకు కారణంబేమని అడుగగా నా దేవియు ఆ జడదారికి తన నిషాద కారణమును వచించి నమస్కరించి, ఓ మునీశ్వరా! ఏ వ్రతము యోగికి సమ్మతమైనదో యే వ్రతానుష్ఠానముచేత శంకర దేహార్థము నాకు ఘటించునో అటువంటి వ్రతము ఉపదేశింపుము అనగా ఆ మహర్షి సకల శాస్త్రపురాణావలోకనం బాచరించి యీప్సితార్థప్రదంబగు శ్రీమత్కేదార నామకంబయిన ఉత్తమ వ్రతము నాచరింపుమని ఉపదేశించెను. అంత నా దేవియు నా వ్రతానుష్ఠాన క్రమము ఆనతీయవే యని వేడగా ఇటులని చెప్పందొడంగెను.

భాద్రపద శుక్లాష్టమియందు శుద్ధమనస్కురాలవై మంగళకరములగు నేకవింశతి తంతువులచేత హస్తమునందు ప్రతిసరమును ధరించి పూజించి యా దినమందు ఉపవాస మొనరించి మరునాడు బ్రాహ్మణ భోజనము చేయించి అది మొదలు అమావాస్య వరకు నీ వ్రతము ఇటుల సలుపుచు ప్రతిదినము నందును శ్రీ మత్కేదార దేవునారాధింపవలయును.

మరియు శుభ్రంబగు ఒక ప్రదేశమున ధాన్యరాశిలో నింటియందు పూర్ణకుంభము నుంచి ఇరువది యొక్క సూత్రముల చేత జుట్టి పట్టు పుట్టములచేత కప్పియుంచి నవరత్నములను గాని శక్తి కొలది సువర్ణమును గాని ఉంచి గంధము పుష్పాక్షతలచే నర్చించి ఇరువదియొక బ్రాహ్మణులను పిలిపించి

పాదప్రక్షాళనాది కృత్యము లాచరించి కూర్చుండ నియోగించి అచట కేదార దేవుని ప్రతిష్ఠింపజేసి చందనాగరు కస్తూరి కుంకుమాదులను శ్రీగంధమును నానావిధ పుష్పములను తాంబూలములను వస్త్రములనుంచి నివేదన మొనరించి, యథాశక్తి దక్షిణలిచ్చి వ్రతమును లెస్సగా ననుష్ఠించి ఈశ్వరునకు మనస్సంతుష్టి చేసినయెడల ప్రీతుండై యా వృష భధ్వజుండు నీవు కోరిన వరము లియ్యగలడు అని వచించిన నా కాత్యాయినియు నటులే యని ఆచరించెను.

అంత పరమశివుండు సంతుష్టాంతరంగుడై అచటికి దేవగణముల తోడం జని నా శరీరార్థమును నీకు ఇవ్వగా నా పార్వతీదేవి యుప్పొంగి శంకర దేహార్థమును బొంది లోకానుగ్రహము జేయదలంచి దన పతియగు పరమశివుని భక్తితో నీ వ్రతము నాచరించువారలకు సకలాభీష్టసిద్ధి గలుగునటుల అనుగ్రహించితిరేని ఎల్లవారు నాచరింతురనగా నటులే గాక యని అంగీకరించి శివుడు సురసంఘములతో కూడ నచ్చట నంతర్హితుండయ్యె.

మరికొంత కాలమునకు శివభక్తియుక్తుండగు చిత్రాంగదుండను గంధర్వుండు నందికేశ్వరుని వలన నావ్రత చర్యాక్రమంబెరిగి మనుష్య లోకమునకుం జని వారలకు ఉపదేశింప వలయునను నిచ్ఛగలవాడై యుజ్జయినీ పట్టణమును జేరి వజ్రదంతుడను రాజునకు ఆ వ్రతమును ఉపదేశించెను. అతడు ఆ వ్రతమును కల్పోక్త ప్రకారంబుగ నాచరించి సార్వభౌముండాయెను.

మరికొంతకాలమునకు నా పట్టణమున నున్న వైశ్యునకు పుణ్యావతియు, భాగ్యవతియు నను నిరువురు కుమార్తెలు గలిగిరి. వారిరువురు తండ్రిదగ్గరకు బోయి కేదారవ్రతము ఆచరించుటెట్లో ఆనతీయుమని వేడగా అమ్మా! నేను మిగుల దరిద్రుడను. మీ రాతలంపు మానుడనగా ఓ తండ్రీ! నీ యనుజ్ఞ మాకు పరమధనంబుగాన ఆనతీయుమని సెలవు పుచ్చుకొని ఒక వటవృక్షమువద్ద కూర్చుండి ప్రతిపరము గట్టికొని యథావిధిగా పూజింప వారల భక్తికి మెచ్చి ఈశ్వరుడు వలయుసామగ్రిని ఇచ్చెను.

అంతట వారలు చక్కగా వ్రతము నాచరించుటవలన ఆ మహాదేవుండు ప్రీతుండయి ఆ కన్యలకు ఆయురారోగ్య ఐశ్వర్యములను దివ్యరూపంబుల

నొసంగి అంతర్ధానుండాయెను.

పిమ్మట నా వ్రత మాహాత్మ్యము వలన నుజ్జయినీ పట్టణమును నేలుచున్న రాజు పుణ్యవతియను కన్యను, చోళ భూపాలుడు భాగ్యవతియను కన్యను పాణిగ్రహణం బొనర్చికొనిరి. అందువలన నా వైశ్యుండు ధనసమృద్ధి గలిగి సామ్రాజ్య సంపదలను పుత్రులను బొంది సుఖమున నుండెను.

రెండవదియైన భాగ్యవతి అనునది ఐశ్వర్య మదమోహితురాలై కొంత కాలమునకు నా వ్రతమును విడిచెను. అందువలన భాగ్యహీనురాలై పుత్రుని తోడ పెనిమిటిచేత వెడలనంపబడి అడవిలో తిరిగి సంచారఖిన్నురాలై ఒక బోయవాని యిల్లుచేరెను. అచ్చట పుత్రుని జూచి నాయనా! నా అక్కయగు పుణ్యవతిని ఉజ్జయినీపురపురాజు వివాహమాడి యున్నవాడు. నీ వచ్చటికిపోయి మన సంగతి ఎఱింగించి వ్రత మాచరించుటకు ధనము తీసికొని శీఘ్రముగా రమ్మనగా నతండు ఆ పట్టణమునకు పోయి పెద్ద తల్లితో తన తల్లి యొక్క దుస్సహంబగు కష్టమును దెలుపగా నా పుణ్యవతియు నతని చేతికి విస్తారముగ ధనము నిచ్చెను.,

అంత వాడా ధనమును తీసికొని వచ్చుచుండగా, మార్గమున నదృశ్యరూపుండైన ఆ దేవుని వలన నా ధనం బపహరింప బడగా నతడు మరల నచటికి ఏ తెంచి ఆ వృత్తాంతమును విన్నవించి మరికొంత ధనము సంగ్రహించుకొని వచ్చెను. ఆ ధనము గూడా హరింపబడగా దోదూయమానసుండై నిలువంబడి యున్నవానిలో ఈశ్వరుండ దృశ్యుండై ఓ చిన్నవాడా! వ్రతభ్రష్టులకు నీధనంబు గ్రహింప నలవికానిదని చెప్పెను. ఆ మాటలు విని విస్మయుంబంది ఆ చిన్నవాడు మరల ముందువలెనే ఉజ్జయినీ పట్టణమునకుం జని ఈశ్వరోక్తంబగు వృత్తాంతమును దెలుపగా నా పుణ్యవతి ఆలోచించి పుత్రనిచేత వ్రతంబు ఆచరింపజేసి తన చెల్లెలు వ్రత మాచరించునటుల చెప్పవలయునని ధనము నొసంగి పంపెను.

అతండు బయలుదేరి వచ్చునెడ మార్గంబున నప్రయత్నముగ ముందుగొనిపోయిన ధనమంతయు స్వాధీనమైనందున సంతోషించి సర్వము గ్రహించుకొని కాంచీ పట్టణము ప్రవేశించు సమయంబున చతురంగ బలముతోడ

తన తండ్రి ఎదుర్కొనివచ్చి వెంట బెట్టుకొని పట్టణమునకుంజనియె. నంతట తల్లిదండ్రులతో గూడి సుఖముగా నుండెను.

పిమ్మట తల్లియగు పుణ్యవతియును తండ్రి యగు చోళ రాజును నది మొదలు ఈ వ్రతము నాచరించుచు అవిచ్ఛిన్నంబగు నిఖిల సంపద లనుభవించి చుండిరి.

ఏవరైనను యథోక్త ప్రకారము నీ వ్రతమాహాత్మ్యమును భక్తి యుక్తులై వినిన జదివిన అట్టివారలందరును శ్రీ మహాదేవుని అనుగ్రహము వలన ననంతంబులగు ఆయురారోగ్య యశములను బొంది సుఖంబు లనుభవించి శివసాయుజ్యమును బొందుదురని గౌతమ మహాఋషిచే జెప్పబడెనని సూతుండు శౌనకాదులకు జెప్పిన యట్లు శ్రీవ్యాసభగవానుడు స్కాంద పురాణమునం దభివర్ణించెను.

పునఃపూజచేసి తీర్థ ప్రసాదములు తీసుకొని, ఉద్వాసన చెప్పవలెను.

కేదారేశ్వర వ్రత కథ సమాప్తము.

| రాహుకాలము | యమగండము |
|---|---|
| ఆది - మ. 4-30 నుండి 6-00 వ॥ | ఆది - మ. 12-00 నుండి 1-30 వ॥ |
| సోమ - ఉ. 7-30 " 9-00 వ॥ | సోమ- ఉ. 10-30 " 12-00 వ॥ |
| మంగళ- మ. 3-00 " 4-30 వ॥ | మంగ-ఉ. 9-00 " 10-30 వ॥ |
| బుధ - మ. 12-00 " 1-30 వ॥ | బుధ -ఉ. 7-30 " 9-00 వ॥ |
| గురు - మ. 1-30 " 2-00 వ॥ | గురు-ఉ. 6-00 " 7-30 వ॥ |
| శుక్ర - ఉ. 10-30 " 12-00 వ॥ | శుక్ర -మ. 3-00 " 4-30 వ॥ |
| శని - ఉ. 9-00 " 10-30 వ॥ | శని -మ. 1-30 " 3-00 వ॥ |

| మాసములు | ఋతువులు | ఇంగ్లీషు నెలలు |
|---|---|---|
| చైత్రం, వైశాఖం - | వసంత ఋతువు- | ఏప్రిల్, మే |
| జ్యేష్ఠం, ఆషాఢం - | గ్రీష్మ ఋతువు - | జూన్ , జూలై |
| శ్రావణం, భాద్రపదం | వర్ష ఋతువు | ఆగస్టు, సెప్టెంబర్ |
| ఆశ్వయుజం, కార్తికం | శరదృతువు - | అక్టోబర్, నవంబర్ |
| మార్గశిరం, పుష్యం - | హేమన్త ఋతువు | డిశెంబర్, జనవరి |
| మాఘం, పాల్గుణం - | శిశిరఋతువు | ఫిబ్రవరి,మార్చి |

# ఆదిత్య హృదయ స్తోత్రం

## వినియోగః

ఓం అస్యశ్రీ ఆదిత్య హృదయస్తోత్ర మహామంత్రస్య, అగస్త్య ఋషిః, అనుష్టుప్ ఛందః, ఆదిత్యహృదయభూతో భగవాన్ బ్రహ్మాదేవతా, నిరస్తాశేష విఘ్నతయా బ్రహ్మావిద్యాసిద్ధౌ, సర్వత్ర జయసిద్ధౌ చ వినియోగః.

## ఋష్యాది న్యాసః

ఓం అగస్త్యఋషయేనమః శిరసి। అనుష్టుప్ ఛందసేనమః ముఖే। ఆదిత్యహృదయ భూత బ్రహ్మాదేవతాయైనమః హృది। ఓం బీజాయ నమః గుహ్యే। రశ్మితే శక్తయేనమః పాదయోః। ఓం తత్సవితురిత్యాది గాయత్రీ కీలకాయ నమః నాభౌ।

## కరన్యాసః

ఓం రశ్మిమతే అంగుష్ఠాభ్యాం నమః। ఓం సముద్యతే తర్జనీభ్యాంనమః। ఓం దేవాసురనమస్కృతాయ మధ్యమాభ్యాంనమః। ఓం వివస్వతే అనామి కాభ్యాం నమః। ఓం భాస్కరాయ కనిష్ఠాకాభ్యాం నమః। ఓం భువనేశ్వరాయ కరతల కరపృష్ఠాభ్యాం నమః।

## హృదయాది అంఙ్గన్యాసః

ఓం రశ్మి హృదయాయనమః! ఓం సముద్యతే శిరసే స్వాహా । ఓం దేవాసురనమస్కృతాయ శిఖాయైవషట్ । ఓం వివస్వతే కవచాయ హుం । ఓం భాస్కరాయ నేత్రత్రయా వౌషట్ ఓం భువనేశ్వరాయ అస్త్రాయఫట్। (పైన్యాసములు చెప్పినతరువాత గాయత్రీమంత్రము చెప్పి ఆదిత్య హృదయస్తోత్రం ప్రారంభము చేయవలెను) ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహి। ధియోయోనః ప్రచోదయాత్॥

## ఆదిత్య హృదయస్తోత్రం

1. శ్లో॥. తతో యుద్ధపరిశ్రాంతం సమరేచింతయాస్థితమ్।
రావణం చాగ్రతో దృష్ట్వాయుద్ధాయసముపస్థితమ్॥

2. దేవతైశ్చసమాగమ్యద్రష్టుమభ్యాగతోరణమ్।
ఉపగమ్యాబ్రవీత్ రామమగస్త్యో భగవాన్ స్తదా॥

3. రామరామ మహాబాహో శృణు గృహ్యం సనాతనమ్।
యేన సర్వానరీన్ వత్స సమరే విజయిష్యసే॥

4. ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రువినాశనమ్।
జయావహం జపం నిత్యమక్షయం పరమం శివమ్।

5. సర్వమంగళ మాంగల్యం సర్వపాపప్రణాశనమ్॥
చింతాశోక ప్రశమనమాయుర్వర్ధన ముత్తమమ్॥

6. రశ్మిమంతం సముద్యంతం దేవాసురనమస్కృతమ్।
పూజయస్వ వివస్వంతం భాస్కరం భువనేశ్వరమ్॥

7. సర్వదేవాత్మకోహ్యేష తేజస్వీ రస్మిభావనః॥
ఏషదేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభిః ॥

8. ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివః స్కందప్రజాపతిః॥
మహేంద్రోధనదః కాలోయమః సో మోహ్యాపాం పతిః

9. పితరో వసవ స్సాధ్యా। అశ్వినౌ మరుతోమనుః॥
వాయుర్వహ్నిః ప్రజాః ప్రాణాః ఋతుకర్తా ప్రభాకరః॥

10. ఆదిత్య స్సవితాసూర్యః ఖగః పూజా గభస్తిమాన్।
సువర్ణ సదృశోభానుర్హిరణ్యరేతా దివాకరః॥

11. హరిదశ్వః సహస్రార్చిః సప్త సప్తిర్మ రీచిమాన్।
తిమిరోన్మథనః శంభుస్త్వష్టా మార్తాండ కోఽంశుమాన్॥

12. హిరణ్యగర్భః శిశిరస్తపనోఽహస్కరోరవిః।
అగ్నిగర్భోఽదితేః పుత్రఃశంఖః శిశిరనాశనః॥

13. వ్యోమనాథస్తమోభేదీ ఋగ్యజుస్సామపారగః।
ఘనవృష్టిరపాం మిత్రో వింధ్య వీథీ ప్లవంగమః॥

14. ఆతపీమండలీ మృత్యుః పింగల స్సర్వతాపనిః।
కవిర్విశ్వోమహాతేజా రక్త స్సర్వభవోద్భవః॥

15. నక్షత్ర గ్రహతారాణామధిపో విశ్వభావనః।
తేజసామపి తేజస్వీ ద్వాదశాత్మన్ నమోఽస్తుతే॥

16. నమః పూర్వాయ గిరయే పశ్చిమాయాద్రయేనమః।
జ్యోతిర్గణానాం పతయే దినాధి పతయేనమః॥

17. జయాయ జయభద్రాయ హర్యశ్వాయనమోనమః।
నమోనమః సహస్రాంశో ఆదిత్యాయనమోనమః॥

18. నమ ఉగ్రాయవీరాయ సారంగాయనమోనమః।
నమః పద్మప్రబోధాయ ప్రచండాయ నమోఽస్తుతే॥

19. బ్రహ్మేశానాచ్యుతేశాయ సూరాయాదిత్యవర్చసే।
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషేనమః॥

20. తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయమితాత్మనే।
కృత ఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయేనమః॥

21. తప్తచామీ కరాభాయ హరయే విశ్వకర్మణే।
నమస్తమోఽభి నిఘ్నాయ రుచయే లోకసాక్షిణే॥

22. నాశయత్యేష వైభూతం తమేష సృజతిప్రభుః।
పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః॥

23. ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః।
ఏష చైవాగ్నిహోత్రంచ ఫలం చైవాగ్నిహోత్రిణామ్॥

24. దేవాశ్చ క్రతవైశ్చవ క్రతూనాం ఫలమేవ చ।
యాని కృత్యాని లోకేషు సర్వేషు పరమ ప్రభుః ॥

25. ఏనమాపత్సు కృచ్ఛ్రేషు కాంతారేషు భయేషు చ।
కీర్తయన్ పురుషః కశ్చిన్నావసీదతి రాఘవ॥

26. పూజయస్వైనమేకాగ్రే దేవదేవం జగత్పతిమ్ ।
ఏతత్త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యతి॥

27. అస్మిన్ క్షణేమహాబాహో రావణంతం జహిష్యసి।
ఎవముక్త్వాతతోఽగస్త్యో జగామసయథాగతమ్॥

28. ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకోఽభవత్ తదా।
ధారయామాస సుప్రీతో రాఘవః ప్రియతాత్మవాన్ ॥

29. ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వేదం పరం హర్షమవాప్తవాన్।
త్రిరాచమ్యశుచిర్భూత్వా ధనురాదాయ వీర్యవాన్॥

30. రావణం ప్రేక్ష్య హృష్టాత్మా జయార్థం సముపాగమత్।
సర్వయత్నేన మహతా వృతస్తస్య వధేఽభవత్॥

31. అథరవిరవదన్నిరీక్ష్యరామంముదితమనాః పరమం ప్రహృష్యమాణః।
నిశిచర పతి సంక్షయం విదిత్వాసురగణమధ్యగతో వస్త్వరేతి॥

ఇతి ఆదిత్యహృదయస్తోత్రం సంపూర్ణం

ఓమ్ గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనాముపమశ్రవస్త మమ్।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతి భిస్సీద సాదనమ్॥

ఓం రాజాధిరాజాయ ప్రసహ్యసాహినే నమోవయం వైశ్రవణాయ కుర్మహే।సమేకామాన్ కామ కామాయమహ్యం కామేశ్వరో వైశ్రవణోదదాతు। కుబేరాయ వైశ్రవణాయ మహారాజాయనమః॥

ఓం సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతాయ వై నమోనమః। భవేభవే నాతి భవే భవస్వమామ్। భవోద్భవాయ నమః

ఓం అఘోరేభ్యోఽథ ఘోరేభ్యోఘోరఘోర తరేభ్యః సర్వేభ్యస్సర్వశర్వేభ్యో నమస్తే అస్తురుద్ర రూపేభ్యః॥

ఓం వామదేవాయ నమోజ్యేష్ఠాయ నమశ్రేష్ఠాయ నమోరుద్రాయ నమః కాలాయ నమః కలవికరణాయ నమో బలవికరణాయ నమోబలాయ నమోబల ప్రమథనాయ నమస్సర్వభూతదమనాయ నమోమనోన్మనాయ నమః॥

ఓం తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి। తన్నోరుద్రః ప్రచోదయాత్॥

ఓం త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్।ఉర్వారుకమివబంధనాన్మృత్యోర్ముక్షీయ మామృతాత్॥

ఓం తచ్ఛంయో రావృణీమహే। గాతుం యజ్ఞాయ। గాతుంయజ్ఞపతయే॥ దైవీ స్వస్తిరస్తునః స్వస్తిర్మానుషేభ్యః ఊర్ధ్వం జిగాతు భేషజమ్। శంనో అస్తు ద్విపదే। శంచతుష్పదే॥

ఓం శంనో మిత్ర శ్శంవరుణః శంనోభవత్వర్యమా। శం నఇన్ద్రో బృహస్పతిః శంనో విష్ణురురుక్రమః నమోబ్రహ్మణే। నమస్తేవాయో। త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి। త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మవదిష్యామి। ఋతం వదిష్యామి। సత్యం వదిష్యామి। తన్మామవతు। తద్వక్తారమవతు। అవతుమామ్। అవతువక్తారమ్। "శాన్తి శ్శాన్తి శ్శాన్తి"



## నామ నక్షత్ర రాశి, గణ నాడీ పొంతనములు

| నామాద్యక్షరము | | | | నక్షత్ర పాదములకు రాశులు | గణము | జంతువులు | నాడి |
|---|---|---|---|---|---|---|---|
| చూ | చే | చో | లా | అశ్విని 4 మేషం | దేవ | గుఱ్రం | ఆది |
| లీ | లూ | లే | లో | భరణి 4 మేషం | మనుష్య | ఏనుగు | మధ్య |
| అ | ఈ | ఊ | ఏ | కృత్తిక 1 మేషం, 3 వృష | రాక్షస | మేక | అంత్య |
| ఓ | వ | వి | వు | రోహిణి4 వృషభం | మనుష్య | పాము | అంత్య |
| వే | వో | కా | కి | మృగ 2మృష 2మిథున | దేవ | పాము | మధ్య |
| కూ | ఖం | జ | ఛ్చ | ఆరుద్ర 4 మిథున | మనుష్య | కుక్క | ఆది |
| కే | కో | హా | హీ | పున 3 మిధున 1కటకం | దేవ | పిల్లి | ఆది |
| హూ | హే | హో | డా | పుష్య 4 కర్కాటం | దేవ | మేక | మధ్య |
| డీ | డూ | డే | డో | ఆశ్రే 4 కర్కాటకం | రాక్షస | పిల్లి | అంత్య |
| మా | మీ | మూ | మే | మఖ 4 సింహం | రాక్షస | ఎలుక | అంత్య |
| మో | టా | టి | టూ | పుబ్బ 4 సింహం | మనుష్య | ఎలుక | మధ్య |
| టే | టో | పా | పీ | ఉత్తర 1 సింహం 3 కన్య | మనుష్య | గోవు | ఆది |
| పూ | షం | ణా | ఢా | హస్త 4 కన్య | దేవ | దున్న | ఆది |
| పే | పో | రా | రి | చిత్త 2కన్య 2 తుల | రాక్షస | పులి | మధ్య |
| రూ | రే | రో | త | స్వాతి 4 తుల | దేవ | దున్న | అంత్య |
| తీ | తూ | తే | తో | విశా 3 తుల 1 వృశ్చి | రాక్షస | పులి | అంత్య |
| నా | నీ | నూ | నే | అనూ 4 వృశ్చికం | దేవ | లేడి | మధ్య |
| నో | యా | యీ | యు | జ్యేష్ట 4 వృశ్చికం | రాక్షస | లేడి | ఆది |
| యే | యో | బా | బి | మూల 4 ధనుస్సు | రాక్షస | కుక్క | ఆది |
| బూ | ధా | భా | ఢా | పూ॥షాఢ 4 ధనుస్సు | మనుష్య | ముంగిస | అంత్య |
| ఖి | ఖా | ఖె | ఖో | అభిజిత్ 4 మకరం | మనుష్య | ముంగిస | అంత్య |
| జూ | జే | జో | ఖా | శ్రవణం 4 మకరం | దేవ | కోతి | అంత్య |
| గా | గీ | గూ | గే | ధనిష్ట 2 మక 2 కుంభం | రాక్షస | సింహం | మధ్య |
| గో | సా | సీ | సు | శతభిషం4 కుంభం | రాక్షస | గుఱ్రం | ఆది |
| సే | సో | దా | ది | పూ॥ భా 3 కుంభం1మీన | మనుష్య | సింహం | ఆది |
| దు | శ | ఝూ | థా | ఉ॥భా 4 మీనం | మనుష్య | గోవు | మధ్య |
| దే | దో | చా | చి | రేవతి 4 మీనం | దేవ | ఏనుగు | అంత్య |

ఈ పొంతనములు జన్మతారలతో చూడవలెను. అవి లేనిచో నామనక్షత్రముతో చూడవచ్చును. ఏకానాడి కొన్ని పనికివచ్చును. ఏక గణము పనికివచ్చును. విరోధి జంతువులు పనికిరావు

విరోధ జంతువులు :- గుఱ్ఱము - దున్నలు, గోవు - పులులు. ఏనుగు - సింహములు, కోతి - మేకలు, పాము - ముంగిసలు, పిల్లి - ఎలుకలు. పరస్పర విరోధ జంతువులు.

# ప్రతి దినము హోరా చక్రము

| సూర్యోదయాది అస్తమయం వరకూ -12 | | | | | పగటి హోరలు | | | | కాలప్రమాణము ఉదయాది 1గం॥ | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వారము | ఉ. 6 నుండి7 | 7-8 | 8-9 | 9-10 | 10-11 | 11-12 | 12-1 | 1-2 | 2-3 | 3-4 | 4-5 | 5-6 |
| ఆది | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని |
| సోమ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య |
| మంగ | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర |
| బుధ | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |
| గురు | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ |
| శుక్ర | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| శని | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర |
| సూర్యోదయాది అస్తమయం వరకూ -12 | | | | | రాత్రి హూరలు | | | | కాలప్రమాణము ఉదయాది 1గం॥ | | | |
| ఆది | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ |
| సోమ | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| మంగ | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర |
| బుధ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని |
| గురు | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర, | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య |
| శుక్ర | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర |
| శని | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |

# హోరాధిపతులు - ఫలితములు

(ప్రతి రోజు ఏ వారముతో మొదలగునో ఆ రోజునకు అధిపతియైన గ్రహముతో హోర మొదలగును. ఆదివారము ప్రారంభ రవి హోర. సూర్యునికి చేరువగా శుక్రబుధల హోర లు కాగా రవి అనంతరమివి వచ్చును. పిమ్మట వేగగమనములకల చంద్రహోర తదుపరి శని, గురు, కుజ హోరలు చేరును)

ఇందు శుభగ్రహ హోరలలో శుభ ఫలితములు, పాప గ్రహహోరలలో అశుభ ఫలములును కలుగును. గురు, శుక్రులు - పూర్ణ చంద్రుడు, వీరితో కలిసిన బుధుడు ఈ నలుగురూ శుభులు. క్షీణచంద్రుడు, సూర్య, కుజ, శనులు- వారితో కలిసిన బుధుడును - యీ అయిదుగురును పాపులు.

1. సూర్య హోర : ఉద్యోగ ప్రయత్నములకు, సాహస కార్యములకు, పై అధికారులను దర్శించుటకు, క్రయ విక్రయాదులు - సన్మానములు దస్తావేజులు వ్రాయుట - రాజకీయ వ్యవహారములు, న్యాయసంబంధ వ్యవహారములు నెరపుటకు మంచిది.

2. శుక్ర హోర : సమస్తమైన శుభకార్యములకు యోగ్యమైనది. స్త్రీపురుషుల పరస్పర సమాగమములు - క్రొత్త బట్టలు- వస్తువులు ధరించుట - ప్రయాణం-ఔషధ సేవనం-నూతన వాహనములు ఉపయోగించుట ఇత్యాదులన్నింటికి శ్రేష్ఠమైనది. నిశ్చయతాంబూలాలకు మంచిది.

3. బుధ హోర : వ్యాపార సంబంధిత కార్యములకు, వ్రాత పనులకు, ప్రయాణములకు, లెక్కలు - శిల్పం- జ్యోతిషం వంటి విద్యలు నేర్చుటకు చాలా మంచిది. స్వర్ణవస్త్ర వ్యాపారులకు కూడా.

4. చంద్ర హూర : స్త్రీసమాగమం ప్రేమవ్యవహారములు తెల్లనివస్తువుల వ్యాపారం, ఉద్యోగంలో చేరుట, ఇళ్లు మారుట, నీటిపై ప్రయాణములు, గృహాభరణ పాత్రలు కొనుటకు , వాడుటకు మంచిది.

5.శని హోర : ఇనుము మినుములు, నూనె వ్యాపారములకు యంత్రవ్యాపారములకు మంచిది. కాని ఇతరపనులకు మంచిదికాదు.

6. గురు హోర : ధనము నిల్వచేసేందుకు, వివాహవిషయాలు మాట్లాడేందుకు, పిల్లలకు ఉయ్యాల వేయుటకు, క్రొత్త పుస్తకములు పఠించుటకు, ఔషధములు సేవించుటకు, బాకీల వసూలుకు, లాటరీలకు నూత్న వస్తు వస్త్రాభరణాదు లుపయోగించుటకు మంచిది.

7. కుజ హోర : అగ్ని సంబంధమైన పనులు, సాహస కృత్యములు, క్రయ విక్రయములకు మంచిది. యధాశక్తి కృషి చేయుటకు కూడా మంచిదే. కాని ఇది అశుభసమయం. కష్టాలు నష్టాలు, విరోధాలు, చిక్కులు కలుగుతాయి. జాగ్రత్తగా ఉండాల్సిన సమయం.

ఓమ్

# శ్రీ శివమహిమ్నః స్తోత్రమ్

గజాననం భూతగణాధిసేవితం కపిత్థజంబూ ఫలచారుభక్షణమ్ ।
ఉమాసుతం శోకవినాశకారకం నమామి విఘ్నేశ్వర పాదపంకజమ్ ॥

మహిమ్నః పారం తే పరమవిదుషో యద్యసదృశీ
స్తుతిర్బ్రహ్మాదీనామపి తదవసన్నాస్త్వయి గిరః ।
అథావాచ్యః సర్వః స్వమతి పరిణామావధి గృణన్
మమాప్యేష స్తోత్రే హర నిరపవాదః పరికరః ।

అతీతః పంథానం తవ చ మహిమా వాఙ్మనసయో
రతద్వ్యావృత్యా యం చకితమభిధత్తే శ్రుతిరపి ।
సకస్యస్తోతవ్యః కతివిధగుణః కస్య విషయః
పదే త్వర్వాచీనే పతతి న మనః కస్య న వచః ॥

మధుస్ఫీతా వాచః పరమ మమృతం నిర్మితవత
స్తవ బ్రహ్మన్ కిం వాగపి సురగురోర్విస్మయపదమ్ ।
మమ త్వేతాం వాణీం గుణకథన పుణ్యేన భవతః
పునా మీత్యర్థేఽస్మి న్పురమథన! బుద్ధిర్వ్యవసితా ॥

తవైశ్వర్యం యత్తజ్జగదుదయరక్షా ప్రళయకృత్
త్రయీవస్తు వ్యస్తం తిస్రుషు గుణభిన్నాసు తనుషు ।
అభవ్యానామస్మిన్ వరద రమణీయామరమణీం
విహంతుం వ్యాక్రో శీం విదధత ఇహైకే జడధియః ॥

కిమీహః కిం కాయః స ఖలు కిముపాయ స్త్రి భువనం
కిమాధారో ధాతా సృ జతి కిముపాదాన ఇతి చ ।

అత్యైశ్వర్యే త్వయ్యనవసరదుః స్థో హతధియః
కుతర్కో౽యం కాంశ్చిన్ముఖరయతి మోహాయ జగతః ॥ 5

అజన్మానో లోకాః కిమవయవవంతో౽పి జగతా
మధిష్ఠాతారం కిం భవవిధిర నాదృత్య భవతి ।
అనీశో వా కుర్యా ద్భువనజననే కః పరికరో
యతో మందాస్త్వాం ప్రత్యమరవర! సంశేరతే ఇమే ॥ 6

త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవ మితి
ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితి చ ।
రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిల నానాపథజుషాం
నృణామేకో గమ్యస్త్వమసి పయసామర్ణవ ఇవ ॥ 7

మహోక్షః ఖట్వాంగం పరశురజినం భస్మ ఫణినః
కపాలం చేతీయత్తవ వరద తంత్రోపకరణమ్ ।
సురాస్తాం తామృద్ధిం దధతి తు భవ ద్భ్రూప్రణిహితాం
న హి స్వాత్మారామం విషయమృగతృష్ణా భ్రమయతి ॥ 8

ధ్రువం కశ్చిత్ సర్వం సకలమపరస్త్వ ధ్రువమిదం
పరో ధ్రౌవ్యా ధ్రౌవ్యే జగతి గదతి వ్యస్తవిషయే ।
సమస్తే౽ప్యే తస్మిన్పురమథన తైర్విస్మిత ఇవ
స్తువన్ జిహ్రేమి త్వాం నఖలు నను ధృష్టా ముఖరతా ॥ 9

తవైశ్వర్యం యత్నాద్యదుపరి విరించిర్హరిరధః
పరిచ్ఛేత్తుం యాతావనల మనల స్కంధవపుషః ।
తతో భక్తి శ్రద్ధాభరగురు గృణద్భ్యాం గిరిశ యత్
స్వయం తస్థే తాభ్యాం తవ కిమను ఫలతి ॥ 10

అయత్నాదాపాద్య త్రిభువన మవైరవ్యతికరం
దశాస్యో యద్బాహూనభృత రణకండూపరవశాన్ ।
శిరః పద్మ శ్రేణీ రచిత చరణాంభోరుహ బలేః
స్థిరాయా స్త్వద్భక్తేస్త్రి పురహర విస్ఫూర్జితమిదమ్ ॥ 11

అముష్య త్వత్సే వాసమధిగత సారం భుజవనం
బలాత్కైలాసేఽపి త్వదధి వసతౌ విక్రమయతః ।
అలభ్యా పాతలేఽప్యలస చలితాంగుష్ఠ శిరసి
ప్రతిష్ఠాత్వయ్యా సీద్ధ్రువ ముపచితో ముహ్యతిఖలః ॥ 12

యదృద్ధిం సుత్రామ్ణో వరద పరమోచ్చైరపి సతీ
మధశ్చక్రే బాణః పరిజన విధేయ స్త్రి భువనః ।
న తచ్చిత్రం తస్మిన్ వరివసితరి త్వచ్చరణయో
ర్న కస్యాప్యున్నత్యై భవతి శిరసస్త్వ య్యవనతిః ॥ 13

అకాండ బ్రహ్మాండ క్షయ చకిత దేవాసుర కృపా
విధేయస్యా సీద్య స్త్రినయన విషం సంహృతవతః ।
న కల్మాషః కంఠే తవ న కురుతే న శ్రియమహో
వికారోఽపి శ్లాఘ్యో భువనభయ భంగ వ్యసనినః ॥ 14

అసిద్ధార్థా నైవ క్వచిదపి సదేవాసురనరే
నివర్తంతే నిత్యం జగతి జయినో యస్య విశిఖాః ।
స పశ్యన్నీశ త్వామితరసుర సాధారణమభూత్
స్మరః స్మర్తవ్యాత్మా నహి వశిషు పథ్యః పరిభవః ॥ 15

మహీ పాదాఘాతాద్ వ్రజతి సహసా సంశయపదం
పదం విష్ణో ర్భ్రామ్యద్భు జపరిఘరుగ్ణ గ్రహగణమ్ ।

ముహుర్ద్యౌ ర్దౌస్థ్యం యాత్యనిభృత జటాతాడిత తటా
జగద్రక్షాయై త్వం నటసి నను వామైన విభుతా ॥ 16

వియద్వ్యాపీ తారాగణగుణిత ఫేనోద్గమరుచిః
ప్రవాహో వాశాం యః పృషతలఘుదృష్టః శిరసితే ।

జగద్ద్వీపాకారం జలధివలయం తేన కృతమి
త్యనేనై వోన్నేయం ధృతమహిమ దివ్యం తవవపుః ॥ 17

రథః క్షోణీ యంతా శతధృతిరగేంద్రో ధనురథో
రథాంగే చంద్రార్కౌ రథచరణపాణిః శర ఇతి ।

దిధక్షోస్తే కోఽయం త్రిపుర తృణమాడంబర విధి
ర్విధేయైః క్రీడంత్యోన ఖలు పరతంత్రాః ప్రభుధియః ॥ 18

హరిస్తే సాహస్రం కమలబలి మాధాయ పదయో
ర్యదేకోనే తస్మిన్నిజ ముదహరన్నేత్ర కమలమ్ ।

గతో భక్త్యుద్రేకః పరిణతిమసౌ చక్రవపుషా
త్రయాణాం రక్షాయై త్రిపురహర జాగర్తి జగతామ్ ॥ 19

క్రతౌ సుప్తే జాగ్రత్త్వమసి ఫలయోగే క్రతుమతాం
క్వ కర్మ ప్రధ్వస్తం ఫలతి పురుషారాధన మృతే ।

అతస్త్వాం సంప్రేక్ష్య క్రతుషు ఫలదాన ప్రతిభువం
శ్రుతౌ శ్రద్ధాం బద్ధ్వా దృఢపరికరః కర్మసు జనః ॥ 20

క్రియాదక్షో దక్షః క్రతుపతిరధీశ స్తనుభృతా
మృషీ ణామా ర్త్విజ్యం శరణద సదస్యాః సురగణాః ।

క్రతు భ్రంశ స్త్వత్తః క్రతుఫల విధాన వ్యసనినో
ధ్రువం కర్తుః శ్రద్ధావిధుర మభిచారాయ హి మఖాః ॥ 21

ప్రజానాథం నాథ ప్రసభమభికం స్వాం దుహితరం
గతం రోహిద్భూతాం రిరమయిషుమృష్యస్య వపుషా ।
ధనుష్పాణేర్యాతం దివమపి సపత్రా కృతమముం
త్రసంతం తేఽద్యాపి త్యజతి న మృగవ్యాధరభసః ॥ 22

స్వలావణ్యాశంసా ధృతధనుష మహ్నాయ తృణవత్
పురః ప్లుష్టం దృష్ట్వా పురమథన పుష్పాయుధమపి ।
యది స్త్రైణం దేవీ యమనిరత దేహార్ధఘటనా
దవైతి త్వామద్ధా బత వరద ముగ్ధా యువతయః ॥ 23

శ్మసానేష్వాక్రీడా స్మరహర పిశాచాః సహచరా
శ్చితా భస్మాలేపస్రగపి నృకరోటీ పరికరః ।
అమంగల్యం శీలం తవ భవతు నామైవ మఖిలం
తథాపి స్మర్తౄణాం వరద పరమం మంగళ మసి ॥ 24

మనః ప్రత్యక్చిత్తే సవిధ మవధాయాత్త మరుతః
ప్రహృష్య ద్రోమాణః ప్రమదసలిలోత్సంగిత దృశః ।
యదాలోక్యాహ్లాదం హ్రద ఇవ నిమజ్యామృతమయే
దధత్యంతస్తత్త్వం కిమపి యమినస్తత్కిల భవాన్ ॥ 25

త్వమర్క స్త్వంసోమ స్త్వమసిపవన స్త్వం హుతవహ
స్త్వమాప స్త్వంవ్యోమ త్వము ధరణిరాత్మా త్వమితిచ ।
పరిచ్ఛిన్నా మేవం త్వయి పరిణతా బిభ్రతు గిరం
న విద్మ స్తత్తత్త్వం వయమిహతు యత్త్వం న భవసి ॥ 26

త్రయీం తిస్రో వృత్తీస్త్రి భువనమథో త్రీనపి సురా
నకారాద్యైర్వర్ణైస్త్రి భిరభిదధ త్తీర్ణ వికృతి ।

తురీయంతే ధామ ధ్వని భిరవరుంధానమణుభిః
సమస్తం వ్యస్తం త్వాం శరణద గృణాత్యోమితి పదమ్ ॥ 27

భవః శర్వోరుద్రః పశుపతిరథోగ్రః సహమహాం
స్తథా భీమేశానావితి యదభిధానాష్టకమిదమ్ ।

అముష్మిన్ ప్రత్యేకం ప్రవిచరతి దేవ శ్రుతిరపి
ప్రియాయాస్మై ధామ్నే ప్రణిహితనమస్యోస్మి భవతే ॥ 28

నమో నేదిష్ఠాయ ప్రియదవ దవిష్ఠాయ చనమో
నమః క్షోదిష్ఠాయ స్మరహర మహిష్ఠాయ చనమః ।

నమో వర్షిష్ఠాయ త్రినయన యవిష్ఠాయ చ నమో
నమః సర్వస్మై తే తదిదమితి సర్వాయ చ నమః ॥ 29

బహుల రజసే విశ్వోత్పత్తౌ భవాయ నమో నమః
ప్రబల తమసే తత్సంహారే హరాయ నమో నమః

జనసుఖకృతే సత్త్వోద్రిక్తౌ మృడాయ నమో నమః
ప్రమహసి పదే నిస్త్రైగుణ్యే శివాయ నమో నమః ॥ 30

కృశపరిణతి చేతః క్లేశవశ్యం క్వ చేదం
క్వ చ తవ గుణసీమోల్లంఘినీ శశ్వదృద్ధిః ।

ఇతి చకితమమందీకృత్య మాం భక్తిరాధాత్
వరద! చరణయోస్తే వాక్యపుష్పోపహారమ్ ॥ 31

అసితగిరిసమం స్యాత్ కజ్జలం సింధుపాత్రే
సురతరువరశాఖా లేఖనీ పత్రముర్వీ ।

లిఖతి యది గృహీత్వా శారదా సర్వకాలం
తదపి తవ గుణానామీశ పారం న యాతి ॥ 32

అసురసురమునీంద్రై రర్చిత స్యేందు మౌళేః
గ్రథితగుణమహిమ్నో నిర్గుణ స్యేశ్వరస్య ।
సకలగుణవరిష్ఠ పుష్పదంతాభిధానో
రుచిరమలఘువృత్తైః స్తోత్రమేతచ్చకార ॥ 33

అహరహరనవద్యం ధూర్జటేః స్తోత్రమేత
త్పఠతి పరమభక్త్యా శుద్ధ చిత్తః పుమాన్యః ।
స భవతి శివలోకే రుద్రతుల్యస్తథాఽత్ర
ప్రచురతరధనాయుః పుత్రవాన్కీర్తిమాంశ్చ ॥ 34

దీక్షా దానం తపస్తీర్థం జ్ఞానం యాగాదికాః క్రియాః
మహిమ్నః స్తవపాఠస్య కలాం నార్హంతి షోడశీమ్ । 35

ఆసమాప్త మిదం స్తోత్రం పుణ్యం గంధర్వభాషితమ్ ।
అనౌపమ్యం మనోహారి శివమీశ్వర వర్ణనమ్ ॥ 36

మహేశాన్నాపరో దేవో మహిమ్నోనాపరా స్తుతిః ।
అఘోరాన్నాపరో మంత్రో నాస్తి తత్త్వం గురోః పరమ్ ॥ 37

కుసుమ దశననామా సర్వ గంధర్వరాజః
శిశుశశిధర మౌలేర్దేవ దేవస్య దాసః ।
సఖలు నిజమహిమ్నో భ్రష్ట ఏవాస్య రోషాత్
స్తవన మిదమకార్షీ ద్దివ్యదివ్యం మహిమ్నః ॥ 38

సురవరముని పూజ్యం స్వర్గమోక్షైక హేతుం
పఠతి యది మనుష్యః ప్రాంజలిర్నాన్యచేతాః ।
వ్రజతి శివసమీపం కిన్నరైః స్తూయమానః
స్తవనమిదమమోఘం పుష్పదంత ప్రణీతమ్ ॥ 39

శ్రీ పుష్పదంతముఖ పంకజ నిర్గతేన
స్తోత్రేణ కిల్బిష హరేణ హరప్రియేణ।

కంఠస్థితేన పఠితేన సమాహితేన
సుప్రీణితో భవతి భూతపతిర్మ హేశః॥ 40

ఇత్యేషా వాఙ్మయీ పూజా శ్రీమచ్ఛంకరపాదయోః।
అర్పితా తేన దేవేశః ప్రీయతాం మే సదాశివః॥ 41

యదక్షరం పదం భ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్।
తత్సర్వం క్షమ్యతాం దేవ ప్రసీద పరమేశ్వర॥

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥

ఓం శాంతిః శాంతిః శాంతిః



ఓమ్

# శ్రీ విశ్వనాథాష్టకము

గంగా తరంగ రమణీయ జటాకలాపం
గౌరీ నిరంతర విభూషిత వామభాగమ్ ।
నారాయణ ప్రియమనంగ మదాపహారం
వారాణసీ పుర్పతిం భజ విశ్వనాథమ్ ॥ 1

వాచామగోచరమనేక గుణస్వరూపం
వాగీశవిష్ణు సుర సేవిత పాదపీఠమ్ ।
వామేన విగ్రహవరేణ కళత్రవంతం
వారాణసీ పురపతిం భజవిశ్వనాథమ్ ॥ 2

భూతాధిపం భుజగభూషణ భూషి తాంగం
వ్యాఘ్రాజినాంబరధరం జటిలం త్రినేత్రమ్ ।
పాశాంకుశా భయవరప్రదశూలపాణిమ్
వారాణసీ పురపతిం భజవిశ్వనాథమ్ ॥ 3

శీతాంశు శోభితకిరీట విరాజమానం
ఫాలేక్షణానల విశోషిత పంచబాణమ్ ।
నాగాధిపారచిత భాసుర కర్ణపూరమ్
వారాణసీ పురపతిం భజవిశ్వనాథమ్ ॥ 4

పంచాననం దురితమత్త మతంగజానాం
నాగాంతకం దనుజ పుంగవ పన్నగానామ్ ।

దావానలం మరణశోక జరాటవీనామ్
వారాణసీ పురపతిం భజవిశ్వనాథమ్ ॥ 5

తేజోమయం సగుణ నిర్గుణ మద్వితీయ
మానందకంద మపరాజిత మప్రమేయమ్ ।
నాగాత్మకం సకల నిష్కళ మాత్మరూపమ్
వారాణసీ పురపతిం భజవిశ్వనాథమ్ ॥ 6

రాగాది దోషరహితం స్వజనానురాగం
వైరాగ్య శాంతినిలయం గిరిజాసహాయమ్ ।
మాధుర్య ధైర్యసుభగం గరళాభిరామమ్
వారాణసీ పురపతిం భజవిశ్వనాథమ్ ॥ 7

ఆశాం విహాయ పరిహృత్య పరస్య నిందాం
పాపేరతిం చ సునివార్య మనః సమాధౌ ।
ఆదాయ హృత్కమల మధ్యగతం పరేశమ్
వారాణసీ పురపతిం భజవిశ్వనాథమ్ ॥ 8

వారాణసీ పురపతేః స్తవనం శివస్య
వ్యాఖ్యాతమష్టకమిదం పఠతే మనుష్యః ।
విద్యాం శ్రియం విపుల సౌఖ్యమనంత కీర్తిం
సంప్రాప్య దేహవిలయే లభతే చ మోక్షమ్ ॥ 9

విశ్వనాథాష్టకమిదం యః పఠేచ్ఛివ సన్నిధౌ ।
శివలోక మవాప్నోతి శివేన సహ మోద తే ॥ 10

ఇతి శ్రీ వ్యాసమహర్షి ప్రణీతం శ్రీ విశ్వనాథాష్టకం సంపూర్ణమ్ ।



# శ్రీ పశుపత్యష్టకమ్

పశుపతిం ద్యుపతిం ధరణీపతిం
భుజగలోక పతిం చ సతీపతిమ్ ।

ప్రణతభక్త జనార్తిహరం పరం
భజతే రే మనుజా గిరిజాపతిమ్ ॥ 1

న జనకో జననీ న చ సోదరో
న తనయో నచ భూరిబలం కులమ్ ।

అవతి కోఽపి న కాలవశం గతం
భజత రే మనుజా గిరిజాపతిమ్ ॥ 2

మురజడిండిమ వాద్య విలక్షణం
మధుర పంచమనాద విశారదమ్ ।

ప్రమథభూతగణైరపి సేవితం
భజత రే మనుజా గిరిజాపతిమ్ ॥ 3

శరణదం సుఖదం శరణాన్వితం
శివశివేతి శివేతి నతం నృణామ్ ।

అభయదం కరుణావరుణాలయం
భజత రే మనుజా గిరిజాపతిమ్ ॥ 4

నరశిరోరచితం మణికుండలం
భుజగహార యుతం వృష భధ్వజమ్ ।

చితిరజోధవళీకృత విగ్రహం
భజతే రే మనుజా గిరిజాపతిమ్ ॥ 5

మఖవినాశకరం శశిశేఖరం

ప్రళయ దగ్ధసురాసుర మానవం
భజత రే మనుజా గిరిజాపతిమ్ ॥ 6

మదమపాస్య చిరం హృది సంస్థితం
మరణజన్మ జరాభయ పీడితమ్ ।
జగదుదీక్ష్య సమీపభయాకులం
భజతే రే మనుజా గిరిజాపతిమ్ ॥ 7

హరివిరించిసురాధిప పూజితం
యమజనేశ ధనేశ నమస్కృతమ్ ।
త్రినయనం భువనత్రితయాధిపం
భజతే రే మనుజా గిరిజాపతిమ్ ॥ 8

పశుపతే రిదమష్టక మద్భుతం
విరచితం పృథివీపతి సూరిణా ।
పఠతి సంశ్రుణుతే మనుజ స్సదా
శివపురీం వసతే లభతే ముదమ్ ॥ 9

శ్రీపృథివీపతి సూరి విరచితం శ్రీపశుపత్యష్టకమ్ సంపూర్ణమ్.



# శ్రీ హర్యష్టకమ్ - శ్రీ ప్రహ్లాదకృతమ్

శ్లో ॥ హరి ర్హరతి పాపాని దుష్టచిత్తై రపి స్మృతః ।
అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః ॥ 1

స గంగా స గయా సేతు స్స కాశీ స చ పుష్కరం ।
జిహ్వాగ్రే వర్తతే యస్య హరి రిత్యక్షర ద్వయమ్ ॥ 2

వారణాస్యాం కురుక్షేత్రే నై మిశారణ్య ఏవ చ ।
యత్కృతం తేన యత్ ప్రోక్తం హరి రిత్యక్షర ద్వయమ్ ॥ 3

పృథివ్యాం యాని తీర్థాని పుణ్యా న్యాయతనాని చ
తాని సర్వా ణ్యశేషాణి హరి రిత్యక్షర ద్వయమ్ ॥ 4

గవాం కోటి సహస్రాణి హేమ కన్యా సహస్రకం ।
దత్తం స్యా త్తేన యేనో క్తం హరి రిత్యక్షర ద్వయమ్ ॥ 5

ఋగ్వేదో౽థ యజుర్వేద సామవేదో ౽ ప్యథర్వణః ।
అధీత స్తేన యేనో క్తం హరి రిత్యక్షర ద్వయమ్ ॥ 6

అశ్వమేధై ర్మహాయజ్ఞై ర్నరమేధై స్తథైవ చ ।
ఇష్టం స్యా త్తేన యేనో క్తం హరి రిత్యక్షర ద్వయమ్ ॥ 7

ప్రాణప్రయాణ పాథేయం సంసార వ్యాధి నాశనం ।
దుఃఖాత్యంత పరిత్రాణం హరి రిత్యక్షర ద్వయమ్ ॥ 8

బద్ధః పరికర స్తేన మోక్షాయ గమనం ప్రతి ।
సకృ దుచ్చారితం యేన హరి రిత్యక్షర ద్వయమ్ ॥ 9

హర్యష్టక మిదం పుణ్యం ప్రాత రుత్థాయ యః పఠేత్ ।
ఆయుష్యం బల మారోగ్యం యశోవృద్ధి శ్రియావహమ్ ॥ 10

**ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః**



శ్లో॥ అంకోలం నిజబీజసంతతి రయస్కాంతోపలం సూచికా
సాధ్వీ నైజవిభుం లతా క్షితిరుహం సింధుస్సరిద్వల్లభమ్।
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిందద్వయమ్
చేతో వృత్తిరుపేత్య తిష్ఠతి సదా సా భక్తిరిత్యుచ్యతే॥

తాత్పర్యము: ఊడుగ చెట్టు తన బీజములను, సూది అయస్కాంతపు రాతిని, పతివ్రతాస్త్రీ తనభర్తను, లత వృక్షమును, నది సముద్రమును ఎట్లు ఎడబాయక పొంది యుండునో అట్లు మనోవృత్తియు భగవంతునియొక్క చరణ కమల యుగళమును యెల్లప్పుడును పొందియుండుటయే యచంచలమైన భక్తియని చెప్పబడుచున్నది.

శివానందలహరి



శ్లో॥ ఆత్మోన్నతికరం పూజాహోమాదిక మనుత్తమమ్,
క్రియాకలాపం జిజ్ఞాసు జనేభ్యో బోధయన్నయమ్,
కల్పవృక్ష సమో గ్రంథ స్సమస్త శుభదాయకః
కృపయాగురుదేవస్య జీయాదాచంద్రతారమ్॥

తాత్పర్యము: జిజ్ఞాస గల జనులకు ఆత్మోన్నతి కలిగించు, మహోత్తమమైన పూజ, హోమం మొదలైన క్రియాకలాపమును బోధించుచున్న ఈ గ్రంథము కల్పవృక్షముతో సమానమై, సర్వ జనాశ్రితయై సమస్త శుభములను ప్రసాదించుచున్నదై, ఆచంద్ర తారకము జయించుగాక!!!

వైదిక సంప్రదాయం పాటిస్తూ భగవంతుణ్ణి ఆరాధించగోరేవారికి ఈ గ్రంథం నిజంగా కల్పతరువే.

ఇందులో పూజావిధానాలు, వివిధ దేవతలకు చెందిన అష్టోత్తర శతనామాలు, స్తోత్రాలు, అష్టకాలు, లలితా సహస్ర నామం, విష్ణుసహస్ర నామం, నమకం , చమకం, శ్రీసూక్త, భూసూక్త, పురుష సూక్తాదులు మరియు హోమ ప్రకరణములో, మహా సంకల్పము, పుణ్యాహవాచనం, నవగ్రహ పూజ, గణపతి హోమము, నవగ్రహ హోమము, దేవీ, మృత్యుంజయ, గీతాహోమము మొదలైన పలు హోమాలు అయావిధానాలతో సహా నిరూపింపబడియున్నవి. ఇలా నిత్యజీవితంలో అవసరమైన ఆరాధన ప్రక్రియలన్నిటి గురించి సమాచారాన్ని అందిస్తున్న అపూర్వ గ్రంథం మీ ముందుంది. ....చదవండి

